స్యో -

# ఉపన్యాసములు

## (LECTURES ON ISAVASYA)



పండిత గోపదేవ్

C

కూరపాటి సుబ్బారెడ్డిగారి కుమారుడు
రామిరెడ్డి జ్ఞాపకార్థం

ఓమ్

# ఈశావాస్య-ఉపన్యాసములు

(యజుర్వేదము - ౪౦ అ.)

ఉపన్యాసకులు :

పండిత గోపదేవ్



సంకలనము :

చలవాది సోమయ్య

ప్రకాశకులు :

ఆర్య సమాజము - కూచిపూడి

గుంటూరు జిల్లా

# అంబా దర్శన గ్రంథమాల

## పోషక వర్గము

ఈ గ్రంథమాల ఆర్యసమాజము, కూచిపూడి (తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా) యాజమాన్యమున నడుపబడుచున్నది. ఈ సమాజము 'రిజిష్టర్డు సంస్థ'. గ్రంథమాల పేరిట తెలుగుభాషలో దర్శనములు, మహాపురుషుల జీవితములు, విజ్ఞానమునకు ధర్మమునకు సంబంధించిన పుస్తకములు ప్రకటింపబడును.

నవీనమై స్థిరముగానుండు తెలుగు సాహిత్యమును అభివృద్ధి పరుప నెంచు మహానుభావులు, సహృదయులు, శ్రీమంతులు నీ గ్రంథమాలను పోషింపగలరు.

రు. ౧౦౦౦ లు కాని అంతకు పైనకాని ద్రవ్యమును సహాయ మొనర్చువారు గ్రంథమాలకు మహారాజపోషకులుగాను, రు. ౫౦౦ లు కాని అంతకుపైనకాని విరాళమునిచ్చువారు రాజపోషకులుగాను, రు.౧౧౬ లు కాని అంతకుపైన కాని విరాళము నిచ్చువారు పోషకులుగాను గణింపబడుదురు.

రాజపోషకులయు మహారాజపోషకులయు సంక్షిప్తపరిచయము వారి చిత్రముతోపాటు ఏదేని యొక పుస్తకమున వ్రాయబడును.

నేటివరకు లభించిన

**మహారాజ పోషకులు :**

| | | |
|---|---|---|
| ౧. | శ్రీమతి కొత్తపల్లి యామినీదేవి | కూచిపూడి |
| ౨. | శ్రీ బెద్దె జగదీశ్వరయ్యశ్రేష్ఠి | సికిందరాబాద్ |
| ౩. | ,, మాశెట్టి వేంకటేశ్వరరావు | ,, |
| ౪. | ,, కొసరాజు మాధవయ్య | తెన |
| ౫. | శ్రీ డా. వై. వి. సుబ్బారావు, సరోజినీదేవి | గుంటూరు |

౬. శ్రీ గ్రంధి కామరాజు — విజయవాడ
౭. ,, కావూరి జయచంద్రవర్మ — కూచిపూడి
౮. శ్రీమతి చదలవాడ లక్ష్మమ్మ — ,,
౯. శ్రీ యం. గురవారెడ్డి — తూములూరు
౧౦. ,, చదలవాడ అచ్చేశ్వరరావు, రాజ్యలక్ష్మి — కూచిపూడి
౧౧. ,, చంద్రయ్య అండ్ సన్సు అల్వాల, సికింద్రాబాద్

## రాజపోషకులు :

౧. శ్రీ కావూరి సంగయ్య — కూచిపూడి
౨. ,, జె. వెంకట్రావు — వరంగల్
౩. ,, బి. శంకరలాల్ — హైదరాబాద్
౪. ,, యలవర్తి రామకోటయ్య, సీతారత్నమ్మ — కూచిపూడి
౫. ,, రామచంద్రరావు మహీంద్రకర్ — సికింద్రాబాద్
౬. ,, కుమ్మరి పోచయ్య — ,,
౭. ,, శ్రీమతి కొడాలి వెంకట రత్నమ్మ — కూచిపూడి

## పోషకులు :

౧. శ్రీ మేకా రామకృష్ణయ్య — కూచిపూడి
౨. ,, జాస్తి వెంకటప్పయ్య, తులశమ్మ — ,,
౩. శ్రీమతి కన్నెగంటి శైలసుత నవరత్నకుమారి — వరహాపురం
౪. శ్రీ పోలం వీరయ్యసోదరులు — సికందరాబాద్
౫. ,, కోట్ల రమణారెడ్డి — హైదరాబాద్
౬. ,, దుర్గా సత్యనారాయణ, కృష్ణవేణి — తణుకు
౭. ,, కావూరి శివరామయ్య — మోపిదేవి
౮. శ్రీమతి దాసరి రామకోటమ్మ — కూచిపూడి
౯. శ్రీ గడ్డిపాటి వేంకట కృష్ణయ్య — అమృతలూరు

# సంపాదకీయం
## (తొలి ముద్రణము)

మహర్షి దయానందసరస్వతి అడుగుజాడల్లో వైదికధర్మ ప్రచారం చేస్తున్న నైష్ఠిక బ్రహ్మచారులు – శ్రీ పండిత గోపదేవ్‌గారిని గూర్చి ఎరుగనివా రుండరు. వారి ఉపన్యాసాలు కూడ చాలమంది వినియే ఉంటారు. వారు దార్శనికులు. అంతేగాదు, ఒకప్పుడు ఎలిమెంటరీ స్కూలులో టీచరుగా కూడ పనిచేసినవారు. అందుచేత వారు ఎంత కఠిన విషయాన్నైన హేతుబద్ధంగా దృష్టాంతాలతో, ప్రమాణాలతో సామాన్యజనానికీకూడ నర్థమయ్యే భాషలో వివరించి చెప్పడంలో చాలా ఘటికులు. వేలాదిప్రజలు ఎంతో శ్రద్ధతో నిశ్శబ్దంగా వారి యుపన్యాసాలు వినుచుంటారు. ఆధ్యాత్మిక విషయాలు ఏమాత్రం అర్థంకావున్న జను లట్లా నిశ్శబ్దంతో కదలక మెదలక గంటలతరబడి కూర్చుండి వినడం సంభవింపదు. ఒకరోజు పం. గోపదేవ్‌గారి ఉపన్యాసం విన్నవారు మరి పిలువకయే వచ్చి తుదిదాక వినుచుందురు. అది వారి ఉపన్యాసముల తీరు, విశిష్టత.

పండిత గోపదేవ్‌గారు క్రీ. శ. 1968 సంవత్సరమున గుంటూరు-దివ్యజ్ఞాన సమాజ మందిరంలో ఈశావాస్య ప్రవచనం కావించారు. ఈశావాస్యోపనిషత్తు యజుర్వేదంలోని నలుబదవ యధ్యాయం. ఈశ్వరీయ మయిన యీ ఉపనిషత్తులో పదునేడు మంత్రా లున్నాయి. కాన మంత్రోపనిషత్తనియు దీని నంటారు. ఇందలి మంత్రాల నుద్దేశించి పం. గోపదేవ్‌గారప్పు డొసంగిన ఉపన్యాసాలను మిత్రుడు సోమయ్యా ఎప్పటి కప్పుడు శ్రద్ధగా వింటూ గ్రంథస్థం చేశారు. సామాన్యజనానికి కూడ సులభంగా నర్థమయ్యే వాడుకభాషలో పెక్కు ఉదాహరణలతో, ప్రమాణాలతో ఒక్కొక్క విషయాన్ని పలుకీతుల వివరిస్తూ నడచిన ... వ్రాతలో చూచిన మిత్రులు చాలమంది ముద్రించిన ...

మాకును అట్లే తోచినది. అయితే లోగడ ఈశావాస్యానికి మహర్షి దయానంద సరస్వతి భాష్యంతో నాంధ్రానువాదం ప్రకటించియే యున్నాము. అనువాద మగుటచే మంత్రములలోని భావార్థముల నంతగా దృష్టాంతాలతో పలురీతుల వివరించుట కందు అవకాశం చిక్కినది కాదు. పైగా గ్రాంథిక భాషలో రచింపబడిన గ్రంథం అది. అందుచే నీ యుపన్యాసముల కొక రూపం చేకూర్చి యిప్పు డీ విధంగా ప్రకటించుచున్నాము.

లేఖకుని పలుకులలో మిత్రుడు - సోమయ్య విషయం పాఠకులు తెలుసుకోగలరు. ఆశుధారగ నడచు ఆధ్యాత్మిక - ఉపన్యాసాలు శ్రద్ధగ వింటూ విషయాలు గుర్తించి, పిమ్మట పొరపడకుండ విన్నవి విన్నట్లు గ్రంథస్థం చేయు నాతని జ్ఞాపకశక్తి మెచ్చుకోదగినది. నిండుమనమున మిత్రుని కభ్యుదయ మాకాంక్షిస్తూ ఆధ్యాత్మికరంగంలో నాతని కృషి నెంతయు నభినందిస్తున్నాను.

(మలి ముద్రణము)

బ్రహ్మ విద్యాబోధక వేదమంత్రాలకు అర్థం వివరించు గ్రంథం కావున విషయం సామాన్యజనానికి అర్థమగుట కష్టం. అయినా హేతుబద్ధంగా దార్శనిక పద్ధతిలో సామాన్య జనానికికూడ నర్థమయ్యే వాడుక భాషలో నున్న గ్రంథం అగుటచే తొలిముద్రణం కాపీలు కొలదికాలంలోనే అమ్ముడుపోయినవి.

మలిముద్రణం యిది. పేపరురేటు చాల పెరిగింది. గ్రంథం వెల యిప్పుడు కొంత జాస్తిగ పెట్టక తప్పలేదు. పాఠకులు గ్రహింపగలరు.

తెనాలి }

ఇట్లు
జాస్తి వేంకట నరసింహారావు

# లేఖకుని పలుకులు

పూజ్యపాదులు, మద్గురువర్యులు అయిన పండిత శ్రీ గోపదేవ్‌గారి పరిచయభాగ్య మబ్బి యిప్పటికి దాదాపు 4 వత్సరము లయినది. 1968 ఫిబ్రవరిలో శ్రీ కమలిబాబా అధ్వర్యమున విజయవాడలో విశ్వమత మహా సభలు జరిగినవి. అందు పలువురు వక్తలు తమతమ మతములను గూర్చి ప్రసంగించిరి. ఆ సభలలోనే శ్రీ గోపదేవ్‌గారు కూడ వైదికసిద్ధాంత మును ప్రతిపాదించిరి. వేదసిద్ధాంతము అన్యమతములకన్న మిన్న యని సహేతుకముగ నిరూపించిరి. ఆ సభలలో క్రైస్తవ, మహమ్మదీయ, పౌరాణికాది మతములపై ప్రసంగించిన వక్త లనేకు లుండిరి. కాని వారి ప్రసంగము లన్నియు, శ్రీ గురుదేవుల ప్రసంగములతో పోల్చిన, దినకరుని (సూర్యుని) ఎదుట దివిటీచందమున వెలవెలబోయినవి. నేను ఎంతయో ముగ్ధుడనైతిని. ఆ సభలలో శ్రీ గురుదేవులు ముఖ్యముగా వ్యక్తి ఆరాధన కూడదనియు, వ్యక్తులు వా రెంతటి గొప్పవారైనను భగవంతునితో తుల్యులు కారనియు, కనుక సృష్టిస్థితి లయములకు కర్తయైన పరమేశ్వరు నొక్కనినే భజింపవలెననియు, పౌరాణికులు ప్రతిపాదించెడి అవతార వాదము (సర్వవ్యాపకుడగు పరమేశ్వరుడు లోకము నుద్ధరించుటకు శరీర ధారియై వచ్చు ననెడి వాదము) సరియైనది కాదనియు సహేతుకముగ వివరించుచు వేదప్రమాణముల నొసగుచు గంభీరోపన్యాసము గావించిరి. సభ యావత్తు మంత్రముగ్ధమైనది. కాని కొందరు పిడివాద పరాయణులు ప్రశ్నల వర్షమును కురిపించుచు శ్రీ గురుదేవుల ప్రసంగమునకు ప్రతిబంధ కము కల్పింప యత్నించిరి. శ్రీ గురుదేవులు ధీరులై వారి ప్రశ్నల నన్నింటిని సహేతుకముగ ఖండించిరి.

వారి ఉపన్యాసములను విన్నతరువాత నేను అంతకుపూర్వము ముగ విశ్వసించిన శంకరాద్వైత సిద్ధాంతమునందు లోపములుకలవని

కొంటిని. ఆ సభలలోనే శ్రీ గురుదేవులతో పరిచయము కలిగించుకొని నా సంశయములను కొన్నింటిని వారి నడిగి తీర్చుకొంటిని.

వారి ఉపన్యాసములు విన్నతరువాత అవి ఎంతయో అమూల్యములనియు, వానిని గ్రంథస్థముచేయుట మంచిదనియు, అవి లోకమున కుపకరించుననియు నేను దృఢముగ విశ్వసించితిని. తదాదిగ నేను శ్రీ గురుదేవులవద్ద విన్న జిజ్ఞాసువుల ప్రశ్నలకు జవాబులు (personal topics) గ్రంథస్థము చేయుచుంటిని. ఒకమారు శ్రీ గురుదేవులు గుంటూరుతాలూకా ముట్లూరులో ఉపన్యసించుచుండిరి. అచటి కేగి, శ్రీ గురుదేవులకు నేను వ్రాసిన వారి ప్రశ్నోత్తర రూపక ప్రసంగములను చదివి వినిపించితిని. అవి విన్న తదుపరి చిరునగవుతో 'ఫరవాలేదయ్యా, ఇతడు మనకు పనికివస్తాడు' అని శ్రీ గురుదేవులు శ్రీ జాస్తి వేంకటనరసింహారావుగారితో ననిరి. ఆ మాటలు నా కెంతయో ప్రోత్సాహము కలిగించినవి.

శ్రీ గురుదేవులతో ఎక్కువ పరిచయము కలిగిన అనంతరము గుంటూరులో వారి ఉపన్యాసములు ఏర్పాటుచేయు తలంపు కలిగినది. శ్రీ బోడపాటి బ్రహ్మయ్యగారు, శ్రీ బొడ్డపాటి సాంబిరెడ్డిగారు తదితర మిత్రులందుకు పూనుకొని చాల సహకరించిరి. గుంటూరు దివ్యజ్ఞాన సమాజ మందిర ప్రాంగణము (Theosophical Lodge) లో శ్రీ గురుదేవుల ఉపన్యాసములు 24-12-1968 న ఈశావాస్యోపనిషత్తుపై ప్రారంభమయినవి. నేను వానిని గ్రంథస్థముచేయ నడుముకట్టితిని.

నాకు తెలుగు సంక్షిప్తలేఖనము (Short hand) తెలియదు. వారి ఉపన్యాసములను పూర్ణముగ గ్రంథస్థముచేయ సంకల్పము కలదు. కాని ? ఏకాగ్రచిత్తుడనై వారి ఉపన్యాసములను వినుచు చేయిసాగినవరకు త్వరగా కొన్నివిషయములు (points) పుస్తకములో వ్రాసికొనెడివా

దను. అనంతరము ఇంటికివెళ్ళి విన్నదానిని మరల స్మరించుకొని మనస్సులో స్థిరముచేసికొనుటకు ప్రయత్నించెడివాడను. ప్రసంగమధ్యమున వారు ఉదహరించెడి వేదమంత్రములను, ఉపనిషద్వాక్యములను ఇంటివద్ద వారిచే చెప్పించుకొని వ్రాసికొనెడివాడను. తరువాత క్రమముగ ఉపన్యాసములను గ్రంథస్థముచేసి వానిని శ్రీ గురుదేవులకు వినిపించితిని. లోపములున్న చోట వారు సవరించిరి. సాధారణముగ శ్రోతలకు విషయము తెలియుటకుగాను ఉపన్యాసములలో సందర్భానుసారముగా, చెప్పిన విషయములనే మరల చెప్పుట తటస్థించును. నేను తెలియక వానినిగూడ గ్రంథస్థము చేసితిని. అట్టివానిని శ్రీ గురుదేవులు సాధ్యమయినంతవరకు ఈ గ్రంథము నుండి తొలగించిరి, చదువరులకు విసుగు కలుగకుండుటకై. ఎట్టకేలకు గ్రంథము పూర్తి అయినది.

ఉభయభాషా ప్రవీణులు శ్రీ జాస్తి వేంకట నరసింహారావుగారు (శ్రీ గురుదేవుల గ్రంథములకు సంపాదకులు) ఈ గ్రంథమును పరిశీలించి స్థూలదోషములను సవరించి గ్రంథమున కొకరూపము చేకూర్చి సుందరముగ ముద్రించుటకు ఎంతయో శ్రమించిరి. వారి కెంతయు కృతజ్ఞుడను.

గుంటూరు
ది 8-12-1971

ఇట్లు
బుధజన విధేయుడు
చలవాది సోమయ్య

//

ఓ౩మ్

# యజుర్వేదము - 40 వ అధ్యాయము

## ( ఈ శా వా స్యో ప ని ష త్ )

గుంటూరు, 24-12-1968

మంగళవారం, సా. గం. 6-00

ఈ దినము పెద్దలు చాలమంది సభకు విచ్చేసిరి. దివ్యజ్ఞానసమాజ మందిరపు గది శ్రోతలచే క్రమముగా నిండి కూర్చుండుటకును కొందరికి చోటు చాలలేదు. ఆహ్వానసంఘము తరపున శ్రీ జాస్తి వేంకట నరసింహారావుగారు పరిచయవాక్యములు పలికి, శ్రీ కల్లూరి చంద్రమౌళిగారిని (మాజీ దేవాదాయశాఖా మంత్రి) సభాప్రారంభకులుగా ఆహ్వానించిరి. నన్ను ప్రార్థనచేయ పిలిచిరి. "ఎవ్వనిచే జనించు జగము........" అను ప్రార్థన పద్యమును చదివి శ్రోతలలో వెళ్ళి కూర్చుండి జరుగబోవు కార్యక్రమ విశేషములను గ్రంథస్థము (Record) చేసికొనుచుంటిని. తదుపరి శ్రీ చంద్రమౌళిగారు తమ ప్రారంభోపన్యాసములో ఆస్తికతను గూర్చియు శ్రీ దయానందాది మహర్షుల విశిష్టతను గూర్చియు కొలదిసేపు ముచ్చటించి తదుపరి శ్రీ గోపదేవ్‌గారిని గురించి యీ విధంగా అన్నారు.

"ఇకపోతే శ్రీ గోపదేవ్‌గారిని గూర్చి నాలుగుమాటలు చెపి విరమిస్తాను. నా ఉద్దేశ్యములో వీరు గొప్ప పండితులు, ఋషులు, యోగి పుంగవులు నని. వీరు కొన్ని ప్రత్యేక పరిస్థితులలో యిల్లు విడిచిరి. మొ: మొన్నటివరకును భిక్షాటనచేయుచు (అంటే ఎవరైనను తమను ఆహ్వా నించగా వెళ్ళి భోజనము చేయుచు) విద్యాప్రచారము చేయుచుండినవా—

కాశీ మొదలగు విద్యాకేంద్రములలో వేదములను, దర్శనములను, ఉపనిషత్తులను, గీత, బ్రహ్మసూత్రాది గ్రంథములను క్షుణ్ణముగా చదువుకొనిన వారు. ఎవరైనను ఈ శాస్త్రగ్రంథములలో అనుమానముగాని, ప్రజ్ఞాపాటవముగాని యున్నచో వీరి నడిగి తెలిసికొనవచ్చును; లేక వీరితో చర్చింపవచ్చును. వీరుకూడ సత్యము నంగీకరించుటయందును, అసత్యమును విడనాడుటయందును ఆసక్తి చూపువారే. వీరు ఆ జన్మము సంపూర్ణముగా త్రికరణశుద్ధిగా బ్రహ్మచర్యమును పాలించుచున్న నైష్ఠికబ్రహ్మచారులు. వీరు ఎక్కువగా ఉత్తరదేశమునందు కాలము గడిపిరి. యోగాభ్యాసమున దిట్టలు. వీరికి కొందరు మహారాజులుసైతము శుశ్రూషలుచేసి వీరియొద్ద యోగాభ్యాసరహస్యములను గ్రహించినవారు కలరు. వీరు ధనమును కూడబెట్టవలయు ననెడి అపేక్షకలవారు కారు. నేను వీరినిగూర్చి అతిశయోక్తులు చెబుతున్నానని మీరనుకుంటున్నారేమో కాని, నేను నిజమునే చెబుతున్నాను. కావలెనంటే మీరు వీరిని పరీక్షింపవచ్చును. అట్లు పరీక్షయుట అవసరమనికూడ నేను నమ్ముచున్నాను. వీరు మహర్షి దయానందుని శిష్యులు. వారి సిద్ధాంతములను, వేదధర్మములను ప్రచారముచేయు రు. వీరిని ఈ సభాముఖమున ఉపన్యసింపవలసినదిగా కోరుచున్నాను. కీ సదవకాశము నిచ్చిన ఆహ్వానసంఘమువారికి ధన్యవాదములు."

తదుపరి శ్రీ గోపదేవ్‌గారు వేదిక నలంకరించిరి. దైవప్రార్థన ౨. నిర్మలము, ప్రశాంతమునైన మోముపై చిరునగవు చిందులుద్రొక్క ఉపన్యాసము నిట్లు కొనసాగించిరి.

జనులార !

మిత్రులు కొందరు నన్నిచటికి ఆహ్వానించి ఉపన్యసింపగోరిరి. జునుండి వరుసగా పది పండ్రెండు దినములు సాయంత్రం 6 గం. 7-30 గం. వరకు యీ ఉపన్యాస కార్యక్రమము జరుగుతుంది,

శ్రీ చంద్రమౌళిగారు నన్నుగురించి పెద్దపెద్ద మాటలు చెప్పిరి. (చిరునగవుతో) అవన్నీ మఱచిపోండి. నా నేర్చినవిధముగ ఉపనిషత్తుపై ఉపన్యసించుటకు ప్రయత్నింతును.

"వేదోఽఖిలో ధర్మమూలం" అంటే సమస్త ధర్మములకు మూలము వేదమని అర్థము. మానవునికి కావలసిన విజ్ఞానము సర్వము వేదములలో బీజరూపముగా నున్నదని వైదికుల మతం. వేదములనే సంహితలు అనికూడ అంటారు. ఈ వేదమంత్రములను మహర్షులు తమ తమ సమాధ్యవస్థలలో దర్శించి మంత్రద్రష్టలైనారు. అనగా మంత్రము లును, వాని అర్థములును వారికి సమాధ్యవస్థలలో అనుభూతములైనవి. ఇట్లు వేదమంత్రములను, వాని అర్థములను దర్శించి అనుభూతము చేసి కొన్న వారిలో పురుషులేకాక స్త్రీలుకూడ కొందరు కలరని వేదములను చదువుకొన్నవారికి అర్థమవుతుంది.

ఒక వస్తువుయొక్క అస్తిత్వమును అంగీకరించాలన్నా, నిరాకరించా లన్నా మనకు ప్రమాణ మొకటి అవసరం. ప్రమాణములు నాలుగు విధము లుగా ఉన్నై. చార్వాకులు ప్రత్యక్షప్రమాణమును మాత్రమే అంగీకరించెడి వారు. బౌద్ధులు ప్రత్యక్షము, అనుమానము అను రెండు ప్రమాణములను అంగీకరించెడివారు. మరికొందరు ఆ రెండునుగాక ఉపమాన ప్రమాణమును కూడ అంగీకరింతురు. మన ప్రాచీన మహర్షులు, దర్శనకారులునైన గౌతమమహర్షి, కణాదమహర్షి నాలుగువిధములైన ప్రమాణములను అంగీకరించిరి. శ్రీ గౌతమ, కణాద మహర్షులు సుమారు 3 లేక 4 వేల సంవత్సరముల క్రితము వసించి యుండిరని ఐతిహాసికుల (Historians) ఊహ. ఈ కాలనిర్ణయం సరియైనది అవునో కాదో మనకు తెలియదు.

ప్రమాణములు ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము. శబ్దము అని నాలుగు విధములు. "లక్షణ ప్రమాణాభ్యాం వస్తు సిద్ధిః"– లక్ష లను బట్టి, ప్రమాణములనుబట్టి యిది ఫలానా వస్తువు అని నిర్ణయించు

జరుగుతుంది. ఒక వస్తువుయొక్క అభావమును నిర్ణయించుటకు సైతం ప్రమాణములు ఆవశ్యకములే. ప్రమ - అంటే జ్ఞానము, ప్రమాణమంటే జ్ఞాన సాధనం. కన్నులు, చెవులు, ముక్కు, చర్మము. నాలుక అను ఇంద్రియములద్వారా జ్ఞానము కలుగును. కావున ఇంద్రియములు ప్రమాణము లగును. వీనివలన కలుగు జ్ఞానము ప్రత్యక్షజ్ఞానమగును. అక్షి అంటే కన్ను, అక్షము అంటే ఇంద్రియము. ప్రతి+అక్షము=ప్రత్యక్షము- ప్రతి ఇంద్రియము. ఇంద్రియముద్వారా తెలియబడు జ్ఞానము ప్రత్యక్ష జ్ఞానం అవుతుంది. నేత్రముద్వారా దృశ్యములను చూచి తెలిసికొనడం, చెవులద్వారా శబ్దములను విని గ్రహించడం, చర్మముద్వారా స్పర్శజ్ఞానం కలగడం, ముక్కుద్వారా వాసనచూచి తెలిసికొనడం యివన్నీకూడ ప్రత్యక్ష జ్ఞానం క్రిందికి వస్తాయి.

ఇక అనుమానప్రమాణము. ప్రత్యక్షపూర్వకంగా అనుమానము కలుగుతుంది. అను అంటే తరువాత, మానము అంటే తెలియబడునది అని అర్థం. అనుమానము అంటే ముందు ఒక వస్తువును ప్రత్యక్షముగా చూచి, తరువాత దానిమూలమున వేరొకవస్తువు నూహించడం. ఉదాహరణకు: పొగను చూచి అచట నిప్పు ఉన్నది అని తెలిసికొంటాం. నిప్పు ఉన్నచోట కొన్ని సమయాలలో పొగ లేకపోవచ్చును. కాని పొగ వున్న చోట నిప్పు తప్పనిసరిగా ఉంటుంది. కనుక పొగ ప్రత్యక్షప్రమాణము వలన తెలియబడింది. పొగనుబట్టి నిప్పు ఉన్నదని ఊహించడం జరుగుతుంది. ఇట్లు ఊహించడమే అనుమాన ప్రమాణం. దానివలన కలిగిన జ్ఞానం అనుమితజ్ఞానం అంటారు.

మూడవది ఉపమాన ప్రమాణం. వస్తువును ఉపమించి తెలిసికొనడం. అంటే ఒకదానిని చూచి దానిసాదృశ్యమును మరొకదానియందు యది ఫలానా అని తెలిసికోవడం. ఉదాహరణకు: 'గోసదృశో యః' గోవువంటిది గవయము. అడవిగోవునకు 'గవయము' అని

పేను. గోవు లక్షణములే గవయమునకు ఉంటాయి అని తెలిసికొంటే, అడవిలో దానిని చూచినపుడు అది గవయ మని గుర్తుపట్టగలం. ఇచట సాదృశ్యజ్ఞానంవల్లనే వస్తువు తెలియబడుతుంది. కనుక సాదృశ్యజ్ఞానము ఉపమానము అని భావం.

ఈ మూడు ప్రమాణములద్వారానే మనం వస్తువులయొక్క భావ, అభావములను తెలుసుకొంటాం. కాని, యీ ప్రమాణములతోనే ప్రపంచంలోని వస్తురాశి నంతటిని తెలసికొనలేం. అందుచేత నాల్గవది యైన శబ్దప్రమాణమునుకూడ మనం అంగీరించాలి.

"ఆప్తవాక్యం శబ్దప్రమాణం." ఆప్తుని వాక్యము శబ్దప్రమాణము. ఆప్తుడంటే ఎవరు? 'ఆప్తస్తు యథార్థవక్తా'- యథార్థము చెప్పేవాడు ఆప్తుడు. అతడు అబద్ధమాడడు. చూచినది చూచినట్లు, విన్నది విన్నట్లు, తెలిసినది తెలిసినట్లు చెప్పగలిగిఉంటాడు. అతడే ఆప్తుడు. ఇందుకు విరుద్ధముగ పలుకువాడు ఆప్తుడుకాడు. 'సాక్షాత్కృత ధర్మః ఆప్తః'- అంటే అతడు వస్తుధర్మములను బాగుగా తెలిసినవాడై ఉంటాడు. నే నొక మోటువిషయం చెపుతాను. అలాగైతే గాని ఈ శబ్దప్రమాణం బాగుగా అర్థంకాదు. ఒక తండ్రికి పుత్రుడున్నా డనుకోండి. తండ్రికిమాత్రం తన కొడు కెవరో తెలియును కాని, పుత్రునికి తన తల్లిదండ్రులెవరో తెలియదు. ఇచట ప్రత్యక్ష ప్రమాణం, అనుమానప్రమాణం, ఉపమానప్రమాణం యివేవి పనిచెయ్యవు. పిల్లవాడు తాను పుట్టినపుడు తన తల్లిదండ్రు లెవరో అతనికి తెలియదు. అతడు ప్రత్యక్షముగా చూడలేదు. అపు డతని కా జ్ఞానం లేదు. కనుక ప్రత్యక్ష ప్రమాణ మిచట పని చెయ్యదు. మిగిలిన అనుమాన, ఉపమాన ప్రమాణముల ద్వారా కూడా తన తలిదండ్రులెవరో పిల్లవాడు తెలిసికొనలేడు. మరి తన తలిదండ్రు లెవరో ఎలా తెలుస్తుంది? పిల్లవాడికి తల్లి ... తుంది. ఈయన మీనాన్న అని. ఈయన మీ నాన్న అని చెప్పడమే కాక...

తాను తల్లినని కూడ పిల్లవానికి చెబుతుంది. తల్లి మాటలద్వారా పిల్లవాడు తన తలిదండ్రులెవరో తెలుసుకుంటాడు. కావున యిచట తల్లిమాటలే శబ్దప్రమాణం. సరే! యీ సృష్టిలో ఉండే జీవులందరకు తల్లివంటివా డెవరు? పరమేశ్వరుడు. కనుక అతడు జీవులకు పరమ ఆప్తుడు. ఈశ్వ రుని ద్వారా జీవులకు ప్రసాదింపబడిన జ్ఞానమే వేదము. వేదవాక్యములు ఆప్తవాక్యములు కనుక వేదము శబ్దప్రమాణముగా గ్రహింపబడుచుంది.

వేదములు స్వతః ప్రమాణములని మన ఋషులు అంగీకరించు తారు. స్వతః ప్రమాణమంటే వేదములలో తెలుపబడిన జ్ఞానమునకు వేరే ప్రమాణ మేమి అవసరంలేదు. దానికదియే ప్రమాణం. ఉదాహరణకు: దీపమున్నదనుకోండి. దానిని చూపించుటకు వేరే దీపం అవసరంలేదు. ఆ దీపం తన్నుతాను చూపించుకొంటుంది. ప్రక్కనేఉన్న వస్తువులనుకూడ చూపుతుంది. అట్లాగే సూర్యుడు, సూర్యుని చూపించుటకు వేరొకసూర్యుడు అవసరంలేదు. అలాగే వేదములు స్వతః ప్రమాణములు. వేదములు కాక మిగిలిన గ్రంథములన్నికూడ పరతః ప్రమాణము లనబడును. అంటే బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, ఉపనిషత్తులు మొదలయినవన్నీ వేదాను కూలతయా ప్రమాణములు. మహర్షులు, శంకరుడు, రామానుజుడు, మధ్వుడు మొదలగు ఆచార్యులుకూడ వేదములను స్వతః ప్రమాణములుగా అంగీక రించుతారు.

ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణ వేదముఅని వేదములు నాలుగు. పూర్వం యివి అచ్చులో లేవు. ఇపుడు ముద్రితములై మనకు దొరుకుచున్నవికూడ. మానవుడు సంఘజీవి. అతడు చేయవలసిన (కర్తవ్య) కర్మలు వేదమునందు చెప్పబడి ఉన్నాయి. వీనినే వేదవిహిత కర్మలు అంటారు. ఈ కర్తవ్య కర్మలు మానవు లాచరించినట్లయితే ము సుభిక్షంగా ఉంటుంది. పూర్వము వేదములను స్త్రీ, పురుష దం లేక అందరు మానవులు చదివేవారు. వేదమంత్రములను కొందరు

స్త్రీలుకూడ ప్రచారం చేసినట్లు ముద్రిత వేద గ్రంథములు చూచినపుడు మనం గ్రహించగలం. కాని యీ మధ్యకాలంలో ఎవరో కొందరు 'స్త్రీ శూద్రౌ నాధీయాతాం'-స్త్రీలును, శూద్రులును వేదములను పఠింపరాదు. అని ఆంక్షలుపెట్టి పురుషులలో శూద్రులకేకాక అన్నివర్ణములలోని స్త్రీలకు కూడ యీ వేదవిజ్ఞానం లేకుండ చేశారు. ద్విజులు వేదములు పఠించుటకు అర్హులని, తదితరులు అనర్హులని ప్రచారం చేశారు. ఇది వేదసమ్మతంకాదు. *వేదములందే స్త్రీ శూద్రాది సమస్త మానవకోటి వేదమును చదువవచ్చునని యున్నది. వేదము చదువనిదే మానవుడు చేయవలసిన (కర్తవ్య) కర్మలు ఎలా తెలుస్తాయి?

శంకరాచార్యునకు పూర్వం జైన బౌద్ధమతములు విశేషవ్యాప్తిలో ఉండేవి. వీనిని అవైదిక మతములనెడివారు. అంటే యివి వేదవిరుద్ధములైన మతములని. తరువాత శంకరుడు అద్వైత మతమును విశేషవ్యాప్తిలోనికి దెచ్చాడు. శంకరునికి పూర్వమే గౌడ పాదాచార్యులతో అద్వైత మతం ప్రారంభమయినది. గౌడ పాదుల తరువాత గోవిందాచార్యులు, తరువాత వారి శిష్యుడైన శంకరాచార్యుడు అద్వైత మతసంప్రదాయమును విశేషవ్యాప్తిలోనికి దెచ్చారు. భగవద్గీత, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు అను వానికి ప్రస్థానత్రయమని పేరుపెట్టి శంకరుడు, వానికి అద్వైత సిద్ధాంత పరముగా తన భాష్యమును వ్రాసినాడు. అద్వైతులు నాలుగు వాక్యములకు - ("అహం బ్రహ్మాస్మి", "తత్త్వమసి", "అయమాత్మా బ్రహ్మ", "ప్రజ్ఞానం బ్రహ్మ") మహా వాక్యములని పేరుపెట్టి తమ సిద్ధాంతమును ప్రచారము చేసికొనుటకు విశేషముగా ఉపయోగించుకొన్నారు. కొందరీ వాక్యములు వేదములోనివని తలుస్తారు. ఇవి వేద

* "యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః। బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ చ స్వాయ చారణాయ చ" -యజు. 26.

వాక్యములు కావు. నాలుగు వేదములలో ఎచ్చట వెదకినను యీ వాక్యములు మీకు కనిపించవు. ఇవి వేదవాక్యములని జనులను భ్రమింపజేశారు. భ్రమ, భ్రాంతి, విపర్యయము - యీ పదాలన్నీ సమానార్థ బోధకములు. 'అతస్మిన్ తద్ బుద్ధిః'- అతస్మిన్ = అది కాని దానియందు, తత్ = అది అను బుద్ధికలగడం భ్రమ. అనగా త్రాడును పామనుకోవడం, ముత్యపు చిప్పను వెండి అనుకోవడం యిత్యాదులు భ్రమలు. మహావాక్యములు వేద వాక్యములు కావు. ఇవి ఉపనిషత్ వాక్యములు. వీనిని మీరు ఛాందోగ్యాది ఉపనిషత్తులలో చూడగలరు. అద్వైత మతప్రచారకుడైన శంకరుడు, విశిష్టాద్వైతమతప్రవర్తకుడైన రామానుజుడు, ద్వైతమతస్థాపకుడైన మధ్వుడు వీరందరు పై వాక్యములను తమతమమతానుసారంగా వివేచించియున్నారు.

భగవద్గీత, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు యీ మూడింటికి శంకర, రామానుజ, మధ్వాచార్యులు మువ్వురు తమ తమ మతానుకూలంగా భాష్యము వ్రాశారు. కాని, వీరు మువ్వురును ఒకే గ్రంథమునకు భిన్న భిన్న భాష్యములు వ్రాశారు. శంకరుడు వ్రాసిన భాష్యము ద్వైత, విశిష్టాద్వైతులకు నచ్చదు. రామానుజుడు వ్రాసిన భాష్యము అద్వైతులకు, ద్వైతులకు నచ్చదు. మధ్వుడు వ్రాసిన భాష్యము అద్వైత. విశిష్టాద్వైతు లంగీకరింపరు. ఈవిధంగా త్రిమతాచార్యులు పరస్పరవిరుద్ధంగా ప్రస్థాన త్రయమునకు భాష్యములను వ్రాసికొని, అసలు మూలగ్రంథము లేమి చెప్పుచున్నవో అర్థము కాకుండచేసిరి. గ్రంథకర్త తన పుస్తకమున ఒకే విషయమును చెప్పవలెను. ఒకే గ్రంథమునందు పరస్పర విరుద్ధవిషయములను చెప్పరాదు. ఉపనిషత్తులను, బ్రహ్మసూత్రములను, గీతను రచించిన గ్రంథకర్తలు తమ గ్రంథములందు పరస్పర విరుద్ధ విషయములను ప్రతిపాదింపరు. కాని యీ మూలగ్రంథములకు ఆచార్యులు పరస్పర విరుద్ధ ... భాష్యములు వ్రాసికొనిరి. అందుచేత మనకు మూలగ్రంథమునందలి ...లు ప్రతిపాద్య విషయ మేమిటని సంశయము కలుగుతుంది. "న హి

సంశయ మనారుహ్యా నరో భద్రాణి పశ్యతి"- సంశయింపని మనుజుడు భద్రమును చూడలేడు. అంటే నిజమేమిటో తెలిసికొనలేడు. కనుక త్రిమతాచార్యులు ప్రతిపాదించిన అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత సిద్ధాంతములలో ఏది సత్యమో తెలిసికొనుటకు మనం వేద సిద్ధాంతంతో వీనిని పరిశీలింపవలసియున్నది. వేదములకు శ్రుతియని పేరు. "శ్రుతిస్మృతి విరోధేతు శ్రుతిరేవ గరీయసీ" — అంటే, శ్రుతు లనబడు వేదమునకు స్మృతులతో విరోధము కలిగినపుడు శ్రుతి చెప్పుదానినే అంగీకరింపవలెనని పరాశరాది మహర్షు లంగీకరించారు. కనుక త్రిమతాచార్యులు ప్రస్థానత్రయమునకు వ్రాసిన భాష్యములను వేదదృష్టితో పరీక్షించినపుడు ముగ్గురు రచించిన భాష్యములును యథార్థ విషయమును ప్రతిపాదించుట లేదని తోచుచున్నది.

భగవద్గీత : ఇది భారతములో భాగము. భారతం ఇతిహాసం. ఇతిహాసము అంటే చరిత్ర. గీత మహాభారత భీష్మ పర్వాంతర్గతమైయున్నది. ఇది వ్యాసరచితము. కొందరు గీతను ఉపనిషత్తుగనే ప్రచారం చేస్తున్నారు. "గీతాసూపనిషత్సు" - అనికూడ గ్రంథములో వ్రాయుచున్నారు. ఉపనిషత్తులలోని శ్లోకముల ననుసరించి సమానార్థకములుగా కొన్ని శ్లోకములు గీతలో రచింపబడి యుండవచ్చును. అంతమాత్రమున భగవద్గీత ఉపనిషత్తు ఎట్లు కాగలదు? ఇది యిట్లుండగా ఉపనిషత్తులకేమో-వేదశిరస్సులని, వేదశిఖలని, వేద+అంతములని వేరుపెట్టి ప్రచారం చేయుచున్నారు. ఉపనిషత్తులను వేదాంతము లనేటట్లయితే 4 వేదములకు నాల్గు ఉపనిషత్తులు మాత్రమే ఉండవలెను. కాని ప్రస్తుతము ఉపనిషత్తుల పేరుతో సుమారు నాలుగు లేక అయిదువందల పుస్తకములు ప్రచారములోఉన్నవి. వీనిలో సాంప్రదాయికులు (అద్వైతాది మత సాంప్రదాయికులు) 10 ఉపనిషత్తులను మాత్రమే ప్రమాణములుగా అంగీకరించారు. అవి ఈశ, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, ఛాందోగ్య

బృహదారణ్యకము అను ఉపనిషత్తులు. ఇవిగాక శ్రీ శంకరుడు శ్వేతాశ్వతరోపనిషత్తు, మైత్ర్యుపనిషత్తు అను రెండుపనిషత్తులకు భాష్యము వ్రాసినట్లు చెప్పుచున్నారు. అందులో శ్వేతాశ్వతరోపనిషత్తునకు వ్రాసిన భాష్యము శంకరుడు వ్రాయలేదు. వేరే యెవరో వ్రాసిరని కొందరభి ప్రాయపడుతున్నారు.

ఇవిగాక నారాయణోపనిషత్తు, అల్లోపనిషత్తు, భస్మోపనిషత్తు, ఋద్రాక్షరోపనిషత్తు, గర్భోపనిషత్తు, ఇత్యాది కల్పితోపనిషత్తు లనేకములు కలవు. తుదకు అల్లా పేరుతో అల్లోపనిషత్ కూడ ఎవరో వ్రాశారు. మరి ఉపనిషత్తులలో వేద+అంతములు లేక వేదశిరస్సులు అనబడు ఉపనిషత్తులు లేవా అని అంటే ఒకేఒక ఉపనిషత్తు ఉన్నది. అది "ఈశావాస్యోపనిషత్తు" లేక "ఈశోపనిషత్తు" అనికూడ పిలువబడుతున్నది. ఇది మంత్రభాగము.

ఇక వేదమంత్రములకు వ్రాసిన వ్యాఖ్యానాదులు-అనగా, ఆరణ్యకములు, బ్రాహ్మణములు వేదములు కావు.

"తస్మాద్ యజ్ఞాత్ సర్వహుత ఋచః సామాని జజ్ఞిరే
ఛందాంసి జజ్ఞిరే తస్మాద్ యజుస్తస్మా దజాయత"

-ఋగ్వేదం ౧౦-౯౦-౯.

తా. సర్వప్రాణులకు పరమపూజ్యుడగు పరమేశ్వరునివలన ఋక్కులు, యజుస్సు, సామము, అథర్వము నను వేదము లుత్పన్నము లయినవి.

వేదములను సంహితలు అనికూడ అంటారు. యజుర్వేదములో 40 అధ్యాయము లున్నవి. 40 వ అధ్యాయము 'ఈశావాస్యోపనిషత్'. కనుక వేదాంత గ్రంథమని చెప్పవలసివస్తే ఒక ఈశావాస్యోపనిషత్తునే చెప్పవలసి యుండును. కఠ మహర్షిచేత రచింపబడుటచేత కఠోపనిషత్ అని ఎరు: అట్లే యింకను కొన్ని ఉపనిషత్తులు - వానిని వ్రాసిన మహర్షుల

పేర్లచేత వ్యవహరింపబడుతున్నాయి. ఈ ఉపనిషద్గ్రంథములను వేదాంత మని, వేదసారమని యేవేవో పేర్లుపెట్టి సాంప్రదాయకులు వ్యవహరించు చున్నారు. అసలు వేదమే సారమైయుండగా, ఉపనిషత్తులకు సారము నాపాదించుచున్నారు కొందరు.

వైదికభాష నాలుగు భాగములుగ వ్యవహరింపబడుచున్నది. మంత్రము, బ్రాహ్మణము, అరణ్యకము, ఉపనిషత్తులు నని. వేదమంత్ర ములు అందరికి అర్థముకావని గ్రహించిన మహర్షులు కొందరు మంత్ర ములపై వ్యాఖ్యానములను వ్రాసియుండిరి. వానిని బ్రాహ్మణము లందురు. ఐతరేయ బ్రాహ్మణము, శతపథ బ్రాహ్మణము, తాండ్యబ్రాహ్మణము, గోపథబ్రాహ్మణము. తరువాత అరణ్యకములు. ఇవి సృష్టిక్రమమును, ఇతిహాసవిషయములను చెప్పుచుండును. నాల్గవది ఉపనిషద్భాగము. ఉపని షత్ అంటే బ్రహ్మవిద్య. ఇందు తాత్త్వికచింతన చేయబడింది. ఉప-ని- పూర్వక సద్ ధాతువువలన 'ఉపనిషత్' శబ్దమేర్పడుతుంది. అనగా బ్రహ్మనిష్ఠద్వారా మనకు కలిగే క్లేశములు పోగొట్టుటకు తోడ్పడే విద్య గనుక దీనిని ఉపనిషద్విద్య అని లేక బ్రహ్మవిద్య అని వ్యవహరించెదరు. 'విద్' అంటే జ్ఞానము. 'యా' అంటే యిచ్చునది. (విద్+యా=విద్యా-జ్ఞానము నిచ్చునది) బ్రహ్మవిద్య అంటే బ్రహ్మజ్ఞానము నిచ్చునది అని అర్థం.

సృష్టి స్థితి లయములకు, పరాపర విద్యలకు సంబంధించిన సమస్త విజ్ఞానము యీ వేదములందు గర్భితమై యున్నదని ఋషుల మతము. ఈ విద్యలు వేదములలో బీజరూపముగా ఉన్నవి. ఇచట వేదములను గురించి ఎందుకు చెప్పవలసి వచ్చినదంటే ఉపనిషత్తులు వేదవిజ్ఞానము నాధారముచేసికొనియే ప్రవర్తిల్లుచున్నవి. మనము భాషించునదికూడ షత్ ప్రవచనమేకద!

సరే! యిక రెండుమాటలు చెప్పి ఈ భాషణము ముగింతును. వేదము 'ఈ ప్రపంచానికి జీవులు, ఈశ్వరుడు, ప్రకృతి అను మూడుమూల పదార్థములు కల'వని బోధించుతుంది. అవి నిత్యతత్త్వములు. అనగా ఒకప్పు డుండి వేరొకప్పుడు లేకుండునవి కావు. ఎల్లప్పుడు ఉండునవి. నిత్య తత్త్వము లనినపుడు అవి స్వయంసిద్ధములనికూడ చెప్పవలసివస్తున్నది. ఒకరిచే ఈమూడు తత్త్వములు సృష్టింపబడినవి కావు. కనుక వీనిని అనాదు లనియు అంగీకరింపవలసియుండును. ఒకటి సర్వవ్యాపకమయిన ఈశ్వర తత్త్వము. రెండవది జీవతత్త్వము. అది సూక్ష్మము. మూడవది ఈ సృష్టి జరుగుటకు ఆవశ్యకమైన ప్రకృతితత్త్వము. ఇది జడము. ఈ మూడు తత్త్వములే ప్రపంచమునకు కారణములు. (ప్రవాహనిత్యం ప్రపంచం). మరియు జీవులు పరమేశ్వరునిచే సృష్టింపబడినవి కావు. పరమేశ్వరునివలె జీవులుకూడ నిత్యసత్య పదార్థములు. అట్లే ప్రకృతియు. ఆదిఅంతములులేని వస్తువులను నిత్యములని అంగీకరింపవలసియున్నది. ఇది స్థూలముగా వేదమునందు ప్రతిపాదింపబడిన జీ వేశ్వర ప్రకృతి తత్త్వముల ప్రస్తావన. ఇప్పటికే కాలాతీతమైంది. రేపటినుండి ఈశావాస్యోపనిషత్తు చెప్పుకుందాము. ప్రథమ మంత్రమును ఒకసారి చదివి సభను ముగించుదాము.

"ఈశావాస్య మిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుంజీథా మాగృధః కస్యస్వి ద్ధనమ్"

---

గుంటూరు, 25-12-1968
బుధవారం, సా. గం. 6-00

మహాజనులార!

నిన్నటిదినం ఉపనిషత్తులన నేమో, వానికి వేదాంతగ్రంథము లను నచ్చినదో వివరించితిని. ఒక్క ఈశావాస్యోపనిషత్తు మాత్రమే

వేదము చివరిభాగ మనియు, ఇది యజుర్వేదము 40 వ అధ్యాయముగా ఉన్నదనియు, మిగిలిన ఉపనిషత్తు లన్నియు వేదభాగములుగాని, వేద శిరస్సులుగాని కావనియు, అవి ఋషిప్రోక్తము లనియు చెప్పియుంటిని. వేదములు ఈశ్వరీయములనియు, అందు ఈశావాస్యము వేదభాగ మగుటచే స్వతః ప్రమాణమై ఒప్పుచున్నదనియు, మిగిలిన ఉపనిషత్తులన్నియు పరతః ప్రమాణము లనియు చెప్పియుంటిని.

వేదము నిత్యము. అది ఈశ్వరుని జ్ఞానము. ఈశ్వరుడు నిత్యుడు; గనుక ఈశ్వరుని జ్ఞానమైన వేదముకూడ నిత్యమే. పరమేశ్వరుడు సృష్టి కాలమున వేదమంత్రములను శుద్ధాంతఃకరణులైన ఋషుల అంతఃకరణంలో భాసింపజేయును. ఆ వేదములలో చరిత్ర లేదు. ఈవిశాల విశ్వమున జరుగు సృష్టిసంబంధమైన విషయమే వేదములందు చెప్పబడుచుంది. కాని ఉపనిషత్తులలో కథలరూపమునను, చర్చలరూపమునను తాత్త్వికవిషయములు ముచ్చటింపబడినవి. ప్రస్తుతము మనము చెప్పుకొనబోవు ఉపనిషత్తు ఈశావాస్యోపనిషత్తు. ఇది వేదభాగం. దీనికి మంత్రోపనిషత్తనియు పేరు కలదు.

"ఈశావాస్య మిదగ్ంం సర్వం యత్కించ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుంజీథాః మాగృధః కస్యస్విద్ధనమ్॥-౧

భావార్థము:- "మనలను భగవంతు డెల్లప్పుడు నెల్లవిధముల చూచు చుండును. ప్రపంచము అతనిచే వ్యాప్తమై యున్నది. అంతట నత డున్నాడు. అతడు వ్యాపకుడు - అంతర్యామి" అని నిశ్చయించి ఈశ్వరునకు భయపడు మానవులు ఎన్నడును అన్యాయాచరణముతో నెవరి ధనము నపహరింప నెంచరు. అట్టివారు ధార్మికులై యిహపరము. అభ్యుదయ నిఃశ్రేయసములను బొంది యెల్లపుడు నానందింతురు.

ఈ సృష్టిస్థితిలయములను చేయగల పరమేశ్వరు డొకడున్నాడని అంగీకరించడం ఆస్తిక్య మనబడుతుంది. కాని 'దేవాలయమునకు వెళ్ళు ప్రతివాడును ఆస్తికుడే' అనే దృష్టి జనులలో వ్యాపించి ఉంది. వాస్తవానికి 'అస్తి ఇతి మతిః యస్య స ఆస్తికః'—(పరలోకం) ఉన్నది అని అంగీకరించేవాడు ఆస్తికు డనబడతాడు. అస్తి అంటే ఉన్నది అని అర్థం. ప్రపంచమును పుట్టించి, పోషించి, లయం చేసే మూలతత్త్వం ఒకటున్నదని లేదా పరలోక మున్నదని అంగీకరించడం ఆస్తిక్య మనబడుతుంది. దీని నంగీకరింపనివారు నాస్తికు లనబడతారు.

ఆస్తికులైనవారు వేదములు ఈశ్వరీయములని, స్వతః ప్రమాణములని అంగీకరిస్తారు. ఆస్తికులు శరీరంలో సృష్టిస్థితిలయములకు కారణమైన పదార్థమేగాక, శుభాశుభకర్మలుచేసే జీవుడుకూడ ఉన్నాడని అంటారు. ఈ జీవుడు శరీరాంతరములు పొందుతుంటాడనికూడ అంగీకరిస్తారు. సృష్టికర్తయైన ఈశ్వరునకు ఇంద్రుడు, మిత్రుడు మున్నగు నామము లెన్నో ఉన్నవి.

"ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహు రథో దివ్య స్స సువర్ణః
ఏకం స ద్విప్రా బహుధా వద న్త్యగ్నిం యమం మాతరిశ్వాన
మాహుః॥

—ఋ. మం. ౧ అను- ౨౨ సూ. ౧౬౪ మం. ౪౬.

విప్రులు అంటే తెలిసినవారు అని అర్థం. పరమేశ్వరు డొక్కడే యనియు, తెలిసినవారు ఆతనినే ఇంద్రుడు, మిత్రుడు, వరుణుడు, అగ్ని, గరుత్మంతుడు మొదలైన భిన్నభిన్ననామములతో వ్యవహరింతురనియు యీ మంత్రమున చెప్పబడింది.

వేదమును వల్లెవేయు ఘన జటా పాఠకులు కొందరు వేదమంత్రముల అర్థమేమిటో ఎరుగరు. పైగా ఈ మంత్రముల కర్థ మేమిటని ఎవ

రైన అడిగితే, యిది కలియుగం వేదార్థం చెప్పరా దంటారు (సభలో నవ్వులు).

హిందువులు విష్ణువు, ఈశ్వరుడు, బ్రహ్మ వీళ్ళందరిని వేరువేరు దేవుళ్ళుగా కొలుస్తుంటారు. బ్రహ్మాది త్రిమూర్తులేకాకుండ యింకా చిల్లర దేవుళ్ళు అనేకులు వెలిశారు. ఈ దేవుళ్ళే కాకుండ యిప్పుడు సజీవదేవుళ్లు కొందరు వెలిశారు. వీరు లోకానికి మేం upto date (నవీన) దేవుళ్ళ మనికూడ చెబుతున్నారు. విలక్షణమైన జుట్టు పెంచుకొని లేదా పెట్టుకొని ఒకరు నేను సాయిబాబా అవతారం అంటున్నాడు. మౌనవ్రతం పూని యింకొకరు నేను భగవదవతారం అంటున్నాడు. ఈ విధంగా పలువురు దేవుళ్ళు, అవతారాలు వెలియడంవలన వేదమునందు నిర్దేశించిన అసలు బ్రహ్మతత్త్వ మేమిటో తెలిసికోలేని స్థితిలో మన మున్నాము.

మనం పిల్లలకు ఒక చిత్తరువును చూపించి దేవు డని చెప్పి నమస్కారం చేయుమంటాం. తెలివిగలపిల్లవాడెవరైనా దేవు డంటే యీ పటంలో కనబడే బొమ్మేనా అని ఎదురుప్రశ్న వేస్తే మనం జవాబు చెప్పలేం. మనం యిపుడు పిల్లలకు దేవుడంటే ఏమిటో చెప్పలేనిస్థితిలో ఉన్నాము.

హిందువులలో వైష్ణవులను చూస్తే శైవులకు గిట్టదు. శైవులంటే వైష్ణవులకు గిట్టదు. శివునికంటె మా విష్ణువు గొప్పవాడని వైష్ణవులు, విష్ణువుకంటె మా శివుడే గొప్పవాడని శైవులు పరస్పరం కలహించుకొంటూ ఉంటారు. ఈశ్వరుడు, విష్ణువు, బ్రహ్మ, మహాదేవుడు, నారాయణుడు - ఇలాంటిపేర్లన్నీ ఒకే పరమేశ్వరతత్త్వమునకు పెట్టబడిన నామములు అని వీరు అంగీకరింపరు. బ్రహ్మ సృష్టికర్తయని, విష్ణువు పోషణకర్త యని, ఈశ్వరుడు లయకారుడని చెబుతుంటారు. ఇది కాదు. వాస్తవమున యీ పదములకున్న అర్థం వేరు. 'బ్రహ్మ'

అన్నిటికంటె గొప్పది అని అర్థం. 'బృహ దితి బ్రహ్మ'. బ్రహ్మము యొక్క గొప్పతనమును వేదమిట్లు వర్ణిస్తుంది. 'పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యాఽమృతం దివి' – ఈ సమస్తప్రపంచం బ్రహ్మముయొక్క నాలుగవ అంశంలో యిమిడివున్నది. ఇంకను బ్రహ్మ మూడు అంశములు మిగిలియే యున్నవని వేదము చెబుతుంది.

ప్రపంచస్థితిని గురించి నేటి వైజ్ఞానికులు యిలా చెబుతున్నారు: మనకు అతిసమీపంలో ఉన్న గ్రహం చంద్రగ్రహం. ఇది భూమికి కొన్ని లక్షలమైళ్ళ దూరంలో ఉంది. అలాగే సూర్యగోళం. ఇది భూమికి కొన్ని కోట్లమైళ్ళ దూరంలో ఉంది. సూర్యుడుకూడ ఒక నక్షత్రమే. సూర్యుడు కాక విశ్వంలో మనకు దూరంగా కోటానుకోట్ల నక్షత్రా లున్నాయి. మన సూర్యుడు ఆ నక్షత్రము లన్నిటికంటె చిన్నవాడు. ఒక నక్షత్రమునకు మరి యొక నక్షత్రమునకు మధ్య చాల దూరం ఉంటుంది. శాస్త్రవేత్తలు ఈ దూరమును కాంతి సంవత్సరములలో కొలుస్తారు. కాంతిసంవత్సరము లంటే చదువుకున్నవాళ్ళకు చాలామందికి తెలిసేఉంటుంది. ఒక సెకనుకు కాంతి 1,86,000 మైళ్ళ దూరం ప్రయాణంచేస్తుంది. అంతదూరమును 60 చేత హెచ్చించితే నిమిషమునకు కాంతిప్రయాణము చేయు దూరం వస్తుంది. అలాగే గంటకు, రోజుకు, సంవత్సరమునకు కూడ హెచ్చిం చుతూ పోవాలి. ఈ దూరాన్నే కాంతిసంవత్సరపుదూరం అంటారు. నక్షత్రములు కొన్ని మనభూమికి వందల కాంతి సంవత్సరముల దూరమున ఉన్నవనియు, వానిలో కొన్నింటి ప్రకాశము ఇంకను భూమికి చేరలేదనియు శాస్త్రవేత్తలు చెబుతున్నారు. ఇంతటి విశాలవిశ్వముకూడ అనంతమైన పరమేశ్వరతత్త్వంలో ఒకభాగమేనని పై మంత్రాభిప్రాయం. కావుననే ఈశ్వరునకు బ్రహ్మ మని పేరు.

శివుడంటే మేలుచేసేవాడని అర్థం. శంకరుడు అంటే శుభమును ...డు. మహాదేవుడు– 'మహాంశ్చ అసౌ దేవ ఇతి మహాదేవః'–

దేవతల కన్నిటికంటె గొప్పదేవుడు. ఈశ్వరుడు అంటే ఐశ్వర్యవంతుడని అర్థం. అలాగే రుద్రుడు- 'యో రోదయ త్యన్యాయకారిణో జనాన్ స రుద్రః'- దుష్టకర్మముల చేయువారిని ఏడ్పించువాడు కనుక రుద్రుడు అని అర్థం. ఈ పదముల కున్న అసలు అర్థములను విడిచి, భిన్న భిన్న దేవతలను కల్పించి వారి కీ నామములు పెట్టారు. వీరికి భార్య బిడ్డలను కూడ కల్పించారు. మరియు విష్ణువు వైకుంఠమున ఉండుననియు, ఈశ్వరుడు కైలాసవాసి యనియు, బ్రహ్మ బ్రహ్మలోకమున ఉండుననియు కల్పించిరి. ఇంకను భిన్న భిన్న దేవతలకు భిన్న భిన్న లోకములు కల్పించిరి. వేదములందు బ్రహ్మ, విష్ణువు, నారాయణుడు, సూర్యుడు,చంద్రుడు, అగ్ని మొదలగు పదములు ఉపయోగింపబడినను అవన్నియు ఒకే పరమేశ్వరు నుద్దేశించి వాడబడిన వనియే తెలియవలెను. విష్ణువు - వ్యాపకుడు (విష్ ఌ వ్యాప్తౌ), నారాయణుడు- 'నరాణాం అయనం గతిః'- నరులకు ముక్తి నిచ్చువాడు అని యర్థము. ఇలాగే ఎన్నో పదములు పరమేశ్వర పరముగా వేదములంచు వాడబడియున్నవి. శ్రీ దయానంద మహర్షి తమ సత్యార్థ ప్రకాశ గ్రంథమున ప్రథమసముల్లాసములో నూటికిపైగా ఇట్టి పదములకు వ్యాఖ్యానము వ్రాసియున్నారు. కావలసినవారు చూచుకొన వచ్చును.

మరి ఆ పరమేశ్వర తత్త్వం ఎలాంటిది ? పరమేశ్వర తత్త్వం ఇంద్రియముల కందునది కాదు. ఇంద్రియముల ద్వారా తెలియబడు వస్తువులు ప్రాకృతిక పదార్థములు. శబ్దము ఉన్నది. ఇది చెవిద్వారా తెలియబడుతుంది. స్పర్శము-దీనిని చర్మముద్వారా ఎరుగగలము. రూపము- దీనిని నేత్రమువలన తెలియగలము. రసము- జిహ్వాద్వారా ఎరుగగలము. అలాగే గంధము- దీనిని ముక్కుద్వారా గ్రహించగలం. శబ్ద [illegible] రూప, రస, గంధములను దార్శనికభాషలో ఇంద్రియార్థము[illegible] ములని అంటారు. శబ్ద, స్పర్శాదులు పరమాత్మలో లేవు. కావు

ఇంద్రియములకు గోచరం కాదు. ఇంద్రియగమ్య పదార్థం ప్రపంచం. జడ పదార్థమునుకూడ తగిన పరిమాణములో ఉన్నపుడే ఇంద్రియములు గ్రహింపగలవు.

'పరాంచి ఖాని వ్యతృణత్ స్వయంభూః
తస్మాత్ పరాఙ్ పశ్యతి నాంతరాత్మన్'
—కఠోపనిషత్తు ౪-౨-౧

పరమేశ్వరుడు ఇంద్రియములను బహిర్గతములుగా చేశాడు. అందువలన అవి వెలుపల చూచును. లోపల చూడవు. పరమేశ్వరుని ఇంద్రియములతో చూడలేము.

మీరు గుడికి వెళ్ళుతారు. అక్కడ ఒక విగ్రహమునో లేక ఒక రూపమునో చూస్తారు. అంటే అది ఇంద్రియగోచరపదార్థమని అర్థం. అందుచేత విగ్రహాది మూర్తులు, రూపములు ఇంద్రియగోచరములు కనుక యివి భగవంతుడు కాదు అని తేలుతుంది.

'అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే'
—గీత ౨-౨౫.

అయం=ఈ ఆత్మ, అవ్యక్తం = ఇంద్రియములకు తెలియనిది, అచింత్యం=ఇట్టిదని చింతింప వీలుకానిది, అవికార్యం=వికారము లేనిది అని చెప్పబడుతుంది.

భౌతికవాదులు మనస్సుకు, ఇంద్రియములకు గోచరమగు యీ ప్రపం[illegible]క భగవంతుని వేరే ఎందుకు అంగీకరించాలి అంటారు. వీరు [illegible]ణమునే అంగీకరిస్తారు. ఒక్క ప్రత్యక్ష ప్రమాణముతోనే [illegible]ర్థములను తెలిసికోలేమని నిన్నటి ఉపన్యాసములో చెప్పు

కున్నాము. భగవంతుడు అనుమానాది ప్రమాణములచే తెలియబడునని సమాధానం చెప్పాలి.

బృహదారణ్యకోపనిషత్తులో మైత్రేయి యాజ్ఞవల్క్యుల సంవాద రూపమున ఒక కథ ఉన్నది. యాజ్ఞవల్క్యుడు గృహస్థుడు. ఆయనకు మైత్రేయి, కాత్యాయని అని యిరువురు భార్య లుంటారు. గృహస్థాశ్రమమును వదలి ఆయన వానప్రస్థాశ్రమమునకు పోదలిచి, భార్య లిరువురిని రప్పించి తనకున్న ధనధాన్యములను వారికి పంచి, తాను వారిని విడిచి వెళ్ళుటకు సిద్ధపడతాడు. ఈ ధనధాన్యాదులచే అమృతత్వము సిద్ధించునా అని మైత్రేయి యాజ్ఞవల్క్యుని ప్రశ్నించుతుంది. ఇవి సుఖజీవనం గడుపుటకే వినియోగపడతాయి గాని, వీనివలన అమృతత్వము (మోక్షము) సిద్ధింపదని యాజ్ఞవల్క్యుడు చెబుతాడు. ఇంకా యిలా అంటాడు: భర్త తన భార్యను ప్రేమించుతున్నాడు అంటే అది భార్యకోసం కాదు. తన సుఖము కోసమే. అలాగే స్త్రీ పురుషుని ప్రేమించడం తన సుఖము కొరకే నంటాడు. చూడండి, భర్త చనిపోతే భార్య ఎందుకని ఏడుస్తుంది ? తనకిదివరలో ఉన్న సుఖ సంతోషాలు పోయాయి, ఇక ఉండవని. అంతేకాని భర్తపోయాడని కాదు. (సభలో చిరునవ్వులు). కావున ఆత్మ-తాను అన్నింటికంటె ముఖ్యము కనుక తానంటే ఏమిటి ? తాను పరమానందం-పరమాత్మానందం- పొందడం ఎలా ? అని ఆలోచించాలి.

"ఆత్మావాఽరేద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః"
—బృహదారణ్యకం.

ఆత్మావాఽరే ద్రష్టవ్యః = ఈ ఆత్మ తెలిసికొనదగిన వస్తువు. ఎలా తెలుసుకోవాలి? శ్రోత్రవ్యః మంతవ్యః నిధిధ్యాసితవ్యః = మొదట ఈఆత్మను గురించి వినాలి విన్నదానిని మననం చెయ్యాలి. తరువాత నిధిధ్యాసనం. అంటే యోగాంగానుష్ఠానం ద్వారా ధ్యానముచేసి ఈ ఆత్మను అనుభవలోనికి తెచ్చుకోవాలి.

శ్రోతవ్యః శ్రుతివాక్యేభ్యః, మంతవ్యశ్చోపపత్తిభిః,
మత్వా చ సతతం ధ్యేయః, ఏతే దర్శనహేతవః ॥

ఈ ఆత్మను గురించి వేదవాక్యాలద్వారా మొదట వినాలి. విన్న దానిని కారణయుక్తంగా మననం చెయ్యాలి. మననం చేసినదానిని ధ్యానం చెయ్యాలి. శ్రవణం, మననం, నిధి ధ్యాసనం – ఇవి ఆత్మసాక్షాత్కారానికి సాధనములు.

హిందువులు కార్తీకాది మాసములలో పురాణశ్రవణం చెయ్యాలి అని చెబుతారు. పురోహితులు కొందరు మన దేవాలయాల్లో భాగవతం, విష్ణుపురాణం మొదలైనవి వినిపించుతుంటారు కూడ. పురాణం అంటే అనాదిసిద్ధములైన వేదగ్రంథములని అర్థము చెబితే పరవా లేదు. కాని, భాగవతాది గ్రంథములు నవీనములు. ఈ గ్రంథములలో పరస్పర విరుద్ధములైన విషయములు అనేకం చూడగలం. విష్ణుపురాణంలో విష్ణువునకు ఆధిక్యత కల్పించి, శివబ్రహ్మలకు అల్పత్వము నాపాదించుట చూడగలం. అట్లే శివపురాణములో శివునకు ఆధిక్యత కల్పించి విష్ణు బ్రహ్మలకు అల్పత్వము నాపాదించుట చూడగలం. మరియు ఒక విషయమును గూర్చి ఒకేగ్రంథమునందు పరస్పర విరుద్ధములైన వర్ణనలుకూడ ఈ పురాణాలలో చూడగలం.

ఉదాహరణకు మనమెంతో గొప్పదని యెంచే భాగవత గ్రంథమును (పోతన భాగవతం) తీసికోండి. దీనిలో 'గజేంద్ర మోక్షము', 'ప్రహ్లాద చరిత్ర' రెండూ ఉన్నాయి. భగవత్తత్త్వమును గూర్చి పోతన ప్రహ్లాదునిచేత "ఇందు కల డందు లేడని సందేహము వలదు చక్రి సర్వోపగతుండు" – అని చెప్పించుతాడు. అదే గ్రంథములో (గజేంద్ర మోక్ష ఘట్టంలో) గజేంద్రుడు (ఏనుగుల రాజు) మడుగులో దిగి, ఒక

మొసలిచేత పట్టుబడి, పోరాడినవాడై శక్తిపుడిగి, భగవంతుని గూర్చి రక్షించుమని ప్రార్థిస్తాడు. అపుడు 'అల వైకుంఠపురంబులో నగరిలో నామూల సౌధంబుదాపల....పూలపాన్పుపై లక్ష్మీదేవితో సరస సల్లాపము లాడుచున్న విష్ణువు వింటాడు. వెంటనే ఆయన భక్తుణ్ణి రక్షించుటకు బయలుదేరుతాడు. ఎలా ? 'సిరికిం జెప్పడు, శంఖచక్ర యుగముం జేదోయి సంధింపడు, ఏ పరివారంబును జీరడు, అభ్రగపతిం బన్నింపడు, ఆకర్ణి కాంతర ధమ్మిల్లము జక్కనొత్తడు, వివాదప్రోత్థిత శ్రీకుచోపరి చేలాం చలమైన వీడడు' అని యీవిధంగా విష్ణువు గజేంద్రుణ్ణి రక్షించడానికి బయలుదేరినట్లు వర్ణించుతాడు. ప్రహ్లాదచరిత్రలోనేమొ భగవంతుడు అంతటా వున్నాడని అంటాడు. గజేంద్రమోక్షములోనేమొ ఆయన వైకుం ఠంలో వున్నాడని అంటాడు. ఇలాంటి పరస్పర విరుద్ధములు, యుక్తి విరుద్ధములు నైన విషయములు ఈ పురాణములలో చెప్పబడి ఉన్నాయి. అందుకనే 'శ్రోతవ్యః శ్రుతివాక్యేభ్యః'-తాత్త్విక విషయములను వేదవాక్కుల ద్వారా వినవలెనని ఋషులు చెబుతున్నారు. సంఘంలో వేదప్రచారం మళ్ళీ జరగాలి. భగవంతుడు అంతటా ఉన్నాడన్న సంస్కారం జనులలో వ్యాపించాలి. అప్పుడే మానవులు అంధ విశ్వాసములనుండి, అజ్ఞానము నుండి ఉద్ధరింపబడతారు.

'ఈశావాస్య మిదగ్ం సర్వం'-పరమేశ్వరతత్త్వం అంతట వ్యాపించి ఉండునది.

'అవినాశితు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్'-గీత. ౨-౧౭. 'ఈ కనబడే ప్రపంచము నంతటిని విస్తరింపజేసి అందు ఏ పదార్థము వ్యాప కమై ఉన్నదో అది ఒక నిత్యపదార్థం. అది యెన్నడు నశింపదు.'

పరమేశ్వరునిస్థితి యిది. ఇక ప్రపంచము స్థితి ఎటువంటిదో విచా రించుదాము.

'నాసతో విద్యతే భావః నా భావో విద్యతే సతః'-గీత ౨-౧౬. అంటే లేనిదానికి (అభావపదార్థమునకు) ఉనికి యుండదు. ఉనికి ఉన్నది (భావ పదార్థము) లేకుండా పోదు అని. 'భావము' అంటే - 'అస్తి, జాయతే, వర్ధతే, విపరిణమతే, క్షీయతే, నశ్యతీతి భావః'-పుట్టి పెరిగి నశించే పదార్థానికి భావ మని పేరు. ఒకపదార్థము నశించినదంటే అది రూపాంతరము పొందిన దనియే అర్థము. కాని, అది పూర్తిగా లేకుండా పోయినదనికాదు. అట్లే అభావము అంటే అసలు ఉనికియే లేని దని అర్థం. ఉనికియే లేని వస్తువు ఉద్భవించుటకే వీలులేదు.

ఈ ప్రపంచం ఎలా ఉత్పన్నమయినది-అని మహమ్మదీయుల నడిగితే వారు, ఖుదా 'కున్' అన్నాడు. అందుచేత ప్రపంచం యిలా ఉద్భవించిందంటారు. మరి ఖుదా ఎందు కిలా ప్రపంచాన్ని సృష్టించాడు? అని అడిగితే దానికి వారు, 'ఖుదాకీ మర్జీహై'-అది భగవంతుని యిష్టము అంటారు. అంతేగాని 'అకల్ కో దఖల్‌నహీ'-దేవుని విషయంలో బుద్ధికేమీ సంబంధం లేదంటారు, అకల్ అంటే బుద్ధి.

ఈ ప్రపంచం పుట్టింది అన్నాము. పుట్టుక అంటే అర్థమేమిటి? అనేకం కలిసి ఒకటికావడం. సూక్ష్మాతి సూక్ష్మాణువులు అనేకం కలిసి ఒక స్థూలపదార్థంగా రూపొందటం పుట్టుక అనబడుతుంది. వస్త్రం పుట్టింది అన్నాము. అనేక తంతువులు కలిసి వస్త్రం అయిందని అర్థము.

కలిసిన వస్తువులు విడిపోవడమే వినాశము. నశించుట అంటే ఉన్నరూపం పోయి వేరొకరూపం రావడమే కాని వస్తువు పూర్తిగా లేకుండపోవడం కాదు.

అభావము అంటే త్రికాలములలో-భూత, భవిష్యత్, వర్తమాన కాలములలో ఉనికిలేనిదనిఅర్థం. ఉదాహరణకు: కుందేటి కొమ్ము, గొడ్రాలు ఆకాశకుసుమం - ఇవి అభావపదార్థములు. అంటే కుందేలుకు-

కొమ్ముకు మూడుకాలములలో ఎప్పుడూ సంబంధం ఉండదు. కనుక యిది అభావం. అలాగే గొడ్రాలు బిడ్డడు. ఆకాశకుసుమం యిత్యాదులు కూడ.

కావున పుట్టినవస్తువును దార్శనికులు కార్యమంటారు. కార్య కారణములను గురించి తెలిసికొందాము. కారణము – అంటే కార్యోత్పత్తికి నియమంగా పూర్వము వుండి తోడ్పడునది. ఉదాహరణకు: మట్టి కారణము, కుండ కార్యము. దారము కారణము, వస్త్రం కార్యం. అలాగే యిటుకలు కార్యం, మట్టిరేణువులు కారణం.

ఒక కార్యం కావాలి అంటే అనేక కారణాలుండాలి. ఒక కుండ తయారు కావాలంటే మట్టి, కుమ్మరి, వాని సాధనములు ఉండాలి. కేవలం మట్టి ఉన్నంత మాత్రంచేత కుండ తయారుకాదు. మట్టి తనకు తాను కుండగా మారలేదు. కనుక ఒక కుమ్మరి కూడ అవసరం. మట్టి, కుమ్మరి రెండూ ఉన్నా కావలసిన పనిముట్లు లేక కుండ గాదు. ఈ కారణములలో మట్టి ఉపాదాన కారణము. కుమ్మరి, వాని సాధనములు నిమిత్తకారణం. ఏ పదార్థము కార్యరూపమును ధరించునో అది ఉపాదాన కారణం. మట్టి ఉపాదానకారణము. కుండ కార్యము. ఇట ఇంకొక నియమంకూడ ఉంది. ఉపాదాన కారణంలోని గుణాలు కార్యంలోకూడ వస్తాయి. కాని నిమిత్త కారణంలోని గుణాలు కార్యంలో రావు. కుండకు మట్టి ఉపాదానకారణం గదా! మట్టిలోని గుణములు కుండకు వస్తాయి. మట్టి నల్లగా ఉంటే కుండ నల్లగా ఉంటుంది. అలాగే మట్టి ఎఱుపుగా ఉంటే కుండ ఎఱుపుగా ఉంటుంది. ఆభరణాలకు బంగారం ఉపాదాన కారణము. బంగారం ఏ వన్నెలో వుంటుందో ఆభరణాలు అదే వన్నెలో ఉంటాయి. తరువాత బంగారమును నగలుగా చేయాలి అంటే ఒక స్వర్ణకారుడు ఉండాలి. అతడే చేతన నిమిత్తకారణం. అలాగే మట్టి కుండగా మారుటకు చేతన నిమిత్త కారణం కుమ్మరి.

ఒక మట్టిముద్ద ఉన్నది. ఇది ఎలా వచ్చింది? అనేక అణువులు కలిసి ఒక ముద్దగా అయింది. అలాగే ఈ ప్రపంచంకూడ అణు సంయోగం వలన ఏర్పడింది అంటారు పరమాణువాదులు. ఋషులలో పరమాణువాది కూడ ఒకడు ఉన్నాడు. ఆయనే కణాద మహర్షి. ఆయన వైశేషిక దర్శనకర్త. ఆయన 3000 సంవత్సరములకు పూర్వపువాడు. నేటి నవీన శాస్త్రజ్ఞులు (Scientists) Atoms ను (అణువులను) భేదించ గలుగుతున్నారు. పరమాణువులను యింకా భేదించలేక పోతున్నారు.

కుండను నిర్మించుటకు చేతన నిమిత్త కారణమైన కుమ్మరి కర్తగా ఎలా అవసరమో, ఈ ప్రపంచ నిర్మాణానికి కూడ ఒక కర్త అవసరం. ఒక కార్యము వున్నది అంటే దాని కొక కర్త ఉన్నాడని అర్థము. (తమ చేతి గడియారమును చూపించుచు) గడియార మున్నది. దానిలోని చేత బడిని-పని తనమునుబట్టి గడియారమును చేసినవా డొకడు ఉన్నాడని తేలుతుంది. గడియారం తనకు తానుగా తయారు కాలేదు. అలాగే మనవాళ్ళు గ్రహాంతరములకు వెళ్ల రాకెట్లు నిర్మించుతున్నారు. కనుక వాటికికూడ కర్త ఉన్నాడు. కర్తకు, తాను చేయు కార్యమునకు సంబంధించిన పూర్ణ జ్ఞానము ఉండి వుంటుంది. గడియారము చేసిన వానికి దానిలోని భాగములకు (Parts) సంబంధించిన జ్ఞానము ఉండి తీరుతుంది. అలాగే, ఈ ప్రపంచమునకు సృష్టికర్తయైన పరమేశ్వరునికి ప్రపంచమునకు సంబంధించిన సంపూర్ణజ్ఞానము ఉంటుంది. మరియు కర్త తానుచేసిన దానిని పోషించ గలడు; లయం చేయగలడు.

'ఈశావాస్య మిదగ్ం జగత్' – (ఈశ ఐశ్వర్యే, నియమనే) ఈశ్వరుడు అంటే ఐశ్వర్యవంతుడని, నియమించేవాడని అర్థం. సృష్టికర్తయైన పరమేశ్వరుడు ప్రపంచంలో నియమాలు కూడ పెట్టాడు. భూమి తిరుగుతున్నది. ఇదొక నియమం. అలాగే చంద్రుడు, సూర్యుడు తదితర గ్రహాలు కూడ ఒక నియమంగా తమతమ గతులు తప్పకుండా తిరుగుతూ

ఉన్నవి. వాయువు వీస్తుంది. అగ్ని దహించుతుంది. ఇవన్నీ నియమాలు. నియమములో ఉన్న వస్తువులు క్రమబద్ధంగా ఉంటాయి. అడవిలో చెట్లు చేమలు ఉంటాయి. అవి ఒక నియమంగా ఉండవు. ఎక్కడబడితే అక్కడ పెరుగుతుంటాయి. కాని, గార్డెన్ (Garden=తోట) అలా కాదు. దాని కొక తోటమాలి ఉన్నాడు. అందుచేత గార్డెన్‌లో ఉన్న చెట్లు, మొక్కలు ఒక క్రమంలో ఉంటాయి. కాని అడవికి మాలిలేడు. అందుచేత అది క్రమ పద్ధతిలో ఉండదు. భూమిచుట్టూ చంద్రుడు తిరుగుతున్నాడు. ఒక నియమిత పరిధిలో తిరుగుతున్నాడు చంద్రుడు నియమం ప్రకారం భూమి చుట్టూ తిరగకుండా అనియమంగా సంచరిస్తే ఎవరును నిర్ణీతసమయంలో చంద్రుని దగ్గరకు వెళ్ళనేలేరు. ఈ సృష్టి నియమబద్ధంగా నడుస్తున్నది. దీనిని నియమించే పదార్థముకే ఈశుడని పేరు.

'తేన త్యక్తేన భుంజీథాః' – ప్రపంచమును త్యాగభావంతో – అనాసక్త చిత్తముతో అనుభవించు.

84 లక్షల జీవకోటిలోను మనుష్యుడు ఉత్తముడు. ఆహారము, నిద్ర, భయము, మైధునము (బిడ్డలనుకనుట)లలో మానవుడు అన్ని జీవరాసులతో తుల్యుడే. కాని, మిగిలిన జీవరాసులకంటె అతడు జ్ఞానవంతుడు. కాన ఉత్తముడు. ఒక జ్ఞానములోనే అతడు ఉత్తముడు– గొప్పవాడుకాడు. క్రౌర్యంలో, ద్వేషించడంలో, అన్యాయాచరణంలోకూడ అతడు గొప్పవాడే!

అసలు జీవితంయొక్క పరమార్థం ఏమిటి? సుఖం. సుఖశాంతులు అందరికీ కావాలి. సుఖము వద్దనేవాళ్ళు లేరు. కమ్యూనిస్టుకు కూడ సుఖం కావాలి. సుఖం కలిగితే మనం సంతోషిస్తాము. సుఖాన్ని కోరి ఆహ్వానించుతాం కూడ. కాని దుఃఖమును మాత్రం కోరము. పశువునకు మేత చూపితే అది దానికి ఆహారమై సుఖమిస్తుంది. కనుక తినడానికి దగ్గరకు వస్తుంది. కాని దుడ్డుకఱ్ఱను పైకెత్తితే దెబ్బవలన దుఃఖము కలుగుతుంది కావున పారిపోతుంది, 'దుఃఖం మా భూయాత్, సుఖం మే భూయాత్'–నాకు

దుఃఖం వలదు, సుఖం కావాలి అని ప్రతిప్రాణి కోరుకుంది. సుఖాన్నికోరే, మనిషి ఆలుబిడ్డలను పోషించుకుంటాడు. ఎన్ని యిబ్బందులైనా పదివాళ్ళను పోషించడానికి ప్రయత్నిస్తాడు. ఆఫీసులో పై అధికారులచేత ఎన్నితిట్లు తిన్నా ఉద్యోగి యింటికి వచ్చేసరికి అది మరచిపోతాడు. భార్య కులాసాగా కబుర్లు చెప్పి ఒక చిరునవ్వు నవ్వేసరికి తన బాధలన్నీ మఱచిపోతాడు. (సభలో చిరునవ్వులు) సుఖాన్నికోరే, మనిషి సంపదలను ప్రోగు చేస్తాడు. సంపద అంటే కేవలం డబ్బేకాదు. జీవితం సుఖముగా గడుపుటకు ఆవశ్యకమైన వస్తు సముదాయం అంతాకూడ సంపద క్రిందకే వస్తుంది.

ఈ సంపదలను త్యాగభావంతో అనుభవించాలి అని వేదాదేశం. 'తేన త్యక్తేన భుంజీథాః'-త్యాగభావంతో అనుభవించడమంటే నాది కాదని అనుభవించడం. ఈ సంపదలు, పుత్రులు, భార్య తనవి కావని అనుభవించాలి. ఎందుకని ? తనవి కావుగనుక. తన శరీరముకూడ తనది కాదు. శరీరములు ఈశ్వరీయములు. అంటే మనకు శరీరములు ఈశ్వరునిచేత యివ్వబడినవి. మన శరీరములను మనమే నిర్మించుకొనగలిగి యున్నట్లయితే మనము వికలాంగులుగా, కురూపులుగా ఉంచెడివారం కాదు. (తమ శరీరమును చూపించుచూ) నేను యింతకంటె అందమైన శరీరమును నిర్మించుకొని యుందును. నెరసిన జుట్టు, వికారమైన ముఖము నాకు లేకుండెడివి. (సభలో నవ్వులు). అలాగే, ప్రతితల్లి తన బిడ్డలు రూపవంతులుగా నుండునట్లు కని యుండెడిది. కాని అట్లు జరుగుటలేదు. మరియు పరమేశ్వరుడు మనకు శరీరమునేగాదు, బలమును కూడ యిస్తాడు* 'ఆత్మదా, బలదా' అని వేదం చెబుతుంది.

---

* ఓం య ఆత్మదా బలదా యస్య విశ్వ ఉపాసతే, ప్రశిషం యస్య దేవాః యస్య ఛాయామృతం యస్య మృత్యుః కస్మై దేవాయ హవిషా విధేమ॥
— యజుర్వేదము. ౨౫-౧౩

ఇంకొక విషయం. ఈ శరీరం అరువు సొమ్ము అని గ్రహించాలి. చూడండి. మన స్త్రీలు పెండ్లిండ్లకు, పేరంటానికి వెళ్ళేటప్పుడు తమ కున్న నగలు చాలక ప్రక్కవారి నుండి అరువు తెచ్చుకొని మెడనిండ వేసు కుంటారు (శ్రోతలగు స్త్రీలలో చిరునవ్వులు). కాని ఆ సొమ్ములు వారి సొంతములుకావు. మరల ఎవరివి వారికిచ్చి వేయవలసిందే. అలాగే మన కీ శరీరంకూడ అరువు సొత్తు. ఇండ్లల్లో అద్దెకుంటున్నట్లుగానే మన మీ శరీరాలలో ఉంటున్నాము. ఇంటి యజమానుడు ఖాళీ చేయుమనగానే అద్దె కుండేవాడు యిల్లు ఖాళీచేస్తాడు. అలాగే మనముకూడ ఏదో ఒకరోజు ఈ శరీరమనే అద్దెకొంపనుండి ఖాళీచేయవలసి ఉంటుంది. అప్పుడప్పుడు సినిమా రికార్డుకూడ వింటుంటాము. "అద్దెకొంప లోక మింతేరా, తమ్ముడు! వద్దూ పొమ్మనగానే వదిలేసి వెళ్ళాలి, ఇది మాయాసంసారం తమ్ముడూ!" అని. (సభలో నవ్వులు). శరీరం చిరిగిన వస్త్రంతో సమానం. ఒకచొక్కా చిరిగితే దానిని విడిచి వేరొక క్రొత్తచొక్కా తొడుక్కుంటాము. అలాగే ఈ శరీరం మనకు వాసయోగ్యం కానపుడు దీనిని వదలిపెట్టవలసిఉంటుంది. ఈ శరీరమును వదిలిపెడితే వేరొక శరీరం వస్తుంది.

'మా గృథః కస్యస్విద్ధనమ్'-ఎవరి ధనమును అభిలషించకుము.

ఎందులకని, ఈ శరీరము సంపదలు నీవికావుగనుక. మరి ఎవరివి? 'కస్యస్విద్ధనం'—ఈ ధన మెవరిది ? కస్య-సుఖస్వరూపుడైన ఆ పరమేశ్వ రునిదే.

మనం జీవించునది తినుటకుకాదు. బ్రతుకుటకు తింటున్నాము. 'Eat to live but don't live to eat' (బ్రతుకుటకు తిను, తినుటకు బ్రతుకవద్దు) అని ఒక ఇంగ్లీషు సామెతకూడ కలదు. (సభలో చిరు నవ్వులు). కాబట్టి మన జీవితలక్ష్యం కేవలము ధనమును సంపాదించి, దాని ననుభవించుట కారాదు. కొందరు వంశ పారంపర్యముగా ముదిమను మలు తిన్నను తరుగనంతగా సంపాదించి ఆ సంపదలను తామనుభ

వింపక ఎప్పుడో రాలిపోతారు. ఆ ధనమును వాళ్ళనుభవింపరు. ఇతరులను అనుభవింప నీయరు. ఊరికే ప్రోగుచేస్తుంటారు. పశువుల గాటిలో అప్పు డప్పుడు కుక్కలు పడుకొంటూ ఉంటాయి. ఆ కుక్క తాను గడ్డిని తినదు. పశువు మేత మేయబోతే భౌ, భౌ అని దానిని తిననియ్యదు. (సభలో నవ్వులు). అధిక ధనవంతుల స్థితి యిట్టిదే.

ఎక్కువ సంపాదించినందువలన యింకొక యిబ్బంది కూడ ఉంది. సంపాదించిన ధనాన్ని ఎలా భద్రం చెయ్యాలి అనే దొక సమస్య. మరి బ్లాక్‌మనీ గనుక సి. ఐ. డీ. లు పట్టుకుంటారేమోనని భయం. ఉన్న ధనం ఉన్నట్లు లెక్కచెబితే ఇన్‌కంటాక్సు వాళ్ళతో పేచీ, (సభలో నవ్వులు). ఇన్ని ఇబ్బందులున్నాయి ధన సంపాదనలో. కనుక ధనసంపాదన మన జీవిత లక్ష్యం కారాదు. జీవితానికొక లక్ష్యం చూడాలి. మిగిలింది రేపు చెప్పు కుందాం.

---

గుంటూరు, 26-12-1968
బుధవారం, సా. 6-00 గం.

మహాజనులారా!

గత దినం సాయంత్రం ఈశావాస్యోపనిషత్తులోని మొదటి మంత్రం వివరించుకొన్నాము. ఇవ్వాళ రెండవ మంత్రాన్ని గురించి చెప్పు కుందాము. గతదినం చెప్పుకొన్న విషయం సంగ్రహంగా ఒకసారి చెప్పు కొని తరువాత మంత్రం చెప్పుకుందాము. 'పరమేశ్వరుడు ఈ ప్రపంచానికి సృష్టికర్త. ఆయన దీన్ని పోషింపగలడు. నాశనము చేయగలడు. ప్రపంచం ఈశ్వరుని ఐశ్వర్యం. కనుక ప్రపంచగత పదార్థములను మాన వులు తమవిగావని తెలుసుకొని త్యాగభావంలో అనుభవించాలి. ఇతరుల ధనాదులను లోభబుద్ధితో గ్రహింపరాదు, పరమేశ్వరుడు సర్వత్ర వ్యాప

కుడై ఉండుటచేత మనల నాయన ఎల్లప్పుడు ఎల్లవిధముల చూస్తూ ఉంటాడు. కనుక తప్పులు చేయరాదు.' అని తెలిసికొన్నాము.

మనకు శరీరములుంటేనే కర్మలాచరింపగలం. ప్రపంచంలో మూడు మూలపదార్థా లున్నాయని మనకు వేదముద్వారా తెలుస్తుంది.

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే
తయో రన్యః పిప్పలం స్వాద్వ త్త్యనశ్న న్నన్యోఽభిచాకశీతి॥"

తా॥ ఒకింత సమానఖ్యాతి కలిగి కలిసియుండు రెండు సుపర్ణులు ఒకే వృక్షమును పరిష్వంగ మొనర్చుచున్నవి. అందొకటి వృక్షఫలములను రుచి చూచుచున్నది. రెండవది తినక అంతట ప్రకాశించుచున్నది.

ఈ మంత్రంలో ఆలంకారికంగా ప్రపంచ మూలపదార్థములు మూడు వర్ణింపబడినాయి. ఇందు చెప్పబడిన రెండు సుపర్ణులు-అంటే రెండు చేతన పదార్థములు-జీవేశ్వరులు. జీవేశ్వరులు ఇచట పక్షులుగా చెప్పబడిరి. వృక్షము జడపదార్థము. ప్రకృతి ఇచ్చట వృక్షముగా చెప్పబడింది. 'వృశ్చ్యతే ఖండ్యతే ఇతి వృక్షః'- వ్రయ్యలు చేయదగినది (ఖండ ఖండములుగా చేయదగినది) కనుక వృక్షము అనబడుతుంది. అట్లే ఈ జగత్తుకూడ పరమాణువులచే నిర్మింపబడి మరల ఖండింపబడదగియున్నది. జీవు డీ ప్రకృతి రూపవృక్షమును నంటిపెట్టుకొని యుండి, అందు ఫలించు ఫలములను అనుభవించుతాడనియు, పరమేశ్వరుడు ప్రపంచమందు వ్యాపకుడై ఉండి, జీవుడుచేసే కర్మలను వీక్షిస్తూ కర్మల కనుకూల ఫలములను ఇస్తుంటాడనియు వర్ణింపబడినది.

మనముచేసే ప్రతికర్మకు ఫలం వుంటుంది. అది మంచిఫలం గాని చెడు ఫలంగాని కావచ్చు. కర్మలు చేసేవాడు తాను చేసే కర్మలకు కర్త అవుతాడు. కర్త అయిన వాడు తానుచేసిన కర్మల ఫలాన్ని తప్పకుండ అనుభవించాలి. ఇది న్యాయంకూడ. కర్మ సిద్ధాంతం వేద సిద్ధాంతములలో

ముఖ్యసిద్ధాంతం. కర్మలు చేయుటలో జీవుడుకర్త కావున అతడు స్వతంత్రుడుగ కూడా ఉంటాడు. 'స్వతంత్రః కర్తా' అని పాణిని. కర్తకు కర్మ చేయడంలో స్వాతంత్ర్యం ఉంది. అతడు మంచి చేయవచ్చు; చెడుగు చేయవచ్చు. ఆస్తికులలో కొందరి కీ విషయం తెలియదు. కొందరు ఆస్తికులు తమ అస్తిత్వమును అంగీకరించరుకూడ. అంతా భగవంతుడే చేస్తున్నాడు. జీవుని ప్రమేయం ఏమీలేదని ఒక మిత్రుడు ఇంతకుముందు నాతో అన్నాడు. నే నా మిత్రునితో పరమేశ్వరుడు దొంగతనం చేస్తాడా? వ్యభిచరిస్తాడా? అన్నాను. (సభలో నవ్వులు). అతడు ఏమీ ఆలోచించకుండానే అవును, చేస్తాడు అని సమాధాన మిచ్చాడు. పాపం! అతని నేమనగలం? కాని వైదికులు మాత్రం దీనిని అంగీకరింపరు. వైదికులు జీవునికి కర్మలు చేయుటయందు స్వాతంత్ర్య మున్నదంటారు. కాని తాను చేసిన కర్మఫలితాలు అనుభవించుటలో మాత్రం అతడు అస్వతంత్రుడని అంగీకరిస్తారు. అందువలననే-

"కర్మణ్యే వాధికార స్తే మా ఫలేషు కదాచన
మా కర్మఫల హేతు ర్భూః............"

—గీత ౨-౪౭

కృష్ణుడర్జునునితో అంటాడు. అర్జున! నీవు కర్మలాచరించుటకే అధికారివి. కాని వాటి ఫలములపై నీ కధికారంలేదు, అని. మా కర్మఫల హేతుర్భూః- అంటే కర్మఫలానికి నీవు హేతువు (కారణము) కావద్దు అంటాడు.

మన అనుభవంలో కూడ ఇది యథార్థమని తెలుస్తుంది, నేను కడుపునిండ తినవచ్చు, ఎక్కువ తక్కువలు కూడ తినే స్వాతంత్ర్యం నాకుంది. కాని ఎక్కువ తిన్నందువల్ల వచ్చే కడుపునొప్పి నేను వద్దంటే ఆగదు. నాకు అందులో స్వాతంత్ర్యం లేదు. అలాగే నేను విషం తింటే

వద్దనేవా శ్ళెవరూ లేరు, కాని తిన్న తరువాత దాని ఫలం నా చేతిలో ఉండదు. విద్యార్థి ఉన్నాడనుకోండి. పరీక్షపేపర్లకు సమాధానాలు వ్రాయ టంలో స్వతంత్రుడు. అతడు ప్రశ్నలకు సమాధానాలు బాగా వ్రాయనూ వచ్చు. ఏమీ వ్రాయకుండ వట్టి కాగితం తిరిగి యిచ్చివేయనూవచ్చు. లేక పేపరు యిచ్చిన Examiner (పరీక్షాధికారి) ని తన కిష్టంవచ్చినట్లు తిడుతూ వ్రాయనూ వచ్చు. (సభలో నవ్వులు) కాని అతనికివచ్చే పరీక్ష ఫలితాలు అతడు ఆశించిన ట్లుండవు. పరీక్షాధికారి విద్యార్థి ఆశించిన మార్కులకంటె తక్కువ వేయవచ్చు; లేక ఎక్కువ వేయవచ్చు; లేక విద్యార్థి వ్రాసిన విపరీత సమాధానాలకు సున్నా చుట్టనూ వచ్చు; లేక అతడు కాపీ చేశాడని తెలిస్తే డీబార్ చేయనూ వచ్చు. అందుచేత పరీక్షఫలితాలు విద్యార్థిచేతుల్లో లేవు. అలాగే మనం చేసిన కర్మలకు వచ్చే ఫలం మన చేతులలో లేదు. ఆ ఫలాలను మనం అనుభవించాలి. శుభకర్మలను చేసిఉంటే సుఖరూపం లోను, దుష్కర్మలను చేసిఉంటే దుఃఖరూపంలోను ఫలముల ననుభ వించుతూ ఉంటాము. జీవుడు శరీరంతోనే కర్మలు చేస్తాడు. దాని ద్వారానే శుభాశుభ కర్మల ఫలితాలను అనుభవిస్తాడు. శరీరం జీవుని కొక బంధనం. జీవుడు యీ శరీరబంధనంనుంచి తప్పుకుంటే ముక్తుడౌతాడు.

జీవుడు బద్ధుడా? నిత్య బద్ధుడా? లేక బంధనంనుంచి తప్పుకొను టకు వీలున్నదా? అని అంటే జీవుడు నిత్యబద్ధుడు కాదు. నిత్యబద్ధుడైన వాడు ముక్తుడు కానేలేడు. బంధం మధ్యలో వచ్చిఉంటే అది పోగొట్టు కొనుటకుకూడ వీలుంటుంది. క్రైస్తవులు జీవుడు తాను చేసిన కర్మలకు ఫలితంగా స్వర్గమో నరకమో అనుభవిస్తా డంటారు. వారి దృష్టిలో జీవులు పరమేశ్వరునిచేత సృష్టింపబడతాయి. మన మది అంగీకరించము. జీవులు నిత్యులు; దేవునిచేత సృష్టింపబడునవి కావు. అదీకాక క్రైస్తవులు మాన వులలోనే జీవులను అంగీకరించుతారు. పశుపక్ష్యాది జంతుకోటిలో జీవుల నంగీకరించరు. మానవులలోకూడ పురుషులలోనే జీవాత్మ ఉన్నదంటారు.

స్త్రీలలో జీవాత్మ లేదట ! యెహోవా జీవవాయువును ఒక్క పురుషుని నాసికారంధ్రములందే ఊదుతాడు. స్త్రీ శరీరములో ఊదడు. స్త్రీ శరీరమును పురుషుని ప్రక్కటెముక నొకదానిని బయటకు తీసి నిర్మిస్తాడు. అందుచేత వారు నరునిలో జీవుడున్నాడుకాని, స్త్రీలలో జీవాత్మఉన్నదని అంగీకరింపరు. క్రైస్తవులు పునర్జన్మనుకూడ అంగీకరింపరు. జీవుడు చేసిన పుణ్యాపాపముల లోని హెచ్చుతక్కువలనుబట్టి వారికి స్వర్గమో నరకమో వస్తుందంటారు. ఒక జీవుడు 60 మంచిపనులు చేసి 40 చెడ్డపనులు చేస్తాడనుకోండి. చెడ్డపనులకంటె మంచిపనులు ఎక్కువ చేశాడు కనుక అతనికి స్వర్గం వస్తుందట ! ఒకడు 60 చెడ్డపనులుచేసి 40 మంచిపనులుచేస్తే అతనికి నరకం వస్తుందట ! అదీగాక, 60 మంచిపనులు చేసేవాడొకడు, 70 చేసేవా డింకొకడు, 80 చేసేవాడు వేరొకడు ఉన్నా- వీరందరికి హెచ్చుతక్కువ భేదంలేకుండ అందరికి స్వర్గం సమానంగానే వస్తుందట ! అలాగే చెడ్డ పనులుచేసేవారికి వారు చేసిన చెడుగుల సంఖ్యలో భేదములున్నను నరకం ఒకలాగే ఉంటుందట ! ఇదెక్కడి న్యాయమో తెలియదు. వైదికమతం దీని నంగీకరింపదు. ఇందు తాము చేసిన మంచిపనులకు చెడ్డపనులకు తగినట్లు ఫలం హెచ్చుతగ్గులుగా జీవు లనుభవింపవలసిందే. ఇదే న్యాయంకూడ. క్రైస్తవులు చెప్పునట్లు ఎక్కువ మంచిపనులు చేసినవానికి స్వర్గమిచ్చి, అతడు చేసిన దుష్కర్మల ఫలితాన్ని అనుభవింపనీయక తీసివేస్తే అది అన్యాయం అవుతుంది. చేసిన కర్మకు చేసినట్లు తగిన ఫలితం యివ్వడం న్యాయం. అలాగే ఎక్కువ చెడుగులు చేసినవానికి కేవలం నరకమునిచ్చి అతడు చేసిన మంచిపనులకు ఫలము నీయకపోవడంకూడ న్యాయం కాదు. జీవులకు శరీరం ఎందుకు వచ్చింది ? చేసిన కర్మల ఫలము ననుభవించుటకు. మనకు శరీరం భగవంతు డిస్తాడు. ఈ జన్మలో మనం చేసిన కర్మలఫలం అనుభవింపక మిగిలిఉంటే వాని ననుభవించడానికి అతడు మనకు జన్మాంతరమిస్తాడు. జీవునికి ఒక జన్మకాదు, అనేక జన్మ లుంటాయి,

అనేది వైదికమతం. అటులయినచో యీ శరీరంలోనే సర్వకర్మల ఫలములు ఎందుల కనుభవింపరాదు, అనే ప్రశ్న రావచ్చు. అలా అనుభవించుటకు వీలులేదు. ఈ శరీరంలో అనుభవించుటకు వీలులేని ఫలాలుకూడ కొన్ని ఉంటాయి. అందుచేత భగవంతుడు జీవునికి శరీరాంతరములను కల్పించి ఆ కర్మల ఫలితాన్ని వానియందు అనుభవింపజేస్తాడు. ఇది వేదసిద్ధాంతము.

జీవునికి శరీరం రావడానికి కర్మలు కారణమని చెప్పుకున్నాము. మరి అలాంటప్పుడు జన్మబంధనం ఎలా తొలగుతుంది – అంటే జీవుడు కర్మలుచేస్తూకూడ బంధనంలో పడని ఉపాయం మనకు వేదం చెబుతుంది. అదేమంటే, కర్మలు చెయ్యాలి, కాని ఫలితాన్నిమాత్రం అపేక్షింపరాదు. కర్మలు కర్తవ్యబుద్ధి (Duty) తో ఆచరించాలేగాని ఫలాపేక్షతో కాదు. ఫలాపేక్షతో చేస్తే కర్మలు బంధనకారణం అవుతాయి. భగవద్గీతలో ఈ కర్మ సిద్ధాంతమే విస్తారంగ బోధింపబడింది.

భగవద్గీతలో కృష్ణుడు పెక్కుమారులు తన నుద్దేశించి అహం శబ్దాన్ని వాడతాడు. ఈ అస్మత్ శబ్దప్రయోగంవలన మన భాష్యకారులు – వ్యాఖ్యాతలు కృష్ణుణ్ణి దేవుని చేశారు. ఇది సరికాదు. అహం శబ్దం జీవపద సూచకంగానే వాడబడింది గీతలో. అహం అంటే నేను అని అర్థం. 'నేను' అంటే ఈ శరీరంకాదని ముఖ్యంగా గుర్తుపెట్టుకోవాలి. నేను లావుగా ఉన్నాను అంటే నా శరీరం లావుగా ఉన్నదని అర్థం చెప్పుకోవాలి. కాని 'నేను' అనేదానికి లావుతనం ఉండదు. శరీరం ఆత్మకాదు. ఆత్మ కానిదాన్ని మనం ఆత్మ అనుకుంటాము. శరీరాలు ఆత్మకు అనేకం వస్తుంటాయి పోతుంటాయి. ఇక యీ నేను అనేదేమిటో విచారించి తెలుసుకోవాలి. ఇది తెలుగులో 'నేను', ఆంగ్లంలో 'ఐ', హిందీలో 'మైఁ', సంస్కృతంలో 'అహం' అను పదాలతో వ్యవహరింపబడుతుంది. నా కన్ను, నా ముక్కు, నా చెవి, నా నాలుక, నా శరీరము, నా మనస్సు అని మనం

అంటున్నాము. అట్లు నా యిల్లు, నా భార్య, నా కుమారులు, నా సంపదలు అన్నప్పుడు నేను వేరు, నా యిల్లు, భార్య, కుమారులు, సంపదలు వేరు. అవి 'నేను' కాదు అని తెలుస్తుంది. అలాగే నా ముక్కు, నా చెవి, నా చేయి, నా శరీరము, నా మనస్సు అన్నపుడు నేను వీటి కన్నింటికంటె వేరైనవాడననియు, శరీరము, మనస్సు, ఇంద్రియాదులు నేను కాదనియు సులభముగ తెలియుచునే ఉన్నది. ఈ 'నేను' అనునది ఇంద్రియములకు, మనస్సుకు తెలియబడదు. 'నేను ఇంద్రియములద్వారా, మనస్సుద్వారా ఈ ప్రపంచవిషయాలను తెలుసుకుంటున్నాను.' అంటే, నాకు మనస్సు, ఇంద్రియాలు ఈ ప్రపంచమును తెలిసికొనుటకు సాధనములుమాత్రమే అని యర్థము. కావున నన్నవి తెలుసుకోలేవు. ఈ 'నేను' అనునది శరీరంలో ఉన్నంతవఱకు దానికి సంబంధించిన కొన్ని గుణములు శరీరంలో వ్యక్తమవుతున్నాయి. అవి * ఇచ్ఛ (కోరటం), ద్వేషం, ప్రయత్నం, సుఖం, దుఃఖం, జ్ఞానము. ఈ గుణాలు మరణానంతరం – అంటే శరీరము నుండి 'నేను' అను పదార్థం నిష్క్రమించిన తరువాత శరీరమున వ్యక్తమగుట లేదు. కావున ఇవి 'నేను' అను వస్తుగుణములే యగును. ఇవి శరీరగుణములు కావు. అయి ఉంటే శరీరాన్ని మనం తగలబెడుతుంటే దానిలో బాధ వ్యక్తం కావాలి, వస్తుధర్మం వస్తువుతో ఉంటుంది, వస్తువును విడిచి ఉండదు. అగ్నికి దాహకశక్తి వుంది. ఉష్ణత దాని స్వాభావిక గుణం. అగ్ని వున్న దహిస్తుంది; లేకున్న దహింపదు. అట్లే ఇచ్ఛ, ద్వేషం, ప్రయత్నం, సుఖం, దుఃఖం, జ్ఞానం ఇవన్నీ కూడ జీవుని గుణాలు. జీవుడన్నా 'నేను' అన్నా ఒకటే. ఇచట జీవుని గురించి ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే జీవస్వరూప మేమిటో అతని గుణము లేమిటో మొదట తెలుసుకుంటేగాని అతడుచేసే

---

* "ఇచ్ఛాద్వేష ప్రయత్న సుఖదుఃఖ జ్ఞానాన్యాత్మనో లింగాని"

— న్యాయదర్శనం ౧-౧-౧౦

కర్మలు, వాటి ఫలితాలు ఆకర్మలవలన జీవునికి బంధమోక్షము లెలా సిద్ధిస్తాయి-అనే మిగిలిన విషయాలు అర్థంకావు. నేత్రాది ఇంద్రియములు ప్రాకృతికములని, అందుచేత అవి ప్రాకృతిక పదార్థాలనే తెలుసుకోగలుగుతాయని నిన్న చెప్పాను. 'నేను' అనేది ఒక సూక్ష్మవస్తువు. అది ప్రాకృతిక పదార్థ సమ్మేళనంవలన యేర్పడినది కాదు. స్వతఃసిద్ధమైన చైతన్యపదార్థం. అందుచేత నేత్రాది ఇంద్రియముల కది గోచరించేదికాదు. కేవలము అది శరీరములో వున్నపుడు అందులో వ్యక్తమయ్యే గుణాలను బట్టియే దానిని తెలుసుకుంటాము. ఇట్లు కర్మసిద్ధాంతం కొంత తెలిపి యిపుడు రెండవ మంత్రమును చదువుతున్నాను.

కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతగ్ం సమాః
ఏవం త్వయి నాన్యథేతో౽స్తి న కర్మ లిప్యతే నరే॥ ౨.

భావార్థము:- పరమేశ్వరుడు సర్వద్రష్ట, న్యాయాధీశుడు నని యెంచి ఆతని యాజ్ఞయే చేయదగినదని నిర్ణయించి, మానవులు సోమరితనమును దరిజేరనీయక శుభకర్మములు ఫలాపేక్షలేకయే చేయుచుండవలెను. అశుభకర్మముల నాచరింపరాదు. బ్రహ్మచర్యమును పాలించుచు విద్యాసుశిక్షణలను బొందవలెను. ఉపస్థేంద్రియమును నిగ్రహించి వీర్యమును పైకి లాగి, ఓజస్సుగా మార్చి అల్పమృత్యువును జయింపవలెను. యుక్తాహార విహారముల మూలమున నూరేండ్లు జీవింపవలెను. మానవులు శుభకర్మముల నాచరించునెడల దుష్కర్మములు వారికి దూరమగును. విద్య, ఆయుస్సు, సుశీలత వారికి పెంపొందును.

మనం నిత్యజీవితంలో అనేక కర్మలు చేస్తుంటాము. కొన్ని కర్మలకు ఫలం వెంటనే లభిస్తుంది. కొన్ని కర్మలకు ఉద్దిష్టప్రయోజనం వెంటనే

సిద్ధించదు. (ఏ ప్రయోజనము నుద్దేశించి కర్మ చేయబడుతుందో అది ఉద్దిష్ట ప్రయోజనము). ఇక్కడ ఉపన్యాసం జరుగుతుందని విన్నాము. ఉపన్యాసం వినడానికి ఒకమైలు దూరంనుండి నడచివచ్చాము. ఈ నడచి రావడమనేది కర్మ. దానికి రెండు ఫలాలు. ఒకటి ఇక్కడకు చేరుట. రెండవది ఉపన్యాసం వినుట. ఈ రెండవ ఫలమే ఉద్దిష్టఫలం. ఇది కొన్ని కర్మలకు వెంటనే సిద్ధిస్తుంది. కొన్నింటికి సిద్ధింపదు. అన్నం తినుట, నీళ్ళు త్రాగుట అనునిట్టి కర్మలకు ఉద్దిష్టఫలం ఆకలి దప్పికలు తీరుట. అవి వెంటనే సిద్ధించును. కాని నేను రాత్రి విరేచనానికి మాత్ర వేసుకున్నా ననుకోండి. విరేచనం వెంటనే కాదు. మరుసటి రోజుదాకా ఆగాలి. వ్యవసాయదారుడు పొలములో విత్తనంవేశాడు. అతనికి పంట వెంటనే రాదు. ఐదు లేక ఆరునెలలు ఆగిన తరువాతగాని ఫలం చేతికిరాదు. అలాగే విద్యార్థి పరీక్షవ్రాస్తాడు. కాని ఫలితం వెంటనే తెలియదు. కొన్నాళ్ళు ఆగాలి. ఇలా వుంటాయి కర్మలు, వాటి ఫలితాలు. మనం ఈ శరీరంలో చేసే కొన్నికర్మలకు ఫలితం వెంటనే అనుభవిస్తాం. కొన్ని కర్మలు అనుభవించకుండ మిగిలిపోతాయి. ఆ కర్మశేషాన్ని అనుభవించడానికి వేరొకశరీరం వస్తుంది. మరి ఈవిధంగా శరీరం తర్వాత శరీరం జీవునికి వస్తున్నాయికదా, ఈ శరీర బంధనంనుండి తప్పుకోవడానికి వీలున్నదా? అంటే వీలున్నదనే మనకు వేదం చెబుతున్నది.

('కుర్వన్-ఏవ-ఇహ-కర్మాణి-జిజీవిషేత్ - శతమ్ - సమాః' అని మంత్రమును పదవిభాగంచేసి చదువుతూ శ్రీ గోపదేవ్‌గారు యిలా అన్నారు)

వైదికభాష ఎంతో సులభగ్రాహ్యంగా ఉంటుంది. కొందరు వేద భాష కఠినం అనుకుంటారు. కాని అది యథార్థం కాదు. భగవద్గీత ఈ రెండవ మంత్రము నాధారము చేసికొని నిర్మింపబడింది. ఇందులో అతిశ

యోక్తి ఏమాత్రము లేదు. మంత్రము అనగా, మననముచేసి తెలిసికొన దగిన దని యర్థము. వేదమంత్రములోనున్న వైశిష్ట్యం ఇదియే.

యజుర్వేదంలో 'పశ్యేమ శరదః శతమ్' - నూరుసంవత్సరముల వరకు చూతుముగాక! 'జీవేమ శరదః శతమ్' - నూరుసంవత్సరములు జీవింతుముగాక! 'శృణుయామ శరదః శతమ్' - నూరు వత్సరములు విందుముగాక! 'అదీనాః స్యామ శరదః శతమ్' - నూరేండ్లు దీనులము కాకుందుము గాక! 'భూయశ్చ శరదః శతాత్' - నూరు సంవత్సరములకు పైబడికూడ యిట్లే జీవింతుముగాక ! అని యున్నది.

కావున సామాన్యముగా మనుష్యుని అయుర్దాయము 100 సంవత్స రములని తెలియనగును. అంతకు ఎక్కువకూడ జీవించవచ్చు లేక నూరు నిండకపూర్వమే మరణించవచ్చు. జీవించినంతకాలము కర్మలు చేయవల సిందేనని వేదము చెబుతుంది. 'కుర్వన్+ఏవ' - అనుటలో, 'ఏవ' పద ములో బలమున్నది. 'కుర్వన్+ఏవ - అంటే చేస్తూనే ఉండు అని అర్థం. పరుగెత్తుతూనే ఉండు, అంటే, మధ్యలో ఆగరాదని అర్థమవుతుంది. కావున జీవించినంతకాలం మానవుడు కర్మలు చేయవలసిందే. వాటిని విడువరాదు. వేదము అకర్మణ్యత నంగీకరింపదు. ఇది మొదట గుర్తుపెట్టుకోవాలి. కాని కర్మలు ఫలకాంక్షారహితములై ఉండాలి. అప్పుడు, కర్మ న లిప్యతే - కర్మము అంటదు - బంధనహేతువుకాదు. ఇతః అన్యథా నాఽస్తి—ఇంత కంటె వేఱువిధము లేదు.

కర్మలు అంటే చేసే పనులు. యత్ క్రియతే తత్ కర్మ - ఏది చేయబడుతుందో అది కర్మ. శిష్టసంప్రదాయం వేదవిహితకర్మలనే కర్మ లుగా అంగీకరించుతుంది.

భగవద్గీతలో వాడబడిన కర్మపదము వేదవిహితకర్మలను బోధించు నని మనం గ్రహించాలి. కర్మలు ముప్పైధములు. నిత్యకర్మలు, కామ్య

కర్మలు, నైమిత్తిక కర్మలు. నిత్యకర్మలు ప్రతిదినము మనము చేయవలసినవి. కామ్యకర్మలు కొండొకఫలం కోరి చేసేవి. నైమిత్తికకర్మలు ఒక నిమిత్తముతో చేసేవి. సకాలంలో వర్షాలు కురియనపుడు ప్రజలు చాల యిబ్బందులు పడతారు. యజ్ఞయాగాది క్రతువులనుచేసి మేఘము నుత్పత్తి చేసి వర్షాలు పడేలా చేసేవారు మన పూర్వులు. Science (సైన్సు) వృద్ధి అయిన తరువాత ఇప్పుడో మనవాళ్ళు విమానములలో వెళ్ళి మేఘములపై ఉప్పును చల్లుసరికి మేఘములు చల్లబడి వర్షించుతున్నాయి. ఇలాంటి కర్మలు నైమిత్తికకర్మలు అనబడతాయి.

నిత్యకర్మలు ఐదు విధములు. అవియే పంచమహాయజ్ఞములు. బ్రహ్మయజ్ఞము, దేవయజ్ఞము, పితృయజ్ఞము, అతిథియజ్ఞము, భూత యజ్ఞము లేక బలివైశ్వదేవము. ఈ యజ్ఞములను గృహస్థుడు నిత్యము తప్పకుండాచేయాలి. యజ్ఞము అంటే మంచిపని లేక ఉత్తమకర్మ అనబడుతుంది. 'యజ్ఞో వై శ్రేష్ఠతమం కర్మ'.

వేదములందు ఆచరింపదగినవిగా చెప్పబడిన కర్మలు విహితకర్మ లనబడును.

'కృషిమిత్ కృషస్వ' - వ్యవసాయం చెయ్యి

'సంగచ్ఛధ్వం' - కలిసి నడవండి

'సంవదధ్వం'—కలిసి మాట్లాడండి

'సంవో మనాంసి జానతామ్' — ఏకమనస్కులై తెలుసుకోండి, లేక ఆలోచనలో ఒకటిగా వుండండి.

వేదములో చేయకూడదు అని నిషేధింపబడినవి నిషిద్ధకర్మలు అనబడును.

'అక్షైః మా దీవ్యః' - పాచికలు (జూదము) ఆడవద్దు.

'గాం మా హిగ్ంసీః'—గోవును చంపవద్దు.

'అవిం మా హిగ్ంసీః' – గొఱ్ఱెను చంపవద్దు.
'అశ్వం మా హిగ్ంసీః' – గుఱ్ఱమును చంపవద్దు.
'మా హిగ్ంసీః సర్వా భూతాని' – ఏ ప్రాణిని హింసింపవద్దు.

అని యీ విధంగా వేదంలో విహితకర్మలు, నిషిద్ధకర్మలు చూడ నగును. విహితకర్మలు సంఘశాంతికారకములు. నిషిద్ధకర్మలు సంఘమునకు అశాంతి కలిగిస్తాయి. దొంగతనం, వ్యభిచారం, అసత్యం చెప్పడం యిలాంటివన్నీ సంఘానికి అశాంతి కారకములు.

'వేదోదితం స్వకం కర్మ నిత్యం కుర్యా దతంద్రితః' – మను.

వేదవిహిత కర్మలు అలసతను వీడి నిత్యము చేయుచుండాలి, అని మనుధర్మశాస్త్రంకూడ చెబుతుంది. నూరేండ్ల పర్యంతము (జీవించినంత కాలం) కర్మలు చేయవలసిందే. వాటిని విడువరాదు.

'యజ్ఞ దాన తపఃకర్మ న త్యాజ్యం కార్యమేవతత్' – గీత ౧౮–౫

యజ్ఞము, దానము, తపస్సు యీ కర్మలు వదలిపెట్టరాదు. తప్పక చేయవలసినవే, అని గీతకూడ చెబుతుంది.

'న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే,
న చ సన్న్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥' గీ. ౩–౪

మనుజుడు కర్తవ్యకర్మలు నాచరింపనంత మాత్రంచేత నిష్కర్మి కాడు. కర్మలుచేయక వానిని విడిచినంతమాత్రమున సిద్ధుడును కాడు.

కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్,
ఇంద్రియార్థా న్విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే ॥ గీ. ౩–౬

కొందరు హస్తపాదాది కర్మేంద్రియములను కట్టిపెట్టి కర్మల నాచరింపనివారై మనస్సులోమాత్రం ఇంద్రియార్థములైన రూపరసాదులను స్మరించుకుంటారు. అలాంటివారు కర్మసంన్యాసులుకాని, జ్ఞానులుకాని

కారు. వారు కేవలము మూఢాత్ములు, మిథ్యాచారులు, అసత్యాచరణ కల వారుగా ఎంచబడతారు. ఇవి నా మాటలుగావుసుమండీ ! శ్రీకృష్ణుడంతటి తత్త్వవేత్త చెప్పాడు. మేము కర్మసంన్యాసులము అని చెప్పుకొనేవారిని గురించి కృష్ణుడెంత కఠినంగా అన్నాడో చూడండి ! 'మిథ్యాచారః స ఉచ్యతే'-ఆతడు మిథ్యాచారు డనబడతాడు అన్నాడు. మీరు సంన్యాసులను చూచేవుంటారు. వారు కాషాయవస్త్రములను ధరించి గొప్ప కర్మసంన్యాసులుగా కనబడతారు. అందరియెదుట వా రేమీ తీసికోరు. ఏ కోరికలు లేని వారివలె నటించుతుంటారు. కాని లోలోన విషయసుఖములను గూర్చి చింతించుతూనే ఉంటారు. పైకి ఒకవిధముగ లోపల వేరొకవిధముగ వర్తిస్తుంటారు. వీరే మిథ్యాచారులు అనబడతారు. సంన్యాసులుకూడ లోకహిత కర్మలయందు-వేదవిహిత కర్మలయందు వర్తించుతూనే వుండాలి. నేలవిడిచి సాముచేయరాదు. మనమందరము కర్మఠులము కావాలి. వేదవిహితకర్మలను నిత్యము ఆచరించుతూ వుండాలి. నేడు వైదికులమని చెప్పుకునేవారిలోకూడ వేదవిహిత కర్మలు లేవు. ఇది చాల శోచనీయము.

మనం చేయవలసిన నిత్యయజ్ఞములలో మొదటిది బ్రహ్మయజ్ఞము. దీనిని గురించి చెప్పుకుందాము.

బ్రహ్మ అంటే పరమేశ్వరుడు. ఆయనను ఉదయము లేవగనే నిద్రమంచముపై నుండియే స్మరించాలి. ఉదయముననే అంటే సూర్యోదయం కాకముందే యని యర్థం. "య ఉద్యంత మాదిత్యం స్వపితి"-సూర్యుడు ఉదయించిన తరువాత నిద్రపోయే వానికి ఆయువు క్షీణిస్తుంది. సూర్యోదయాత్పూర్వమే లేచి, * ప్రాత రగ్నిం ప్రాత రింద్రం హవామహే...." (ప్రాంతఃకాలమున దేవుని ప్రకాశశక్తిని, ఐశ్వర్యశక్తిని

---

* ఓం ప్రాత రగ్నిం ప్రాత రింద్రం హవామహే
ప్రాత ర్మిత్రావరుణా ప్రాత రశ్వినా

మేము కోరుచున్నాము) ఇలాంటి ప్రాతఃస్మరణ మంత్రములతో పరమేశ్వరుని స్మరించాలి. భగవంతుడు సృష్టి స్థితి లయ కారకుడు. ఈ ప్రపంచాన్ని జీవుల భోగార్థమై ఆయన సృష్టించాడు. కనుక ఆయనను మనం మరువరాదు. మనం ఆయనకు * కృతజ్ఞులం కావాలిగాని • కృతఘ్నులం కారాదు. సామాన్యంగా లోకంలో ఎవరైనా మనకు మేలుచేస్తే మనం అతనిని మరువము. మనకు భగవంతుడు చేసిన మహోపకారము అసలే మరువరానిది. మన కాయన శరీరముల నిచ్చాడు. ఈ శరీరముల ద్వారా సుఖముల ననుభవించుటకు అనేక పదార్థములను సృష్టించాడు. ఆయన ప్రతిదినము జీవుల నన్నింటిని తన సన్నిధికి ఆకర్షించి ఆనందము కలుగజేసి శారీరిక మానసిక విశ్రాంతిని కలిగించుతున్నాడు. ఈ విశ్రాంతిని మనం సుషుప్త్యవస్థ (నిద్ర) లో పొందుతున్నాము. నిద్ర మన స్వాధీనంలో ఉండదు. నిద్ర మన స్వాధీనంలో ఉంటే మనం కోరినపుడు నిద్ర పోగలం. అవసరం లేదనుకుంటే వెంటనే మేలుకోగలం. కాని మన మలా చేయలేం. ఒక్కొక్కనాడు భర్త భార్యతో విసుగుకుంటూ అంటాడు. యేమేః నేను రాత్రి సరిగా నిద్రపోలేదే? అని. (సభలో నవ్వులు). కనుక భగవంతుడు మనలను నిద్రపుచ్చుతుంటాడు. ఆయనే నిద్రనుండి మనలను లేపుతుంటాడుగూడ. కొందరిపై ఆయనకు ప్రేమాభిమానము లెక్కువగా వుంటాయి కాబోలుః పాపము వారిని ఉదయం ఎనిమిదిగంటలైనా లేపడు.

---

ప్రాత ర్భగం పూషణం బ్రహ్మణస్పతిం
ప్రాతః సోమ ముత రుద్రం హువేమ॥ ఋగ్వేదం ౩-౪౧-౧౧

ఇట్టి మంత్రముల తాత్పర్యము 'వైదిక దినచర్య' యందు చూడనగును.

* కృతజ్ఞుడు = చేసినమేలు మరువనివాడు

• కృతఘ్నుడు = చేసినమేలు మరచువాడు

వారు అలా నిద్రపోతూనే ఉంటారు. (సభలో నవ్వులు). సూర్యోదయా త్పూర్వమే మేల్కొని మనము శౌచాది కాలకృత్యములను నెరవేర్చుకొని ఒకచోట గూర్చుండి సంధ్యోపాసన చెయ్యాలి. సంధ్య అంటే- 'సం'బాగా, 'ధ్య' చింతించడం. అంటే భగవంతునిగూర్చి బాగా చింతన చేయటం సంధ్య అవుతుంది. ప్రతిదినం ఉదయం సాయంత్రం (సంధ్యాసమయము లందు) పరమేశ్వరుని ఉపాసించాలి. ఉదయం సంధ్యవార్చిన అనంతరం కొంత స్వాధ్యాయంకూడ చేయడం అవసరం. స్వాధ్యాయ మంటే వేదాది సద్గ్రంథ పఠనము, పరమేశ్వరనామమైన ఓంకారమును జపించడమును. గాయంత్రీమంత్రము కూడ జపించవచ్చును. వీనివలన మనస్సు పవిత్ర మౌతుంది. ఇవి యన్నియు బ్రహ్మ యజ్ఞము క్రింద పరిగణింపబడతాయి.

రెండవది దేవయజ్ఞం :

అసలు దేవతలంటే ఏమిటో మనకు అర్థం తెలియదు. పురాణము లలో అనేక దేవతలు కల్పించబడ్డారు. వారికి కనురెప్పలు వాలవట! అలాగే గ్రుడ్లు తెరచుకొనియే నిద్రిస్తుంటారట! అమృతం త్రాగుతారట! వారికి చావేలేదట! కాని పాపం - "స్వర్గసుఖాలు ఎప్పుడూ వారే అనుభవించు తున్నారు. మే మెందులకు అనుభవించ"రాదని చెప్పి అపుడపుడు రాక్షసులు దేవతలపై దండెత్తుతూ ఉండేవారట! రాక్షసులధాటికి ఆగలేక పాపం యీ దేవతలు స్వర్గాన్ని వదలి పలాయనం చిత్తగిస్తుండేవారట! నానాయాతనలు పడేవారట! స్వర్గంలో నిత్యం సుఖాలే అనుభవిస్తుంటారు అనుకోబడే యీ దేవతలు కూడ పాపం అపుడపుడు యిలా దుఃఖాలపాలవుతుంటారట! (సభలో నవ్వులు). ఈ రాక్షసులను జయించుటకు భూమిపైనున్న రాజుల సహాయం కోరి వారు భూమికి వస్తూపోతూ ఉండేవారట! మరి యిపుడెవరూ భూమికి వస్తున్నట్లు లేదు. బహుశః ఈ దేవతలు ఏ రాకెట్టో తగిలి చచ్చి ఉంటారు! (సభలోనవ్వులు). వేదాల్లో ఈ దేవతలు లేరు. రంభ, ఊర్వశి

మేనక, తిలోత్తమ యిత్యాది దేవవేశ్య లెవరూ వేదాల్లో కనబడరు. వీరు పురాణాలలోనే ప్రత్యక్షమవు తుంటారు మనకు.

కాని, అసలు దేవత లెవరు? "భూమి ర్దేవతా, అగ్ని ర్దేవతా, చంద్రమా దేవతా, సూర్యో దేవతా"- భూమి, అగ్ని, చంద్రుడు, సూర్యుడు, వాయువు వీళ్ళంతా (వేదంలో చెప్పబడిన) దేవతలు. వీళ్ళు నిత్యం మనకు గోచరించుతారు. 'త్రయ స్త్రిగంశో వై దేవాః'- దేవతలు ముప్పది ముగ్గురని వేదమునందు చెప్పబడింది. ఈ ముప్పది ముగ్గురు దేవత లెవరో తరువాత చెప్పుకుందాము. యాస్కమహర్షి వైదిక శబ్దములను నిర్వచించుచు (నిరుక్తమునందు) 'దేవః కస్మాత్'- దేవత అంటే ఎవరు? అని ప్రశ్న వైచుకొని, 'దేవో దానాద్వా', 'ద్యోతనాద్వా', 'దీపనాద్వా', 'అథ ద్యుస్థానాద్వా' అని సమాధానం చెప్పినారు. అంటే దానాద్వా- దానము చేయడం, ద్యోతనాద్వా-స్వయంగా ప్రకాశించడం, దీపనాద్వా- ప్రకాశింపజేయడం, అథద్యుస్థానాద్వా- ద్యుస్థానమున ఉండడం. యీ లక్షణాలు వేనిలో ఉంటాయో అవిదేవతలని చెప్పబడతాయి. భూమి ఒక దేవత. దీనిలో సర్వం ఉంటాయి. భూమికి వసుధ అని కూడ పేరు. 'వసు' అంటే ధనము, 'ధ' అంటే ధరించునది అని అర్థం. దీనిలో సమస్త వస్తువులు-వెండి, బంగారము మొదలైన వన్నీ ధరింపబడి ఉంటాయి. గనుక భూమిని వసుధ అన్నారు. ప్రాణులు తాము జీవించుటకు అవసర మైన పదార్థాలన్నీ యీ భూమినుండే సంపాదిస్తాయి. స్త్రీలు పెట్టుకునే ఆభరణాలు యీ భూమినుండి లభ్యమయ్యే వెండి, బంగారము నుండే తయారవుతాయి. ఇలా ఆలోచించితే మనకీ భూమి వలన ఎన్నో ఉపయోగా లున్నట్లు తెలిసికొంటాము. తరువాత అగ్ని ; ఇదికూడా దేవత. శరీరంలో వేడిలేనిదే మనం అసలు జీవించలేం. అగ్నితో అన్నం వండుతాము. దీపాలు పెట్టుకుంటాం, లోహాలను కరిగించి మనకు కావలసిన వస్తువులను తయారు చేసుకుంటాము. విజ్ఞానశాస్త్రం (Science) వృద్ధి అవుతున్న

కొద్దీ, ఈ అగ్ని వలన ఎన్నో క్రొత్త క్రొత్త ప్రయోగాలు చేసి చివరికి రాకెట్లపై గ్రహాంతరయానం కూడ చేస్తున్నాం. తరువాత వాయువు గూడ దేవత; వాయువు లేనిది క్షణంగూడ బ్రతుకలేం. సమస్త జీవకోటికి వాయువు ప్రాణాధారం. మనకిది బాగా తెలుసు. తరువాత జలం; ఇది గూడ దేవత. భూమికంటె నాలుగురెట్లు జలమున్నది. ఇదే సముద్రం. దీనినే వరుణ దేవత అంటారు. "నీరే ప్రాణాధారము" అని మనకందరకు తెలుసు. ఇక విద్యుత్తు; ఇది గూడ దేవత. వైదిక భాషలో దీనిని ఇంద్రు డంటారు. తెలుగులో దీన్ని మెరుపు అంటారు. ఇలా దేవతలు చాలా ఉన్నాయి. ఈ దేవతలకు మించి మనకు ఉపయోగపడే దేవత రెవరూ లేరు. పురాణములలోని దేవలోకము, దేవేంద్రుడు, రంభాదులు కల్పితములే.

మనం భూమి, జలము, వాయువులను ఉపయోగించుకొని వాటిని మలినం చేస్తుంటాము. భూమినుండి ఉత్పత్తియైన అన్నాదులను స్వీకరించి మలముగా విడుస్తుంటాము. జలమును త్రావి మూత్రరూపమున విడుస్తుంటాము. వాయువును పీల్చి దాన్ని మలినం చేస్తాము. కనుక మరల యీ భూతములను సంస్కరించుకొనకుండ ఉపయోగించు కొనేట్లయితే మనకు హాని కలుగుతుంది. దేశంలో వ్యాధులు ఎక్కువవుతాయి. అందుచేత పృథివ్యాది భూతములను సంస్కరించుటకు నిత్యం యింటింటా అగ్నిహోత్రం చేస్తుండాలి. పూర్వం ఈ అగ్నిహోత్రమును నిత్యకర్మగా చేస్తుండేవారు. ఇదియే దేవయజ్ఞము. దీనిని గురించియే గీతలో ఇట్లున్నది.

సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురో వాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽ స్త్విష్టకామధుక్॥ గీ. ౩-౧౦

సృష్ట్యారంభమున పరమేశ్వరుడు యజ్ఞముతోబాటు మానవులను సృజించి

ఈ యజ్ఞముతో అభివృద్ధి పొందుడు. ఇది మీ వాంఛితములను తీర్చుతుంది. కామధేనువు వంటిది. అని ఉపదేశించి యున్నాడు.

దేవాన్ భావయ తానేన తే దేవా భావయంతు వః
పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ॥

—గీ. ౩-౧౧

మానవులారా ! యజ్ఞముతో మీరు దేవతలను భావింపుడు. అంటే సంస్కరింపుడు అని. అపుడు శుద్ధములైన ఆ దేవతలు మిమ్ముల నాదరింతురు. మిమ్ములను ఆరోగ్యవంతులను జేయుదురు. ఇట్లు దేవతలు, మీరు 'పరస్పరం భావయంతః— పరస్పరము శుద్ధి వృద్ధులను జేసికొనుచు పరమశ్రేయస్సు ననుభవింతురుగాక !

కనుక నిత్యము అగ్నిహోత్రము ద్వారా యీ దేవతలను సత్కరించాలి. సత్కరించడం అంటే సంస్కరించడం. అపుడు వాయ్వాది దేవతలు శుద్ధములై ప్రాణులకు ఆరోగ్యదాయకము లౌతాయి. ఎలా సంస్కరించాలి? యజ్ఞము (అగ్నిహోత్రం) లో హవ్య ద్రవ్యమును ఉపయోగించుతారు. దీనిని మనం అసలు మరిచిపోయాము. నేయి, ఓషధులు, కర్పూరం, కుంకుమపువ్వు, యివన్నీ హవనద్రవ్యంగా యజ్ఞములో ఉపయోగించబడతాయి. ఈ హవనద్రవ్యం అగ్నిలోనే ఎందుకు వేయాలి? జలాదులయందు ఏలవేయరాదు? అని సందేహం కలుగవచ్చు. 'అగ్నిర్వైదేవానాం ముఖం'— 'అగ్నియే దేవతలకు నోరు' అన్నారు. మనం పదార్థములను నోటిలోవేసికొంటే శరీరానికంతటికి అవి పోషకములౌతవి. అంతే గాని నోరు తానేతిని యింతలావుకాదు. (సభలో నవ్వులు). అలాగే అగ్నిలో వేసిన పదార్థములు కూడ భస్మమై-సూక్ష్మరూపం ధరించి-వాయువులో చేరుతాయి. వాయువు ద్వారా మిగిలిన భూతములలో వ్యాపించుతాయి. అలా భూమి వాయు జలములు శుద్ధములవుతాయి. అగ్నిలో వేసిన

పదార్థములు నష్టము లవుతాయని పదార్థవిద్య తెలియనివా రనుకుంటారు. కాని అవి వ్యర్థములుకావు. సూక్ష్మరూపము పొంది వాయువులో వ్యాపించు తాయి. ఆ వాయువు నాఘ్రాణించే అసంఖ్యాకములైన ప్రాణులకు ఆరోగ్యము, పుష్టి కలుగుతాయి. కనుక యజ్ఞంవలె ప్రాణులకు మేలుచేసే సత్కర్మ యింకొకటిలేదు. అందుకనే 'యజ్ఞోవైశ్రేష్టతమం కర్మ' అన్నారు. ఈ విషయం మనమహర్షులు బాగా ఎరిగి ఉండటంచేత వారు యజ్ఞప్రక్రియల నేర్పరచి యున్నారు. ఉదాహరణకు నాల్గు మిరపకాయలు నిప్పులో వేసి చూడండి. అవి కాలి, భస్మమై సూక్ష్మరూపం ధరించి వాయువులో వ్యాపించుతాయి. ఆ వాయువును పీల్చుకున్న వారికి వెంటనే తుమ్ము లొస్తాయి. అలాగే మంచివస్తువులను, పుష్టికారక పదార్థములను అగ్నిలో వేస్తే అవి సూక్ష్మమై శరీరంలో ప్రవేశిస్తాయి. మనకు ఆరోగ్యం చేకూరుతుంది. సైంటిస్టులు యజ్ఞములో వేసే ఓషధులు మొదలైన హవన సామగ్రిని పరీక్షించి యివి శరీర రుగ్మతలను కూడా కుదర్చగలవని, యజ్ఞకార్యం ఉత్తమైనదేనని అంగీకరించారు కూడా.

మా ముసలమ్మ ఒకామె ఉండేది. ఆమె ప్రతిరోజూ వండినఅన్నంలో నుండి కొంచెం తీసి ముందుగా అగ్నిలో వేస్తుండేది. తరువాత మాకు అన్నం పెట్టేది. అవ్వా! ఎందుకని యిలా చేస్తున్నావు? అని మే మడిగితే ఏదోలే నాయనా! ఇది ఆచారం అంటుండేది. కాని పాపమామెకు దీని ఉద్దేశ్య మేమిటో తెలిసేదికాదు. పూర్వం ఇంటింటా జరిగే యజ్ఞం నేడు ఈ రూపంలో మిగిలిపోయింది.

"తైర్ దత్తా నప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః"

—గీ. ౩-౧౨

భగవద్గీతలో కృష్ణుడొకచోట అంటాడు. ఈ దేవతలచేత యీయ బడిన పదార్థములను వాని కర్పింపకుండ ఎవడు తానే భుజించుతాడో వాడు

'స్తేన ఏవ'- దొంగే అంటాడు. కనుక పదార్థాన్ని తనకొఱకే పచనం చేయటం పాపం. తాను వండుకొనినది ఇతరులకుకూడ కొంతపెట్టాలి. ఇది దైవయజ్ఞం అనబడుతుంది. భగవద్గీత 3 వ అధ్యాయంలో ఈ యజ్ఞ కర్మములకు సంబంధించిన శ్లోకాలు ఉన్నాయి. చూచుకోవచ్చును.

తరువాత పితృయజ్ఞము :

పితరుల నుద్దేశించి చేయు కార్యము పితృయజ్ఞ మగును. చనిపోయిన తలిదండ్రులు పితరులు కారు. వీరికొరకు చేయు పిండదానాదులు యజ్ఞము కాదు. బ్రతికియున్న తలిదండ్రులే పితరులు. కనుక బ్రతికియున్న మాతాపితరులకు-వృద్ధులకు చేయబడు సపర్య పితృయజ్ఞ మనబడుతుంది. లోకంలో బ్రతికినవాళ్ళకు అన్నంలేక అవస్థలు పడుతుంటే మనవాళ్ళు చచ్చినవాళ్ళకు పెడతారు. ఇదేం న్యాయమో మరి! (సభలో నవ్వులు). పితరులు అంటే ఎవరు? 'మాతాచ పితాచేతి పితరౌ'-తల్లి, తండ్రి వీరిని పితరులు అంటారు. బ్రహ్మచారి పితకాడు. నే నున్నాను. నేను పితను కాను. నేను నా మాతా పితరులకు అన్నవస్త్రాదులిచ్చి శ్రద్ధతో వారిని సేవించుటకు వీలున్నది.

నాలుగవది అతిథి యజ్ఞం :

అతిథి అంటే తిథి లేకుండా వచ్చేవాడు. తిథి అంటే ఒక నిశ్చిత సమయం. నిశ్చిత సమయం యేదీ లేకుండా వచ్చేవాడు అతిథి అనబడతాడు. వెనుకటి రోజుల్లో అతిథులకు సత్కారం బాగా చేస్తుండేవారు గృహస్థులు. ఇప్పుడు అన్నివస్తువులకు రేట్లు పెరిగిపోయాయి. పాపం యిక వాళ్లేం పెడతారు? అందుచేత వచ్చిన అతిథి ఏ హోటల్లోనో భోజన చేసి యింటికి వస్తాడు. అన్నం తినమంటే తినడు. హోటల్లో భోజనం చేశాలే అంటాడు- (సభలో నవ్వులు). భిక్షాటనమే వృత్తిగా పెట్టుకుని రోజూ వచ్చేవాళ్ళు అతిథులు కారు. విద్యావంతులు, పరోపకారులు,

జితేంద్రియులు, సత్యవాదులు, కపటము మొదలైన దోషాలు లేనివారు, నిత్యము పర్యటనచేయు ధార్మికపురుషులు అతిథులనబడతారు. వీరికి ఆతిథ్యమిచ్చి, సంతోషపెట్టడం వేదవిహిత కర్మగా గుర్తించాలి.

అయిదవది భూతయజ్ఞం :

దీనినే బలివైశ్వదేవ యజ్ఞమనికూడ అంటారు. ఇంటిలో వుండే కుక్క, గోవు మొదలైన పెంపుడు జంతువులకు ఆహారముపెట్టి రక్షిస్తుండాలి. అవి గృహము నాశ్రయించుకొని గృహరక్షణకై తోడ్పడుతుంటాయి. ఇది భూతయజ్ఞ మవుతుంది.

ఈ విధంగా నిత్యకర్మలంటే ఏమిటో తెలిసికొన్నాము. వీటినే కర్తవ్యకర్మలని కూడ అంటారు. మనంచేసే పనులు నిత్యకర్మలు, నైమిత్తిక కర్మలు, కామ్యకర్మలు అని మూడురకములుగా వుంటాయని చెప్పుకున్నాము. ఈ కర్మలను ఫలముకోరక చేసేట్లయితే నీవు బద్ధుడవుకావు, నీకు ప్రత్యవాయము అంటదు, అంటాడు కృష్ణుడు. ప్రత్యవాయము అంటే పాపమని అర్థం. విశేషించి ప్రత్యవాయమనగా పంచమహాయజ్ఞములు ఆచరింపనందువలన కలిగే పాపం, ఇలా వేదవిహిత కర్మలు చేస్తూ ఉండాలి.

'కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతగ్ం సమాః'

జీవించినంతకాలం ఈ సత్కార్యము లాచరించుతూనే వుండు. 'అన్యథా నాస్తి'-తరించుటకు మరొక ఉపాయంలేదు. అని వేదమాత చెబుతుంది. మీరొకటి గుర్తుపెట్టుకోవాలి. ఈ యజ్ఞప్రక్రియలు, వీటి వుపయోగములు వైదికమతావలంబులైన ఒక్క హిందువులకే తెలుసునుగాని ప్రపంచంలో క్రైస్తవాది మరే యితర మతస్థులకు తెలియదు. గృహస్థులయినవారు ముఖ్యంగా యజ్ఞాది సత్కర్మలను చేస్తూ వుండాలి. విడువరాదు.

'కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః'-గీ. ౩-౨౦

జనకచక్రవర్తి మొదలైనవారంతా కర్మలచేతనే సిద్ధిని బొందారు. రాజ్యభారం వహిస్తూ జనకుడు కర్మలు చేశాడు. ఆనాటి ప్రామాణిక బ్రహ్మవేత్తలలో ఆయన ఒకడుగా పేరుపొందాడు. ఒకమారు మిథిలా నగరము తగులబడుతుంటే సభలోని పండితులంతా కలవరపడి అటూ ఇటూ పరుగులెత్తారు. ఒక్క జనకుడు మాత్రం నిశ్చలంగా ప్రశాంతంగా కూర్చుండిపోయాడు. అదేమిటని అడిగితే. మిథిలానగరం సర్వస్వము దగ్ధమైనా నాదేమీ పోదని ఆయన జవాబిచ్చాడు. అంతటి నిర్లిప్తు డాయన. నీటిలోని తామరాకు చందమున వర్తించా డాయన ప్రపంచంలో వుంటూ, ప్రపంచ కార్యక్రమాలలో పాల్గొంటూకూడ. అందులకనియే జనకుడు రాజైనను ఆయనను రాజర్షి అన్నారు. అయన రాజే కాకుండా ఋషికూడా నని అర్థం.

'న నిరగ్నిర్ నచాక్రియః'-గీ. ౬-౧.

అగ్నిహోత్రాది కర్మలు చేయనంత మాత్రంచేత ఒకడు సంన్యాసి కాడు. కర్మలను త్యజించడం కాదు సంన్యాసి లక్షణం. కర్మఫలములను త్యజించడం సంన్యాసం అవుతుంది. అదే కర్మయోగం అంటాడు కృష్ణుడు.

అందుచేత విహిత కర్మలను మనం విస్మరించకుండా చేయాలి. కర్మఫలములను ఈశ్వరుని కర్పించి, జనన మరణ దుఃఖములనుండి విడి వడి విముక్తులం కావాలి. అందుకొరకు జీవించినంతకాలం తప్పనిసరిగా కర్మలు చేయవలసిందే. 'కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతగ్ం సమాః'-మిగిలింది రేపు చెప్పుకుందాము.

---

గుంటూరు, 27-12-1968
శుక్రవారం, సా. 6-00 గం.

మహాజనులార!

ఇంతవరకు మనం రెండు మంత్రములు చెప్పుకున్నాము. మొదటి మంత్రంలో, "ఈశ్వరుడు అంతటా వ్యాపించి ఉంటాడని, ఆయన ఈ ప్రపంచానికి కర్త అని, ఈ సృష్టి పరమేశ్వరుని ఐశ్వర్యమని, కనుక మనం త్యాగబుద్ధితో ఈ ప్రపంచగత పదార్థములను అనుభవించా"లని చెప్పుకున్నాం. రెండవ మంత్రములో-"కర్మలు చేయటంలో జీవులు స్వతంత్రులని, అలసత్వం విడిచి వేదవిహిత కర్మలను నిత్యం చేస్తూ ఉండాలని, యీ వేదవిహిత కర్మలుకూడ ఫలాపేక్షారహితంగా చేయాలని, అలాచేస్తే కర్మ బంధనహేతువు కాదని, అపుడు జీవుడు ముక్తుడౌతా" డని చెప్పుకున్నాం. నేడు మూడవమంత్రం చెప్పుకుందాము.

అసుర్యా నామ తే లోకా అంధేన తమసావృతాః
తాంస్తే ప్రేత్యాపి గచ్ఛంతి యేకే చాత్మహనో జనాః॥ 3

భావార్థము :- ఎవరు అజ్ఞానముతో కూడుకొని, ఆత్మకు విరుద్ధముగ నడుచుకొందురో వారు అసురులు, దైత్యులు, రాక్షసులు, పిశాచులు, దుష్టులు నగుదురు. వారు మనస్సులో నొకటి యుంచుకొని, వాక్కుతో వేరొకటి చెప్పుదురు. కర్మములలో మరియొకటి చేయుదురు. అందువలన వారు అవిద్యాది దోషములలో చిక్కుకొని దుఃఖముల పాలగుదురు. ఆనందమును బొందజాలరు. అట్లుకాక యెవరు మనోవాక్కాయ కర్మలలో నొక్కటిగా నుందురో వారే దేవతలు, ఆర్యులు ననబడుదురు. వారు శుభగులై లోకమును పవిత్ర మొనర్తురు. అతుల సుఖముల నిహాపరములం దనుభవింతురు.

పరమేశ్వరవిజ్ఞానమైన వేదమున నిర్దేశించిన కర్మలను చేయనివారిని, పరమేశ్వరుని తెలుసుకొనని వారిని అసురులు అంటారు. సురలు అంటే దేవతలు, అసురులు అంటే రాక్షసులు అని సామాన్యంగా అందరికీ తెలుసు. లోకులు అంటే జనులు. లోకశబ్దం మనుష్యవాచకం. జీవులు నివసించే చోటునుకూడ లోకశబ్దంతో వ్యవహరిస్తారు. (లోకస్తు భువనే జనే). ఆత్మ అంటే అంతటా వ్యాపించి ఉన్న వస్తువు. 'అతతి సర్వత్ర వ్యాప్నోతి ఇతి ఆత్మా'. ఆత్మహనులు అంటే ఆత్మను హత్య చేసేవారు. కాని ఆత్మ చచ్చేదికాదు. మరి ఈ ఆత్మను చంపడం అంటే ఏమిటి? పరమేశ్వరుడు వేదములో మానవులకు కొన్ని ఆదేశముల నిచ్చియున్నాడు. ఆ యాదేశము లకు విరుద్ధముగా నడుచువారు ఆత్మఘాతుకులు అనబడతారు. పితృఘాతుకుడు అంటే ఏమిటి? తల్లి దండ్రుల మాటలు వినక వారు చెప్పిన దానికి విరుద్ధంగా నడిచేవాడు అనికదా అర్థము.

ఈ ప్రపంచాన్ని సృష్టించి, పోషించి, లయంచేసే శక్తిగల ఆత్మ ఒకటి ఉన్నదని అంగీకరించని వారిని భౌతికవాదులు అంటారు. వారు కేవలం పంచభూతముల సమ్మేళనమువలననే యీ సృష్టి యేర్పడుతుందంటారు. మన శరీరంకూడా పంచభూతాత్మకమే నంటారు. మరి వీళ్ళ గమ్యం ఏమిటి అంటే, శరీరసుఖములను అనుభవించడమే. 'యావజ్జీవేత్ సుఖం జీవేత్' జీవించినంతకాలం సుఖంగా జీవించు. 'ఋణం కృత్వా ఘృతం పిబేత్'- అప్పుచేసి నెయ్యి త్రాగు. 'భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః'- ఈ శరీరం తగలబడిన తరువాత మరల ఎట్లు వచ్చును? కనుక నీవు అప్పుతీర్చే పనేలేదు. (సభలో నవ్వులు). అందుచేత ఎలాగైనాసరే జీవించినంతకాలం అప్పుచేసి అయినా సుఖము లనుభవించడానికే ప్రయత్నం చెయ్యి- అంటారు భౌతికవాదులు.

ఇక ఆత్మవాదులు ఈ శరీరంకంటే భిన్నమైన ఒక వస్తువు కలదని అంగీకరించుతారు. వీరికి లక్ష్యము ధర్మార్థ కామమోక్షములు. కేవల కామభోగం కాదు.

మానవుడు జీవితంలో సాధించవలసినవి నాలుగున్నాయి. వీనినే 'పురుషార్థములు' అంటారు. పురుషుడు అంటే జీవుడు. పురము అంటే శరీరము. ఈ శరీరమనే పురములో ఉండు జీవుడు పురుషుడు అనబడును. అలాగే పరమేశ్వరునికి గూడ పురుషశబ్దం వాడతారు. మరి పరమేశ్వరునికి శరీరమేమిటి? ఈ ప్రపంచం ఆయన శరీరం. అర్థింపబడేవి అంటే కోర బడేవి అని అర్థం. ఈ శరీరంలో ఉన్న పురుషునిచేత కోరబడేవి నాలు గున్నాయి. వీనినే పురుషార్థము లని లేక చతుర్విధ పురుషార్థములని అంటారు. ధర్మము, అర్థము, కామము, మోక్షము. వేదకాలంలో వీనిని బాగుగా ఎరిగి పొందుటకు ప్రయత్నం చేసేవారు. వేదకాలం అంటే, వేదములు జనబాహుళ్యమున ప్రచారంలో ఉన్నరోజులు. మనమిపుడు అవైదికుల మయినాము. మనకు ధర్మం అంటే ఏమిటో తెలియదు. అర్థం, కామం యివి మనకు బాగా తెలుసు. మోక్షం అంటే కూడ తెలియదు. మనం ధర్మ మోక్షములను మరచాము. పురుషార్థములలోని ఆద్యంతములను మరచి, మధ్యలోనున్న అర్థ కామములను మాత్రం బాగా గుర్తుంచుకున్నాం.

అంటరానితనం ఒకప్పుడు మనదేశంలో ధర్మంగా ఉండేది. ఇపుడు కూడ అది పూర్తిగా పోలేదనుకోండి. పసిపిల్లలకు పెండ్లిండ్లు చేయటం ధర్మంగా యెంచారు. ఒక పురుషుడు చాలమందిని వివాహం చేసుకోవడం ధర్మంగా ఎంచారుకొన్ని రోజులు. బెంగాల్లో యీ ఆచారం ఎక్కువగా ఉండేది. కాశీలో వేదాంతం చెప్పే పండితు లొకరుండేవారు. కొన్నాళ్ళు ఆయనవద్ద చదువుకున్నాను. ఆయనకు ఏడుగురు పెండ్లాలని నాకు తరువాత

తెలిసింది. ఇది తెలిసి నేను విస్తుపొయ్యాను. గురువే ఏడుగురిని సంపాదిస్తే శిష్యులు యింకా ఎక్కువమంది భార్యలను సంపాదించాలేమోనని అనుకున్నా. (సభలో నవ్వులు). తరువాత ఆ గురువుగారిని వదలివేశాను.

అష్టవర్షా భవేత్ గౌరీ నవవర్షా చ రోహిణీ
దశవర్షా భవేత్ కన్యా అతఊర్ధ్వం రజస్వలా॥

ఎనిమిదేండ్ల పిల్ల గౌరి యని, తొమ్మిదేండ్ల అమ్మాయి రోహిణి అని, పదేండ్లుంటే కన్య అని, పదేండ్లు దాటితే రజస్వల అనబడుతుందని శ్లోకార్థం. కన్యాదానం చేయాలంటే 10 సంవత్సరముల లోపే చేయాలట. ఇలాంటి శ్లోకాలు ఆధారంచేసుకొని పూర్వము చిన్నపిల్లలకు పెండ్లిండ్లు చేసేవారు. 60 ఏండ్ల వృద్ధునికి పెండ్లిచేయటం ధర్మం అనుకునేవారు. అందుచేతనే కాటికి కాళ్ళుచాచిన వృద్ధులకు బాలికల నంటగట్టేవారు. ఈ వృద్ధులు చచ్చిపోవటంతో అన్నెం పున్నెం ఎరుగని బాలికలు వితంతువులయేవారు. ఇప్పటికీ దేశంలో బాలవితంతువులు వేలలో లక్షలలో కనుపించుతారు. ఇది యంతయు ధర్మమని చేసిన కర్మలఫలము. మనమంతా వైదికులం. మనం వేదవిహితకర్మల నంగీకరించుతాము. పైన చెప్పిన అంటరానితనము, బాల్య వివాహము, వృద్ధవివాహము, బహు వివాహము మున్నగునవన్నియు వేదవిహితములు కావు. అందువలన నవి ధర్మములు గావు. అధర్మాలను ధర్మాలుగా నెంచి చేశారు.

తరువాత అర్థం: భారతయుద్ధానికి పూర్వమే అర్థమునకు విలువ హెచ్చింది. భారతయుద్ధానికి ముందు ఒకరు భీష్ముణ్ణి నీవు పాండవపక్షపాతివికదా! ఎందుకు పాండవుల తరఫున యుద్ధంచేయవు? అని అడిగితే ఆయనంటాడు – నేను,అర్థానికి దాసుణ్ణయినాను. దుర్యోధనుని ఉప్పు పులుసు తిన్నాను. కనుక పాండవుల తరఫున వచ్చి యుద్ధము చెయ్యలేను అన్నాడు. 'అర్థస్య పురుషో దాసః, దాసస్తు అర్థో న కస్యచిత్'– 'ధనము

నకు దాసుడు పురుషుడు, ధనము పురుషునకు దాసుడు కాదు.' కావున భీష్ముని కాలంనాటికే దేశంలో యీ పరిస్థితి వచ్చింది. నేటి మానవులు అర్థానికి దాసులయి, ధర్మ మోక్షములను విసర్జించారు. నేడు డబ్బుతో కాని పనిలేదు. ఇది మీకు బాగా తెలుసు. ఈ అర్థప్రభావంవలన పరిస్థితులు తారుమారయినాయి. ధర్మము అధర్మముగాను, అధర్మము ధర్మముగాను చెలామణీ అవుతున్నది. అర్థవంతు డెట్టివాడైనా, ధార్మికుడుగా ఎంచబడుతున్నాడు లోకంలో. అసలు ధర్మమంటే ఏదో అధర్మమంటే ఏదో కూడ మనకు తెలియుటలేదు. కనుక ధర్మ నిర్వచనం అవసరం. మన పూర్వపు తత్త్వవిదుడైన కణాదుడు (వైశేషిక దర్శనకర్త) ధర్మమంటే ఏమిటో ఇలా నిర్వచించాడు.

"యతో అభ్యుదయ నిశ్శ్రేయస సిద్ధిః స ధర్మః"

—వై. ద. ౧-౧-౨

దేనివలన అభ్యుదయము, నిఃశ్రేయసము సిద్ధించుతాయో దానికి ధర్మమని పేరు' అభ్యుదయ మంటే మనుష్యుని ఐహికాముష్మిక అభివృద్ధి. నిఃశ్రేయసం అంటే మోక్షమని అర్థం. ఈ రెంటిని దేనిద్వారా సాధించగలమో అది ధర్మం. స్వర్ణకారుడు బంగారం మంచిదో కాదో పరీక్షించుటకు తనదగ్గర గీటురాయి నొకదానిని ఉంచుకుంటాడు. మీరు కల్తీబంగారాన్ని అతనికిస్తే దానిపై అటు యిటు గీచి, యిది కల్తీబంగారమని చెప్పేస్తాడు. మనం అలా చెప్పలేం. అలాగే ధర్మానికికూడ ఒక గీటురాయి ఉన్నది. ఏపనిచేస్తే ప్రాణికోటికి మేలు కలుగుతుందో అది ధర్మం. ఏకార్యంవలన కీడుకలుగుతుందో అది అధర్మం. ఈ గీటురాయిని మనదగ్గర ఉంచుకుంటే మనంచేసే పనులు ధార్మికములైనవో కావో తెలుసుకోగలం. బాల్యవివాహములు అధర్మం అన్నాము. వివాహం సంతానార్థం ఉద్దేశింపబడింది.

సంతానం కలగాలంటే యుక్తవయస్కులైన వారికే వివాహం చెయ్యాలి. కనుక బాల్యవివాహములు చేసినందువలన ఉపయోగం లేదు. కావున అది అధర్మముకాక మరి యేమిటి?

"బ్రహ్మచర్యేణ కన్యా యువానం విందతే పతిం"

—అథర్వణవేదం

కన్య బ్రహ్మచర్యవ్రతమును పూర్తిచేసి యువకుని పెండ్లిచేసుకుంటుంది, అని మంత్రార్థం. దీనివలన బాల్యవివాహములు చేయరాదని అర్థమౌతుంది.

"త్రీణి వర్షాణి ఉదీక్షేత కన్యా ఋతుమతీ సతీ"

కన్య ఋతుమతి అయిన తరువాత మూడేండ్లవరకు పెండ్లిచేసుకోరాదంటాడు మనువు. తరువాత తగినవరుడు దొరకకపోతే పెండ్లి చేయరాదు. ఇంటిలోవున్నా ఫరవాలేదు అని మనూక్తి. ధర్మసూక్తు లిట్లుండ వానిని విస్మరించి బాల్యవివాహాలు ధర్మమని యాచరించి దేశాన్ని దుఃఖ భూయిష్టం చేశాము. ధర్మం అని చాలకాలం పాటించాం. అందువల్ల కలిగిన నష్టం కళ్ళార చూస్తున్నాం. అంటరానితనం అధర్మం. మన సాటి మానవులను కొందరిని నన్ను ముట్టకు, నన్ను ముట్టకు అని దూరంగా ఉంచుతున్నాము. అందుచేత వారు క్రైస్తవమతంలో కలుస్తున్నారు. ఈనాడు దేశంలో వందల వేల సంఖ్యలో మిషనరీలు పనిచేస్తున్నారు. హిందువులు సామూహికంగా మతాంతరులుగా చేయబడుతున్నారు. రామ కృష్ణాది నామములను పెట్టుకొనినవారిని యాకోబు, జాకోబులుగా చేస్తున్నారు. ఏమిటీ యీ అన్యాయం. ఇది యిలా సాగిపోవలసిందేనా! నేడు (హిందూ) ధర్మరక్షకులుగా చెలామణి అవుతున్న పీఠాధిపతులు చెప్పేది ఏమిటో తెలియునా! "పోతేపోయారులే మాలముండాకొడుకులు, అంత మాత్రంచేత మన ధర్మం నశించదు" అంటారు. వీరిని మన మే మనాలో

తెలియదు. క్రైస్తవులుగా మారిన హిందువులలో రాష్ట్రీయ భావన లేకుండా చేస్తున్నారు. 'ఇది భారతదేశం. 'నేను భారతీయుణ్ణి. ఇతర దేశస్థుడు నా పై పెత్తనం చెలాయించరాదు'-అనే దేశభక్తికూడ వారిలో లోపిస్తున్నది. దేశ ఐక్యతకు విరుద్ధంగా వర్తిస్తున్నారు. అస్సాం, నాగాలాండ్ మొదలయిన చోట్ల యివ్వాళ క్రైస్తవ మిషనరీలుచేసే పనేమిటో మీకు తెలుసు. వారు మతం ముసుగుతో దేశాన్ని చీలదీయుటకు ప్రయత్నాలు చేస్తున్నారు. నేడు దేశంలో పరిస్థితి ఎంతదారుణంగా ఉందో చూడండి. ఈ యనర్థానికి కారణం ఏమిటి ? అంటరానితనం ధర్మం అనుకొని ఆచరించుటయేకదా! ఇట్టి నష్టదాయకకార్యం ధర్మమెట్లవుతుంది?

ధర్మం అంటే అభ్యుదయానికి నిఃశ్రేయసమునకు తోడ్పడేదని మనం చెప్పుకున్నాంకదా!

నిఃశ్రేయసము అంటే మోక్షము. మోక్షము అంటే 'విడుపు' అని అర్థం. మనం బంధనంలో ఉన్నాము కనుక మనకే యీ విడుపు అవసరం. ఏమిటా బంధనం, అంటే దుఃఖమే. మనం దుఃఖగ్రస్తులం. అంటే దుఃఖములచేత బంధింపబడినవాళ్ళం. లేక దుఃఖంతో కూడుకొన్నవాళ్ళం. పసిబిడ్డగా పుట్టినది మొదలు మరణపర్యంతం దుఃఖమే మనలను వెంటాడుతున్నది. బాల్యంలో, యౌవనంలో, కౌమారంలో, వృద్ధాప్యంలో కూడ యీ దుఃఖం మనలను అనేకవిధాలుగా పీడింసుతున్నది. ఈ దుఃఖ విముక్తికి మార్గం ఏమిటో ఆలోచించాలి. అది కనుగొనేందుకే బుద్ధుడు రాజ్యాన్ని, భార్యను, బిడ్డను కూడ విడిచి అరణ్యములకు పోయాడు.

దుఃఖం ఆధ్యాత్మికం, ఆధిభౌతికం ఆధిదైవికమని మూడువిధాలుగా ఉంటుంది. 'తాపత్రయము' అనికూడ దీనినే అంటారు. ఆధ్యాత్మిక దుఃఖం శరీర, మనస్సులకు సంబంధించి రెండు విధములుగా ఉంది. వాత, పిత్త, శ్లేష్మము లను ధాతువుల వైషమ్యమువలన శరీరమునకు కలుగు జ్వరం

మొదలైన వ్యాధులు శారీరకము. కామము, క్రోధము, లోభము, మోహము మదము, ఈర్ష్య యిలాంటి వికారములచేత మనసులో ఏర్పడు దుఃఖము మానసికము. తరువాత ఆధిభౌతిక దుఃఖము; తనకంటె అన్యమైన మనుష్య, పశు, పక్షి, మృగాదులచేత ఏర్పడు దుఃఖము ఆధిభౌతికము. మూడవది ఆధిదైవికదుఃఖము. భూమి కంపిస్తుంది. వేలకువేలు ఇండ్లు కూలిపోతాయి. లక్షలాది జనులు చనిపోతారు. అలాగే అగ్ని ప్రకోపిస్తుంది. ఇళ్ళనేకం దగ్ధమౌతాయి. గాలివాన వస్తుంది. తీవ్రంగా వరదలు వస్తాయి. పంటలు నాశనమౌతాయి. వీటివలన మనకు దుఃఖం కలుగుతుంది. ఇవన్నీ ఆధిదైవిక దుఃఖములు: ఇలా దుఃఖములు మూడు విధములుగా ఉన్నాయి. ఈ త్రివిధ దుఃఖములయొక్క అత్యంతాభావమే (బొత్తుగా లేకుండా పోవడమే) మోక్షం అనబడుతుంది. మన జీవితానికి లక్ష్యం ఇదే.

మరి మనకు అర్థం, కామం అవసరంలేదా అని అడుగవచ్చు. కావాలి. అవికూడ కావాలి. కాని ఎంతవరకు ? శరీరయాత్రకు ఆవశ్యకమైనంతవరకు అర్థం సంపాదించవలసిందే. ఆ సంపాదించడం ధర్మపూర్వకంగా ఉండాలి. అధర్మంగా ధనసంపాదన చేయరాదు. సామాన్యమానవులు ధర్మానుకూలంగా సంపాదించుకొంటారు. వారికి రెక్కాడితేగాని డొక్కాడదు. ధర్మవిరుద్ధంగా సంపాదించడమనేది చాలవరకు అధికధనవంతులే చేస్తుంటారు. బ్లాక్‌మార్కెట్ వ్యాపారం, దొంగనోట్లు ముద్రించడం యిత్యాదులన్నీ ధర్మవిరుద్ధ సంపాదనలే. ఇవి కూడవు. ఈ అర్థసంపాదనవలన ప్రయోజనం ఏమిటి ? శరీరసుఖము లనుభవించడమేకదా፧ భౌతికవాదుల లక్ష్యం ఏమిటి ? జీవించినంతకాలం శరీరసుఖము అనుభవించడం; తినడం, త్రాగడం, కామోపభోగములలోతేలియాడటం.(అంగనాలింగనాజన్య సుఖమేవ పుమర్థతా) కాంతాలింగన సుఖమే పరమ పురుషార్థమని యెంచడం వారి లక్ష్యం. ఎల్లప్పుడు ఇంద్రియ సుఖములలో మైమరచి

ఉండేవారిని, ప్రాణపోషణ తత్పరులై దుష్కర్మ లాచరించేవారిని అసురులు అంటారు. వీరిని అసురులని, పిశాచులని, దైత్యులని, రాక్షసులని, దుష్టులని, వేదం నిర్వచించింది.

'అసుర్యా నామ తే లోకాః, అంధేన తమసావృతాః'

వీరు అజ్ఞానమనే చీకటిచేత ఆవరింపబడి యుంటారు. తమోగుణమే వీరిలో ఎక్కువగా ఉంటుంది. ఈ మనుష్యదేహం ప్రాకృతికం. అంటే ప్రకృతి సంబంధమైనది. ఇంద్రియములచే తెలియబడే యీ లోక పదార్థములన్నీ ప్రకృతినుండి ఏర్పడినవే. ప్రకృతివికారములు గనుక ఇవి ప్రాకృతికములు. సత్వము, రజస్సు, తమస్సు అను ఈ మూడు ప్రకృతి గుణాలు. ప్రతివస్తువులోను యీ మూడు గుణాలుంటాయి. అలాగే మానవ శరీరంలోకూడ ఉంటాయి. కాని ఈ గుణాలు అందరిలో ఒకే పరిమాణంలో ఉండవు. హెచ్చు తక్కువలుగా ఉంటాయి. కొందరిలో సత్వగుణం ప్రధానంగా ఉండి, రజోగుణము తమోగుణము అప్రధానంగా ఉంటాయి. రజోగుణము ప్రధానంగా ఉన్నవారికి సత్వగుణం, తమోగుణం అప్రధానంగా ఉంటాయి. అలాగే తమోగుణం ప్రధానంగా ఉన్నవారికి మిగిలిన రెండు గుణాలు అల్పంగా ఉంటాయి. బుద్ధితో- జ్ఞానంతో పనిచేసే వారు సత్త్వగుణ ప్రధానులు. 'సత్వం ప్రకాశకం'- లోకంలో ప్రకాశింపజేసేవి-వెలుగునిచ్చే పదార్థములు సత్వగుణ ప్రధానములు. జ్ఞానంకూడ సత్వగుణమువలన కలుగుతుంది. ఎవరిలో ఏవిధమైన ప్రకృతి ఉన్నదో వారావిధమైన పనులు చేస్తుంటారు. ప్రకృతి అంటే యిక్కడ స్వభావమని అర్థం. నా ప్రకృతి ఏమీ బాగుగాలేదయ్యా అంటాము. అంటే నా స్వభావము బాగుగా లేదని అర్థం. 'వాడి ప్రకృతే అంతలే' అంటాము. అంటే వాడి స్వభావమే అంత అని అర్థం.

'కార్యతేహి అవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః'-గీ. ౩-౫.

తమ స్వభావసిద్ధ గుణముల కనుకూలముగ అందరు పనులు తప్ప కుండా చేస్తారు. అనుటలో అభిప్రాయ మిదే. రజోగుణము ప్రధానముగ ఉన్నవారు శారీరక కృత్యాలు ఎక్కువగా చేస్తుంటారు. ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తూనే ఉంటారు. అలా చేయకపోతే వారికేమీ తోచదు. ఒకవేళ వారికి జ్వరం వచ్చి డాక్టరు 'తిరుగవద్దు, విశ్రాంతి తీసుకో'మని అంటే సరేలే అంటారు. డాక్టరు వెళ్లిన తరువాత మళ్ళీ యేదో ఒకపనిని చేస్తూనే ఉంటారు. (సభలో చిరునవ్వులు). కొందరు తమోగుణం ప్రధానంగా కలిగి ఉంటారు. అంటే అజ్ఞానం వారిలో ఎక్కువగా ఉంటుంది. వారికి అలసత (సోమరితనం), నిద్ర, మతిమరుపు, విపరీతజ్ఞానం (ఒకటి చెబితే యింకొ కటి అర్థం చేసుకోవడం) యివి ముఖ్యంగా ఉంటాయి. ఇలాంటి కఠిన విషయాలు చెబుతూవుంటే పాపం వారు నిద్రపోతూ ఉంటారు. (సభలో నవ్వులు). కొందరు నిద్రరాక ఏమీ తోచనప్పుడు ఊరికే ఎందు కుండాలనో యేమో, ప్రక్కింటివారితో తగాయిదా లాడుతుంటారు. (సభలో నవ్వులు).

కావ్యశాస్త్రవినోదేన కాలో గచ్ఛతి ధీమతాం
వ్యసనేన చ మూర్ఖాణాం నిద్రయా కలహేన వా॥

కావ్యశాస్త్ర వినోదాలతో బుద్ధిమంతుల కాలం గడుస్తుంది. మూర్ఖులు వ్యసనాలతో, నిద్రతో, కలహాలతో కాలం గడుపుతారు. * చీట్లాట, జంతువుల వేటాడుట. మద్యమాంసాదులు తినడం త్రాగడం,

---

* కామోత్పన్నములగు దశ వ్యసనములు:

మృగయాక్షో దివాస్వప్నః పరీవాదః స్త్రియోమదః
తౌర్యత్రికం వృథాట్యాచ కామజో దశకోగణః॥ మను.

వేటాడుట, పాచికలాడుట, పగలు నిద్రించుట, కామకథయో లేక యితరు లను నిందించుటయో, స్త్రీలతో అతిసంగమము, మాదకద్రవ్య సేవనము,

వ్యభిచారాది దుర్వృత్తులకు లోనుగావడం, వ్యసనాలు. ఇవన్నీ తమోగుణ లక్షణాలు. ఇలాంటివారు 'అంధేన తమసావృతాః' -అంధ తమస్సులో ఉంటారని వేదం చెబుతుంది. అంధతమస్సంటే కటికచీకటి - అత్యంతం అజ్ఞానంలో ఉంటారని అర్థం. వారికి జీవేశ్వర పదార్థాలు రెండూ తెలియవు. పంచభూతములతో నిర్మింపబడిన ఈ శరీరమే వారికి తెలుసు. 'తాన్ ప్రేత్యాపి గచ్ఛంతి' = వారు చచ్చిన అనంతరము కూడ మరల యిలాంటి అసుర జన్మలనే పొందుతుంటారు. 'యేకే చాత్మహనోజనాః'- వీరే ఆత్మ ఘాతుకులని, ఆత్మహత్య చేసేవారని యీ మంత్రం మనకు నేర్పుతుంది.

శరీరంలో జీవాత్మ అనేది ఒకటున్నదని, దాని సత్తావలన యీ శరీరం పనిచేస్తూ ఉంటుందని నిన్నటి ఉపన్యాసంలో చెప్పాను. నేటి భౌతిక శాస్త్రజ్ఞులు (Materialists) రాసాయనికంగా జీవాత్మను సృష్టి చేయలేకపోతున్నారు. జీవాత్మ భౌతికపదార్థం కాదుగనుక అది సృష్టిచేయబడదు. జీవాత్మలో ఇచ్ఛా, ప్రయత్నం, జ్ఞానం (will, effort, knowledge) యిత్యాది గుణములున్నాయి. పాంచ భౌతిక పదార్థములలో జ్ఞానాది గుణములు లేవు. అవి జడములు. కనుక భౌతిక పదార్థ సమ్మేళనంవల్ల జీవపదార్థాన్ని ఉత్పత్తిచేయడం అనేది పొసగదు. విద్యుచ్ఛక్తిని నీళ్ళనుండి తీయడం కనిపెట్టారు శాస్త్రజ్ఞులు. ఆ విద్యుత్తు నీళ్ళలో ఉన్నది కనుక దాన్ని కనిపెట్టారు. నీళ్ళలో లేకపోతే కనుగొనేదెలా? అందుచేత భౌతికవాదులు రాసాయనికంగా జీవపదార్థాన్ని (జీవాత్మను) ఉత్పత్తిచేసే పర్యంతరం- "జీవాత్మ సృష్టింపబడేదికాదు. అది పాంచ భౌతికము అసలే

---

పాడుట, వాయించుట, నాట్యమాడుట లేక ఆడించుట, మరియు వీనిని వినుట, చూచుట, వృధాగా యిక్కడ నక్కడ తిరుగుట యీ పదియు కామోత్పన్నములగు వ్యసనములు.

కాదు. అది చేతనపదార్థము" - అనే మనవాదనను నిరాఘాటంగా ప్రచారం చేసికోవచ్చు. ఇప్పటివరకు మన యీ వాదనలో లోపం ఏమీ లేదని మాత్రం గట్టిగా చెప్పగలను. ఒకివేళ వారు జీవాత్మను రాసాయనికంగా సిద్ధము చేయగలినట్లయితే, ఆ నాడే మన వైదిక సిద్ధాంతములను విస్మరించుదాము. కానివా రలా చేయలేరనే నా నమ్మకం.

ఇప్పటికి మూడు మంత్రాలు చెప్పుకున్నాము. మొదటి మంత్రంలో సృష్టి స్థితి లయకారుడైన పరమేశ్వరుని గురించి కొలదిగా తెలుసుకున్నాము. ఇపుడు మనం ముందు చెప్పుకోబోయే మంత్రాలలో భగవంతుని గూర్చి విశేషంగా తెలుసుకుంటాము.

అనేజ దేకం మనసో జవీయో
నైనద్దేవా ఆప్నువన్ పూర్వ మర్షత్
త ద్ధావతోఽన్యా నత్యేతి తిష్ఠత్
తస్మి న్నపో మాతరిశ్వా దధాతి॥ ४

భావార్థము :- పరమాత్మ అనంతుడగుటచే, మనసెక్కడికిపోయినను నక్కడ పరమాత్మ ముందే యుండును. ఆ పరమాత్మజ్ఞానము శుద్ధమనస్కునకే కలుగును. నేత్రాది ఇంద్రియములకు పరమాత్మ గోచరింపదు. అవిద్వాంసులకు నందదు. స్వయము కదలక ప్రపంచమును నియమబద్ధముగా చలింపజేయును. అన్నింటికి నాధారము. ధార్మికుడైనవాడు కర్తవ్యముల నాచరించుచు ఫలములను పరమాత్మున కర్పించి కర్మయోగియై పరబ్రహ్మను బొందగల్గును.

ఏజత్-అంటే కంపించేది. అనేజత్-అంటే కంపించనిది లేక కదలనిది అని అర్థం. అంతటా వ్యాపించియున్న తత్త్వం కదలదు. పరి

మితమైన వస్తువే కదులుతుంది. కదలడం అంటే ఏమిటి? ఒకచోటఉన్న వస్తువు యింకొకచోటికి చేరడం. దీన్నే ఇంగ్లీషులో Motion (మోషన్) అంటారు. 'మోషన్' అంటే సంస్కృతంలో 'గతి' అని అర్థం. (చేతనొక పుస్తకం తీసికొని) నా చేతిలో యిపుడొక పుస్తకం ఉంది. ఇది పరిమిత వస్తువు. దీన్ని ఒకచోటనుండి యింకొకచోటికి చేర్చవచ్చు. కాని పుస్తకం దానంతట అది కదలదు. కదిలించే వ్యక్తి ఒకరుండాలి. ఒక (Philosopher) తాత్త్వికుడు "వస్తువున్నచోట కదలిక అనేది ఉండదు. వస్తువులేనిచోట వస్తువేలేదు. కాబట్టి కదలడమనేది లేదు. కనుక (there in no motion at all) అసలు కదలిక అనేది లేదు" అన్నాడు. ఇది అతని ఆలోచనాఫలం. లోకంలో కదలికే లేదనుట సరియగునా? (సభలో చిరునవ్వులు). మరియొక తత్వవేత్త ఈ వాదాన్ని ఖండిస్తూ, "అసలు కదలుట అంటే వస్తువు ఒకచోటినుండి యింకొక చోటికి పోవడం. అంతే కాని ఉన్నచోట కదలకపోవడం లేనిచోట కదలడం కాదు" అన్నాడు. కాబట్టి కదలిక అనేది ఉంది అన్నాడు. ఇలా ఉంటుంది (logic) తర్కము.

పరమేశ్వరుడు కదలడు. అత డంతట ఉండును. ఆయన సర్వవ్యాపకుడు, సృష్టికర్త. కర్త ఎక్కడుంటాడో అక్కడ కార్యం ఉంటుంది. కుమ్మరి ఉన్నచోట కుండ చేయబడుతుంది. కుమ్మరి ఒకచోట వుంటే కుండ వేరొకచోట చేయబడదు. అలాగే వస్త్రం నేసే సాలి ఎక్కడున్నాడో అక్కడే వస్త్రం నేయబడుతుంది. సాలి ఒకచోట ఉంటే వస్త్రం యింకొక చోట నేయబడదు. అలాగే విశాలమైన ఈ విశ్వంలో అణువుల నుండి బ్రహ్మాండము వఱకు సృష్టి సాగిపోతూనే ఉన్నది. కనుక పరమేశ్వరుడు అణువునుండి బ్రహ్మాండముపర్యంతము, యింకా దానిని మించి కూడ ఆయన వ్యాపించియే ఉన్నాడు. ఎక్కడెక్కడ సృష్టి కార్యము కొనసాగుతున్నదో అక్కడక్కడ ఆయన వ్యాపించియే

ఉన్నాడు. ఆయన అంతటా ఉన్నాడు కనుక 'అనేజత్' - కంపించడు. అనేజత్ అంటే భయపడడు. అనికూడ అర్థం ఉంది. కంపనం భయ లక్షణం. భయపడినవానిని చూడండి. అతడు కంపించుతాడు-వణుకుతాడు. అలా పరమేశ్వరుడు భయపడడు-కంపించడు. ఆయన 'ఏకం' - ఒకటే వస్తువు. ఇవ్వాళ మనం సర్వవ్యాపకుడయిన ఈ అసలు దేవుణ్ణి మరచాం. మనకు ఊరినిండా దేవుళ్లే. అంకమ్మ, పోలేరమ్మ, పోతురాజు, పుట్టలమ్మ, తట్టలమ్మ యిలా అనేకమంది వెలిశారు. వీటిని ఆధారం చేసుకొని పాశ్చాత్యవిద్వాంసుడైన మోక్షముల్లరు వేదాలలో అనేకమంది దేవత లున్నారు. భారతీయులకు ఏకేశ్వరవాదం తెలియదని ప్రచారంచేశాడు. కొందరు భారతీయులుకూడ దీనిని సమర్థిస్తూ గ్రంథాలు వ్రాశారు. అప్పుడు దయానందుడు మోక్షముల్లర్‌తో (Correspondence) ఉత్తర ప్రత్యుత్తరములు జరిపాడు. మోక్షముల్లరు వ్రాసిన వేదభాష్యములోని తప్పులను ఎత్తిచూపుచు వేదంలో ఏకేశ్వరవాదమే ఉన్నది, అనేక దేవతలు లేరని చెప్పి దీనికి ప్రమాణంగా "ఏకంసద్ విప్రా బహుధావద న్త్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః"*—అనే ఋగ్వేదమంత్రాన్ని చూపుచూ ఆయనకు

* ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహు రథో దివ్య స్స సుపర్ణో గురుత్మాన్ ।
ఏకంసద్ విప్రా బహుధా వద న్త్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః ॥
ఋ. మం. ౧ అను. ౨౨ సూ. ౧౬౪ మం. ४౬

పరమేశ్వరుడు ఒక్కడే అయ్యు, విజ్ఞులచేత ఆయన ఇంద్రుడు, మిత్రుడు, వరుణుడు, అగ్ని, దివ్యుడు, సుపర్ణుడు, గరుత్మంతుడు, యముడు, మాతరిశ్వుడు యిత్యాది పేర్లతో చెప్పబడుచున్నాడు; అని మంత్రార్థం. ఈ పేరులకున్న అర్థము శ్రీ దయానందుని 'సత్యార్థప్రకాశ' మను గ్రంథములో మొదటి సముల్లాసమున చూడనగును.

ఉత్తరాలు వ్రాశాడు. మే మనే దేవతలు వేరు అన్నాడు దయానందుడు. తరువాత మాక్సుముల్లరు తన అభిప్రాయాన్ని మార్చుకుంటాడు కూడ.

నేటి భారతీయులు వేదార్థాలు విస్మరించి అనేకదేవుళ్ళను కల్పించుకున్నారు. ఈ దేవుళ్ళు పరస్పరం తగవులాడుకుంటారుకూడ. మన పురాణాల్లో యిది చూడగలం. విష్ణువు అంటే శివభక్తులకు గిట్టదు. శివుడంటే విష్ణుభక్తులకు గిట్టదు. అందుచేత ఒకరిని దూషించుతూ యింకొకరు కథలు వ్రాసుకున్నారు పురాణాల్లో. విష్ణువుచేత వ్యభిచారం చేయించారు. శివుణ్ణి తెలివితక్కువవాణ్ణి చేశారు ఈ కథల్లో. భస్మాసుర కథ మీకు తెలిసే ఉంటుంది. భస్మాసురుడు శివుణ్ణిగూర్చి ఘోరమైన తపస్సుచేస్తాడు. శివుడు మెచ్చి నీకేం వరం కావాలో కోరుకో అంటాడు. మరి శివునికి ఈ రాక్షసుని హృదయంలో ఉండే కోరిక ఏమిటో తెలియదు కాబోలు! 'నేను ఎవరినెత్తిపై చేయిపెడితే వాడు భస్మం కావాలి' అని వాడు కోరతాడు. వెనుక ముందులేమీ ఆలోచించకుండ పాపం శివుడు సరే యని వరమిస్తాడు. అలాగైతే నీ విచ్చిన వరం పనిచేస్తుందో లేదో తెలుసుకుంటాను, కొంచెం సేపు ఆగు అని, అటు ఇటు చూచి ఇతరు లెవ్వరు లేనందున శివుని నెత్తిపైనే చేయిపెట్టి చూడదలంచి వెంటపడతాడు. 'సంహారకర్త' అని చెప్పబడే శివుడు పాపం పలాయనం చిత్తగిస్తాడు రొప్పుతూ రోజుతూ. రాక్షసుడూ ఆయన్ని వదలలేదు. వెంటబడతాడు. శివుడిలా ప్రాణాపాయ స్థితిలో ఉన్నట్లు తెలిసి ఆయన్ని రక్షించడానికి విష్ణువు 'మోహిని' రూపంలో వచ్చి రాక్షసుడికి కనబడతాడు. రాక్షసుడు మోహిని రూపలావణ్యాలకు ముగ్ధుడై ఈశ్వరుణ్ణి వదలిపెట్టి మోహినిమాయలో పడతాడు. విష్ణువు మోసంచేత రాక్షసుడు చస్తాడు. తరువాత శివుడుకూడ ఈ మోహిని రూపానికి పరవశుడై మోహంలో పడతాడు. సరే రాక్షసుడు మోహంలో పడ్డాడంటే అర్థముంది. కాని భగవంతు డనుకొనే శివుడుకూడ ఈ మోహంలో

పడతాడు. (సభలో నవ్వులు). ఎంత చిత్రమో చూడండి. 'విష్ణువు నన్ను రక్షించడానికి మోహినిరూపంలో వచ్చాడు' అని శివుని కామాత్రం బుద్ధి ఉండవద్దూ! భస్మాసురుడు వెంటబడితే శివుడు పారిపోతాడు. మరి ఆయన మూడవనేత్రం ఏమైందో! ఆ మూడవ నేత్రం తెఱచి చూచిన వాడు చచ్చి ఉండేవాడుకదా! ఇక మనం భగవంతుడనుకొనే విష్ణువుకు పట్టినగతి చూడండి. చేతనైతే తాను ముఖాముఖి తలపడి యుద్ధంచేసి భస్మాసురుణ్ణి చంపాలి. అలా చేయడు. ఆడవేషం వేసుకొని వస్తాడు! (సభలో నవ్వులు). మాయచేసి వాణ్ణి చంపుతాడు.

వృంద కథ మీకు తెలిసే ఉంటుంది. 'తులసి' సినిమా మీరు చూచే ఉంటారు. ఒకమారు శివునికి జలంధరునితో యుద్ధం జరుగుతుంది. ఆ యుద్ధంలో జలంధరునిధాటి కొగలేక శివుడు ఓడిపోయే పరిస్థితులేర్పడతాయి. అపుడు దేవతలంతా ఒకచోట చేరి, అరే! శివుడంతటి బలవంతుడు ఈ రాక్షసునిచేతిలో ఓడిపోయేలాగున్నాడు. జలంధరుని కింతటి బలమెక్కడినుండి వచ్చింది అని ఆలోచించి, 'జలంధరుని భార్య వృంద. ఆమె పాతివ్రత్య మహిమచేత జలంధరుని కింతటి శక్తి వచ్చింది.' అని నిర్ణయించుకుంటారు. ఆమె పాతివ్రత్యాన్ని భంగంచేస్తేకాని, యీ రాక్షసుని శక్తి తగ్గిపోదు అని ఆలోచించి, ఇంద్రాది దేవతలంతా విష్ణువు దగ్గరకు వెళ్ళి, మహాప్రభో! శివుడు వృంద పాతివ్రత్య ప్రభావంచేత జలంధరుని చేతిలో ఓడిపోయేటట్లున్నాడు. మీరెలాగైనా సరే ఆమె పాతివ్రత్యాన్ని భంగంచేసి పుణ్యంకట్టుకొని శివుని రక్షించాలిసిందేనని కాళ్ళా వ్రేళ్ళా పడతారు. సరే! అని విష్ణువు ఒప్పుకుంటాడు. పాపం! వృంద విష్ణుభక్తురాలు. ఆమె తన భక్తురాలని విష్ణువుకు తెలుసు. అయినా ఆమె పాతివ్రత్యాన్ని చెడగొట్టాలని విష్ణువు వెళతాడు. జలంధరునిరూపం తాను ధరించి, వృందను నమ్మించి ఆమెను చెరుస్తాడు. తరువాత జలంధరుడు

యుద్ధంలో చనిపోతాడు. విష్ణువుచేసిన యీ కిరాతకం చివరకు వృంద తెలుసుకుంటుంది. తెలుసుకొని విష్ణువుతో, 'నేను నీ భక్తురాల్ని, నన్నే ఈ విధంగా మోసం చేశావు. ఓరి పాపాత్ముడా! నీది హృదయంకాదు. పాషాణం; నీవు పాషాణమైపో' అని శాపం పెడుతుంది. అందుకని యిపుడు పాపం విష్ణువు సాలిగ్రామమై గండకీ నదిలో పడివున్నాడు. తాను సాలిగ్రామమైంది చాలక, వృందమీద వ్యామోహం వదల్లేదో ఏమోమరి, విష్ణువు వృందను శాంతపరచి, భూమిమీద తులసి చెట్టువై పుట్టుమని వృందకు మళ్ళీ జన్మ కల్పిస్తాడు. చూడండి ఎంతటి అన్యాయమో !

ఇలాంటి కథలను పౌరాణికులు మన ఆడవాళ్ళకు వినిపిస్తుంటారు. గుళ్ళల్లో, గోపురాల్లోను. పాతివ్రత్యాన్ని చెడగొట్టడం మహిమా ? చేతనైతే తానే జలంధరునితో పోరాడరాదూ ! ఇలాంటి విష్ణువు అసలు దేవుడెలా అవుతాడు ? చెప్పేవారికి బుద్ధిలేకపోతే వినేవారికైనా బుద్ధివుండాలి. వృంద పాతివ్రత్య ప్రభావంవల్లనే జలంధరునికి యింతటి శక్తి వచ్చిందని గదా దేవతలు చెప్పిరి. శివునికి ఇద్దరు భార్యలున్నారు కదా గంగా, గౌరి అని. వారూ పతివ్రతలే. మరి జలంధరునికి ఒక భార్యవల్లనే అంతటి శక్తి వస్తే, యిద్దరు భార్యలున్న శివునికి రెట్టింపుశక్తి రావద్దూ? (సభలో నవ్వులు). అలాకాక, జలంధరుని శక్తి పెరిగి శివుని శక్తి క్షీణించుతుంది. ఇదెక్కడి న్యాయం ? త్రిమూర్తులలో శివ, విష్ణువుల గతి యిలా వుంది. ఇకపోతే బ్రహ్మ వట్టి అబద్ధాలకోరు అయినాడు. కనుక అతనికి గుళ్ళూ లేవు పూజలూలేవు పొమ్మన్నారు. (ఈ కథలు వింటున్నంతసేపు సభికులు ఉత్సాహ, ఉద్వేగ, ఆనందాలతో ఊగిపోయారు).

ఇలాంటి కథలు మన పురాణ వాఙ్మయంలో వ్రాయబడి ఉన్నాయి. పైగా వీటిని సినిమాతీసి జనులకు చూపించుచున్నారు. క్రైస్తవులు, యితర మతస్థులు యివి చూచి, పురాణాలు చదివి, మీదేవుళ్ళు చూశారా

ఎలాంటివారో అని మనల్ని అడుగుతున్నారు. వారికి చెప్పగలిగే సమాధానం ఏమిటి ? అందుకనే హేతుబద్ధంకాని వాఙ్మయం, యిలాంటి పుక్కిటి పురాణాలు పోవాలి. అవి మనదేశంనుండి ఎంత త్వరగా పోతే అంత మంచిది. హేతుబద్ధమైన, అభేద్యమైన వేదవాఙ్మయ పునాదులపై మన మతాన్ని పునర్నిర్మించాలి. అప్పుడే దేశం బాగుపడుతుంది,

ఒకప్పుడు భారతదేశం అన్నిదేశాలవారికి విద్య నేర్పింది. (కంఠస్వరం పెంచుతూ)

ఏతద్దేశ ప్రసూతస్య సకాశా దగ్రజన్మనః
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః॥

మను. ౨-౨౦

'భూమండలంలోని ఓ మానవులార! ఈ భారతదేశంలో పుట్టిన బ్రాహ్మణులనుండి మీకు కావలసిన విద్యలలో శిక్షణ పొందండి!' అని మహర్షులు ఎలుగెత్తి చాటారు. అలాంటిదిపోయి, మనదేశాని కిపుడు పట్టిన గతి చూడండి!

పరమేశ్వరుడు అనే పదం పురుషవాచకంగా ఉంది. ఆయన మగవాడా అని కొందరికి సందేహం కలుగవచ్చు. ఆయన మగవాడుకాదు, ఆడదికాదు, నపుంసకు డసలే కాదు. అదొక తత్త్వం. కాని, స్త్రీలింగ, పుంలింగ, నపుంసకలింగ పదములతోకూడ ఆ తత్త్వం చెప్పబడుతుంది. లక్ష్మి, సరస్వతి, శక్తి యివన్నీ భగవత్తత్త్వమునకు పేర్లే. మనవాళ్ళు పురాణాలలో సరస్వతిని నెమలివాహనం ఎక్కించారు. లక్ష్మిని గజలక్ష్మిని చేశారు. కాళికి పెద్దనాలుక పెట్టి భయంకరంగా చేశారు. (సభలో నవ్వులు). అలాగే శివుణ్ణి ఎద్దునెక్కించారు. విష్ణువును గద్దనెక్కించారు. బ్రహ్మను హంస నెక్కించారు. ఇలా వీరికి దూరప్రయాణాలు చేయడానికి పాపం

వాహనాలు కూడ సిద్ధంచేశారు. వేదంలో యివి లేవు. తరువాత: బ్రహ్మ, తత్, సత్ యిలాంటి పదాలు నపుంసకవాచకములు. ఇవికూడ పరమేశ్వరుని పేర్లే. ఆయన అనంత కల్యాణ గుణ విశిష్టుడు గనుక, ఆయనచేసే కార్యములనుబట్టి యిలా అనేకపేర్లతో వేదాల్లో వ్యవహరింపబడినాడు.

'అనేజత్' అంటే కంపంలేనివాడని అర్థం. కంపం భయలక్షణం. భయం ఎప్పుడు కలుగుతుంది? యిద్దరున్నప్పుడు. 'ద్వితీయాద్వై భయం భవతి.'=తనకు మించిన బలవంతుడుగాని, తనకు దీటైనవాడుగాని ఉంటే రెండవవానికి భయం కలుగుతుంది. కాని పరమేశ్వరుని స్థితి అలాకాదుగా। 'న తత్ సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే'-అంటే పరమేశ్వరునికి సమానుడుగాని అధికుడుగాని లేడని అర్థం. 'అర్జునుడు అద్వితీయధనుర్ధారి' అన్నపుడు, దేశంలో యిక ధనుర్ధారులే లేరని అర్థంకాదు. అర్జునునికంటెమించినవారుకాని, అర్జునునితో తుల్యులుగాని లేరని అర్థం. అట్లే బ్రహ్మముకూడ 'ఏకమేవా ద్వితీయమ్' అనబడినది.

'మనసో జవీయః'- అతడు మనస్సుకంటె వేగవంతుడు. అసలు మనోవేగమే అన్నిటికంటె పెద్దది. మనస్సు రాకెట్టుకంటె వేగవంతమైంది. చంద్రుడు అనగానే క్షణంలో మనస్సు ఆలోకం వెళ్ళివస్తుంది. మరిమనస్సు కంటె పరమేశ్వరుడు వేగవంతుడనటంలో అర్థమేమిటి? అంటే పరమేశ్వరుడు అంతటా ఉన్నాడు కనుక, మనస్సు ఎక్కడికి వెళ్ళితే అక్కడ ముందే తాను ఉంటాడు. కాబట్టి, మనస్సుకంటె పరమాత్మ తత్త్వం వేగవంతమైంది అని చెప్పబడిం దీ మంత్రంలో.

'నైన ద్దేవాః ఆప్నువన్'-అతనిని నేత్రాది యింద్రియములుపొందనేరవు. దేవతలు అంటే యిక్కడ యింద్రియము లని అర్థం. కన్ను, ముక్కు, నాలుక, చెవి, చర్మము యివి యింద్రియములు. ఇవి దేవత లనబడతాయి, దేవతల కధిపతి ఇంద్రుడు. ఇంద్రుడంటే జీవుడని అర్థం.

'ఇంద్రస్య సాధన మింద్రియం' (ఇది ఐశ్వర్యే-ధాతువుతో ఇంద్ర శబ్ద మేర్పడుతుంది) ఇంద్రునికి (జీవునికి) సాధనములు కనుక వీటికి ఇంద్రియములని పేరు వచ్చింది.

ఒకమారు నేను తిరుపతి వేంకటేశ్వరస్వామి ఆలయానికి వెళ్ళాను. మా మిత్రు లొకరు అపుడు దేవాదాయ మంత్రిగా ఉంటుండేవారు. ఆయన అచటికి వెళదాము రమ్మంటే వెళ్ళాను. మంత్రిగారివెంట వెళ్ళాను గనుక మాకు (Special) ప్రత్యేక దర్శనం దొరికింది. క్యూలో నిలబడిన వేలాది యాత్రికుల్ని ఆపివేసి ఆలయాధికారులు మాకు Special దర్శనము ఏర్పాటుచేశారు. నిజానికి భక్తులెవరు ? క్యూలో నిలబడిన జనం. వారు గంటల తరబడి నిలువబడి ఎంతో ప్రయాసపడుతున్నారు కూడా. వాళ్లకు ముందు దర్శనం యిచ్చి, తరువాత మాకు దర్శనం కలిగించాలిసింది. అది న్యాయం. కాని మంత్రిగారాయె. మరి ఆయన మెప్పు పొందవద్దూ! పైగా ఆయన దేవాదాయపు మంత్రిగారు కూడ. అంచేత మాకు ఆలయాధికారులు Special దర్శనం ఏర్పాటుచేశారు. (సభలో నవ్వులు). సరే, మేం గర్భగుడి దగ్గర ప్రవేశించాం. మంత్రిగారు, నేను కాక మా వెంట బ్రాహ్మణ పండితు లొకరు కూడ ఉన్నారు. ఆయన ఉపనిషత్తులు, దర్శనాలు, సంస్కృత సాహిత్యం చదివిన పండితులు. మంత్రిగారు, పండితులు వేంకటేశ్వరుని విగ్రహానికి నమస్కారం చేస్తున్నారు. నేను యీతతంగం అంతా చూస్తూ నిలబడ్డాను. ఆ బ్రాహ్మణ పండితుడు నాతో, గోపదేవ్ గారూ! చూశారా, స్వామి ఎంతటి దేదీప్యమానంగా దర్శనం యిస్తున్నాడో, ఆహా! -ఆహాహా !- అని తన్మయం చెందుతూ, విగ్రహానికి నమస్కరించుతున్నాడు. నేను, అదేమిటండీ, నల్లగా రాయి కనబడుతుంటే, దేదీప్యమానంగా దేవుడు దర్శనమిస్తున్నా డంటారు. ఏ మైనాదీనిలో అర్థముందా అన్నాను. 'అమ్మో! అపచారం. అపచారం స్వామి సన్నిధిలో యీ

మాటలటండీ'. అని పండితుడు చెంపలు వేసుకున్నాడు. అదేమిటండీ తమరు తెలిసినవారు, గొప్పపండితులు! మీరు కూడ యిలా అజ్ఞానులవలె వింతగా మాట్లాడుతున్నారు. అసలు భగవంతుడు యింద్రియములకు గోచరించడు, 'నైన ద్దేవా అప్నువన్' అని వేదవాక్యము కదా! దీని అర్థమేమిటి స్వామి! కండ్లతో విగ్రహాన్ని చూస్తూ, తమరు భగవంతుడు దర్శనమిస్తున్నా డంటారు, యిదేం న్యాయం చెప్పండి అన్నాను. పాపం! పండితుడు మళ్లీ మళ్లీ చెంపలు వేసుకుంటూ, గోపదేవ్‌గారూ! ఈ కాసేపు ఆగండి. ఆ విషయాలు మనం తరువాత మాట్లాడుకుందాం. స్వామి సన్నిధిలో యీ విషయాలు మాట్లాడుతున్నందుకు నాకు పాపం చుట్టుకుంటుంది. దయచేసి నన్ను వదలిపెట్టండి అని, పాపం పండితుడు బాధపడినాడు. నాకు నవ్వు వచ్చింది (సభలో నవ్వులు). ఈ విధంగా పండితులు చదువుకున్నవారు కూడ ఎలా ఉన్నారో చూడండి. సామాన్యులు విగ్రహాది జడ పూజలు చేస్తున్నారంటే ఉపేక్షింపవచ్చు. పాపం వారికి తెలియదు. అంతా తెలిసినవాళ్లు, బాగా చదువుకున్నవాళ్లు కూడ ఎందుకిలా విగ్రహాది జడ పూజలు చేస్తారో నా కర్థంకాదు. మీరు తిరుపతి వెళతారు. మీకా విగ్రహంలో ఏం కనబడుతుంది? మీరు సామాన్యంగా గుళ్లల్లో చూచే విగ్రహాల కంటె అది కొంచెం ఎత్తుగా ఉంటుంది. దానిపై ఎన్నో ఆభరణాలు కనబడతాయి. వజ్రాలు, వైడూర్యాలు, ధగధగ మెరిసే రాళ్లు పొదిగిన బంగారు కిరీటం- యిలాంటివి కనబడతాయి. ఇవి మీరు ఏగుళ్లోను చూచి ఉండరు గనుక అచటికి వెళ్లి, వీటిని ఒక్కసారి చూచేసరికి మీకు ఆశ్చర్యం కలుగుతుంది. తన్మయులౌతారు. నిజంగా విగ్రహమే దేవుడయినట్లయితే ఏ గుడికి వెళ్లినా ఏ విగ్రహం ముందు నిలువబడినా మీకు ఆలాంటి తన్మయత్వమే కలగాలి. కాని కలుగదు. అలంకరణ, సొమ్ములు యివి లేని వట్టి విగ్రహం ముందు నిలబడితే మీ రాకర్షింపబడరు. ఇక్కడ, మీరు వెళ్లే గుళ్లలో విగ్రహాలకు అలాంటి అలంకరణ చూడరు. అక్కడ వేంకటేశ్వరుని విగ్రహానికి నగ, నట్రా పెట్టి అలం

కారాలు ఎక్కువ చేస్తారు కాబట్టి మిమ్మల నా విగ్రహం తతిమ్మా వాటి కంటె బాగా ఆకర్షిస్తుంది. అందుచేత మిమ్మల నాకర్షించేది విగ్రహము పై నున్న సొమ్ములు, వజ్రాలు, బంగారం యివేకాని దేవుడు కాదు. మనం సామాన్యంగా యిళ్ళల్లో కాసో, అరకాసో బంగారం చూచి ఉంటాం. అక్కడకు వెళ్ళి వేంకటేశ్వరుని విగ్రహం మీద లక్షలాది ఖరీదుగల బంగారం, వజ్రాలు ఒక్కసారి చూసేసరికి అబ్బో! అని ఆశ్చర్యపడతాం (సభలో నవ్వులు). ఇదే అక్కడుండే విశేషం. అంతకంటె మరేంలేదు.

రంగులు కంటికి కనబడతాయి. అలాగే దృశ్య వస్తువులన్నీ కంటికి కనబడతాయి. కొందరు నాకు రాత్రి దేవుడు కలలోకి వచ్చాడు, ఆయన యిలా ఉన్నాడు. అలా ఉన్నాడు అని వర్ణిస్తారు కూడా. కలలో వచ్చిన రూపాలు అవి నిజ మెలా అవుతాయి? పగలంతా పటములను ముందు పెట్టుకొనో, లేక విగ్రహాల ముందు కూర్చుండి వాటిని చూస్తారు గనుకనో అవే రాత్రి కలల్లో కనబడుతుంటాయి. దేవుడలా కనబడతాడా?

సర్వే వేదా యత్పద మామనంతి
తపాంసి సర్వాణి చ యద్వదంతి
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణ బ్రవీ మ్యోమిత్యేతత్ ॥

కఠ. ౨-౧౫

ఋగాది వేదాలు ఎవరిని గురించి చెబుతున్నాయో, ఎవరిని కోరి మహర్షులు జీవితాంతం యింద్రియ నిగ్రహాది తపస్సులను, బ్రహ్మచర్యాది వ్రతములను పాలించుచున్నారో అటువంటి పరమేశ్వరుడు వీళ్ళకు కలల్లో కనబడటమా? పాపం కొందరది నిజమేనని నమ్మి అలా చెప్పిన వ్యక్తికి పూజలు పురస్కారములు కూడ చేస్తుంటారు. కల అంటే ఏమిటి? 'స్మృతి రేషా స్వప్నదర్శనం' – అంటాడు శంకరుడు. స్వప్నం అంటే

స్మృతి అన్నమాట. పూర్వం తాను చూచిన దృశ్యాలు, అనుభవించిన విషయాలు, సంస్కార రూపంగా అంతఃకరణములో ఉంటాయి. ఆ సంస్కారములే కలల్లో ఉద్బుద్ధమౌతాయి. ఉద్బుద్ధం కావడమంటే ప్రకటం కావడం లేక వ్యక్తమవడం. కనుక కల స్మృతి మాత్రమే నని గ్రహించాలి.

ఇంద్రియాలకు గోచరించే సమస్త పదార్థాలు, రూపాలు యివన్నీ ప్రకృతిసంబంధమయినవే. ఇంద్రియములు ప్రాకృతికములే గనుక ప్రాకృతిక పదార్థాలనే గ్రహించ గలవు.

ఇక్కడ యింక కొంచెం మీకు వివరించాలి. మనకు కనబడే నల్ల తెల్ల గ్రుడ్లు ఇంద్రియం కాదు. అది నేత్ర గోళం. నేత్రేంద్రియము యీ గోళములో ఎక్కడో సూక్ష్మంగా ఉంటుంది. అది ఉంటేగాని వస్తువులను మనం చూడలేము. కొందరికి నేత్రగోళములు బాగానే ఉంటాయి. కాని వస్తువు కనబడదు. కారణం? వారి నేత్రములో నేత్రేంద్రియం లోపించిందన్నమాట. అలాగే కొందరికి పెద్దపెద్ద చెవులుంటాయి. కాని వినబడదు. కారణం. శ్రోత్రేంద్రియం ఆ చెవిలో లోపించిందన్నమాట. కొందరు నశ్యం పీలుస్తారు. వారు ప్రతిరోజు రెండు వ్రేళ్ళతో యింతింత పొడుం తీసుకొని డబ్బాలకు డబ్బాలు (చిన్న చిన్న పొడుంకాయలు) ముక్కుల నిండ ఎక్కిస్తారు. కొన్నాళ్ళకు ముక్కులు లొట్టలు పడి బుర్రలవుతాయి. వారి మాట కూడ అదోలా ఉంటుంది. పండితులు కూడ యీ పొడుం ఎంతో ప్రీతితో సేవించుతుంటారు. (సభలో నవ్వులు). వారలా కొన్నాళ్ళు బాగా పీల్చేసరికి, చివరకు ముక్కులో ఉండి గంధం గ్రహించే యింద్రియం చెడిపోతుంది. అపుడు వారి కే దిబ్బ వాసన చూడుమన్నా బాగానే ఉందంటారు. (సభలో నవ్వులు). తరువాత రసనేంద్రియం: ఇది నాలుకలో ఎక్కడో ఉంటుంది. పదార్థమేదైనా నాలుకపై వేసుకుంటే మీకు వెంటనే రుచి తెలియదు. నాలుకను అంగిలితో చప్పరించితేగాని

మీకు రుచి తెలియదు. అంటే రసనేంద్రియం నాలుకలో ఎక్కడో సూక్ష్మంగా ఉండటంచేత చప్పరించినపుడుగాని ఆ పదార్థముయొక్క రుచి తెలియదు. తరువాత చర్మం; దీనిలో స్పర్శేంద్రియం ఉండటంచేత పదార్థములు చర్మమునకు తగిలినపుడు, అవి వేడిగా ఉన్నది చల్లగా ఉన్నది కనుక్కుంటుంది. గాలిని మనం కంటితో చూడం. కాని స్పర్శజ్ఞానంచేత ఆ గాలి వేడిగావుందో చల్లగా వుందో గ్రహించగలం. కొందరి శరీరం చర్మవ్యాధులకు లోనై స్పర్శేంద్రియం చెడిపోతుంది. మసిలిపోయే నీళ్ళు పోసుకున్నా వారికేమీ బాధ అనిపించదు.

ఇప్పుడు ఇంద్రియాలంటే ఏమిటో వాటికుండే గ్రహణశక్తి ఏమిటో తెలిసికొన్నాము. ఇలా ఇంద్రియములు సూక్ష్మములై అతీంద్రియము లగుచున్నవి. ఇంద్రియములే యింద్రియ గోచరములు కానపుడు భగవంతుడు యింద్రియగోచరు డెలా అవుతాడు? కనుక నేను దేవుణ్ణి కళ్ళారా చూచాను అని అనడం వేద విరుద్ధం. కొందరు దేవుడు అవతారాలెత్తుతుంటాడని అంటారు- భక్తులకోసం. భక్తుడు కోరితే దేవుడు ఏ రూపమైనా ఎత్తుతాడట. గాడిద కావాలంటే భగవంతుడు గాడిద అవుతాడట! (సభలో నవ్వులు). ఎట్లా అనుకుంటే అట్లా భగవంతుడు వేషాలు వేస్తాడట. మరి భగవంతుడు వీధుల్లో తిరిగే పగటివేషగాడు కాబోలు! వేషాలు మార్చడానికి. భగవంతు డిలా వేషాలు ఎప్పుడూ వేయడు. ఆయనకు వేరే పనేమీ లేదా? వేషాలు వేసుకోవడమే పనా? ఆయన ఏకరసుడు, సర్వవ్యాపి, సృష్టికర్త, సర్వజగన్నియామకుడు, అచలుడు, అనంతుడు. ఇంద్రియములకు గోచరముకాని పరమసూక్ష్మతత్వ మది. ఈ విషయాలు మనం బాగా గుర్తుపెట్టుకోవాలి.

'తద్ధావతో ఽన్యా నత్యేతి తిష్ఠత్'- ఆ పరమాత్మ తాను కదలక ఎక్కడికి వెళ్ళి విచారించినా అక్కడుంటాడు. అంటే మనస్సు, వాక్కు, యింద్రియములను అతిక్రమించి సర్వత్ర ఆయన వ్యాపించి ఉంటాడు,

సర్వత్ర వ్యాపించినవాడు కదలడు. కదలిక అనేది పరిమిత వస్తువుకే ఉంటుందని చెప్పుకున్నాము. కనుక పరమేశ్వరుడు తాను స్వయముగా కదలక ప్రపంచమును నియమబద్ధంగా చలింపచేస్తాడు. అన్నిటికి ఆయన ఆధారం.

'తస్మి న్నపో మాతరిశ్వా దధాతి'- మాతరిశ్వా అంటే జీవుడు. తస్మిన్-ఆ పరమాత్మయందు, అపః-కర్మలు, దధాతి-ఉంచును. జీవుడు కర్మలను పరమేశ్వరుని యందుంచును. అనగా జీవుడు ఫలాపేక్ష లేకుండ కర్మలు చేస్తాడని అర్థం. ఫలాపేక్షారహిత కర్మ ముక్తికి మార్గము. కర్మ ఫలాలను భగవదర్పణంగా చేయుటవలన జీవుడు ముక్తుడౌతాడు. ఇప్పటికే 7-30 గంట లయింది. బస్. మిగిలింది రేపు.

---

గుంటూరు, 28-12-1968
శనివారం, సా॥ గం. 6-00

మహాజనులారా!

ఇంతవరకు అసురులు అజ్ఞానముతోకూడి ఆత్మకు విరుద్ధముగ నడచుచు ఆత్మఘాతకు లవుతారని, అలాకాక ఎవరు మనోవాక్కాయ కర్మలలో ఒకటిగా ఉంటారో వారు దేవతలనబడతారని చెప్పుకున్నాము. ఈశ్వరస్వరూపాన్ని గురించికూడ కొంత తెలుసుకున్నాము. పరమాత్మ కదలడని, అంతటా వ్యాపించి ఉంటాడని, ఆయన ఒక్కడేనని, మనస్సు కంటే వేగవంతుడని, నేత్రాది యింద్రియములు ఆయనను చూడలేవని, ఆ పరమాత్మ తాను చలింపక ప్రపంచమును నియమబద్ధంగ చలింపజేస్తాడని, జీవుడు శరీరములో నుండి కర్మలాచరించుతాడని, ఆ కర్మలు ఫలం ఆశించకుండ చేయడం ముక్తికి మార్గమని తెలుసుకున్నాము. నేడు అయిదవ మంత్రము చెప్పుకుందాము.

తదేజతి తన్నైజతి తద్దూరే తద్వంతికే
తదంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య
బాహ్యతః॥ 5

భావార్థము;-ఆ బ్రహ్మము మూఢదృష్టులకు కంపించు (చలించు) నట్లుండును. వాస్తవమున నయ్యది వ్యాపకమగుటచేత కంపించదు. పరమేశ్వరుని ఆజ్ఞకు విరుద్ధముగా వర్తించువారు ఇటునటు ఎంత తిరిగియు వాని నెరుంగ జాలరు. ఈశ్వరాజ్ఞల ననుష్ఠించువారు తమలోనే అత్యంత సమీపమున నున్న బ్రహ్మమును గుర్తింతురు. ఆ బ్రహ్మము ప్రకృతి మొదలు స్థూల భూతములవరకు గల సమస్త పదార్థములలోను లోపల వెలుపల వ్యాపించి యున్నది. జీవులలోను అంతర్యామియై ఉన్నది. జీవుల పాపపుణ్య కర్మలను నిరీక్షించుచు, వానికి తగిన ఫలములను సుఖదుఃఖరూపమున ఇచ్చుచుండును. అబ్రహ్మమునే యెల్లరు ధ్యానింపవలెను. దానికే భయపడవలెను.

ఇక్కడ 'తత్' పదము బ్రహ్మవాచకం. 'తత్' అనగా 'అది'-ప్రసిద్ధమైనది-అని యర్థం. 'ఓం తత్ సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః'-గీ. 17-23. బ్రహ్మ పదార్థాన్ని 'ఓమ్', 'తత్', 'సత్' అని నిర్దేశించుతారు. నిర్దేశించుట అంటే చెప్పడం. అది సర్వవ్యాపకమై ఉంటుంది. సర్వవ్యాపక వస్తువు కదలదు. కాని అజ్ఞానుల దృష్టిలో అది కదలినట్లుంటుంది. అలాగే పరమేశ్వరతత్త్వం తెలియనివారికి దూరంగ ఉంటుంది. తెలిసినవారికి అతిసమీపంలో ఉంటుంది. 'తద్దూరే తద్వంతికే'. ఆ బ్రహ్మ పదార్థాన్ని తెలిసికోవడం ఎలా ? 'త దుపాసిత్యం'-అది ఉపాసించదగింది.

'త దుపాసితవ్యం, తదన్వేష్టవ్యం, తద్ విజిజ్ఞాసితవ్యం'-అబ్రహ్మ ఉపాసింపదగింది, అన్వేషింపదగింది, తెలిసికొనదగింది అని. ఉపాసన

(ఉప+ఆసనం) అంటే సమీపంలో కూర్చోవడం అని అర్థం. బ్రహ్మో పాసనం అంటే బ్రహ్మకు సమీపంలో కూర్చుండుట. సమీపించడమంటే ఏమిటి? దగ్గరకు చేరడం. మనవాళ్ళు దేవుణ్ని ఉపాసించాలని చెప్పి-గుళ్ళకు, గోపురాలకు, కొండలకు, గుట్టలకు వెళ్ళుతుంటారు. వారికి దేవు డంతటా ఉన్నాడని తెలియదు. కావుననే అట్లుచేస్తారు. ఉపాసించుట యన దగ్గరకు చేరుట. అనగా ఎవనిని ఉపాసించదలచితిమో అతనికి తమకు మధ్యనున్న యెడము-దూరమును తొలగించుకొనవలెను. పరమేశ్వ రుని ఉపాసించుట యన అతనికి జీవునకు మధ్యనున్న దూరమును తొల గించుకొనవలెనుగదా!

పరమేశ్వరతత్త్వం వ్యాపకతత్త్వం, వ్యాప్యతత్త్వం జీవుడు. 'వ్యాప్య' మంటే కొంతప్రదేశములో ఉండేది. 'వ్యాపక' మంటే అంతటా నిండి ఉండేది. పరమేశ్వరుడు ఉపాస్య వస్తువు. జీవుడు ఉపాసకుడు. మరి ఈ జీవుడు ఎక్కడున్నాడో ముందు తెలుసుకోవాలి. తరువాత పర మేశ్వరుణ్ణి సమీపించడం ఎలాగో తెలిసికోవచ్చు. జీవుడు హృదయా కాశంలో ఉన్నాడు. యోగులుకూడ అట్లే యెంచుతారు. జీవునితోపాటుగా మనస్సుకూడ హృదయంలో ఉంటుందని ఋషుల భావం.

హృత్ప్రతిష్ఠం యదజిరం జవిష్ఠమ్
తన్మే మనః శివసంకల్ప మస్తు ॥

యజు. ౩౪-౬

'ఏది హృదయమున నుండునో, మనుష్యులను వికలపరచునో, ఎక్కువ వేగవంతమో ఆ నా మనస్సు శివసంకల్ప మగు గాక!' అని మనం శివసంకల్ప మంత్రములలో చదువుతుంటాము. హృదయమంటే గుండెకాయ.

పరమేశ్వరుడు అంతటా నిండిన వ్యాపకతత్త్వ మని చెప్పు

కున్నాము. అతడు అంతటా ఉన్నాడు కనుక జీవునికి లోపల బయట కూడ ఉన్నాడు. అలాగైతే జీవుడు మరి పరమేశ్వరునికి దగ్గర ఉంటియే యున్నాడు. ఇంక ఉపాసించుట - దగ్గర చేరుట-యన నేమి ?

దూరం మూడు రకాలుగా ఉంది. ఒకటి దేశ దూరం. రెండవది కాలిక దూరం (అంటే కాలభేదం). పరమేశ్వరునిలో యీ రెండు దూరములు లేవు. వేదములో చెప్పబడ్డ విష్ణువు వ్యాపకుడు. పురాణాలలోని విష్ణువు వైకుంఠవాసి. ఇక్కడ దేశ దూరం ఉంది. అలాగే రాముణ్ణి కృష్ణుణ్ణి మనము దేవుళ్లనుకుంటే వారికి మనకు దేశదూరం ఉంది. రాముడు అయోధ్యలో పుట్టాడు. కృష్ణుడు బృందావనంలో జన్మించాడు. ఇలా దేశదూరమే కాక వారికి మనకు కాలదూరం కూడ ఉంది. కొన్ని యుగాలు తేడా ఉంది. రాముడు త్రేతాయుగంలో పుట్టినాడు, కృష్ణుడు ద్వాపర యుగంలోనివాడు. నేను మా తాత గారిని ఉపాసించా లనుకుంటా ననుకోండి. ఆయనకు నాకు కాలదూరం ఉంది. ఇద్దరం ఒక యింట్లోనే పుట్టినందున మా యిద్దరి మధ్య దేశదూరం లేనప్పటికీ మా మధ్య కాల దూరం ఉంది. కనుక, నే నాయనను ఉపాసించడం కుదరదు. అలాగే, గతించిన రాముడు, కృష్ణుడు మున్నగు మహాపురుషులను నేను ఉపాసించాలంటే, వారికి నాకు మధ్యలో దేశదూరం, కాలదూరం రెండూఉన్నాయి. కనుక వారిని ఉపాసించడానికి కూడ వీలులేదు. కాని పరమేశ్వరునిలో మాత్రం యిలా కాల సంబంధమైన దూరంగాని, దేశసంబంధమైన దూరంగాని లేవు. ఆయన ఒక కాలంలో ఉండి యింకొక కాలంలో లేక పోడు. మూడు కాలాల్లోనూ ఆయన ఉన్నాడు. కడచినకాలంలో ఉన్నాడు (భూతకాలం), ఇప్పుడున్నాడు (వర్తమానకాలం), ఇక ముందు కూడ ఉంటాడు (భవిష్యత్ కాలం). ఆయన ఒక క్షణంఉండి మరొక క్షణంలో లేనివాడు కాడు. నిరంతరం ఉంటాడు. కనుక పరమేశ్వరునిలో కాల సంబంధమైన దూరంలేదు. అలాగే ఆయనలో దేశసంబంధమైన దూరం

కూడ లేదు. పరమేశ్వరుడు సర్వవ్యాపకు డగుటచేత ఆయన యిక్కడ ఉన్నట్లే, అన్నిచోట్ల ఉన్నాడు. అతడు ఒకచోట ఎక్కువగా ఉంది మరొకచోట తక్కువగా లేడు. అంతటా సమంగా వ్యాపించి ఉన్నాడు.

దేవుని స్థితిగతులు తెలియక క్షేత్రాలలో, తీర్థాలలో దేవుణ్ణి వెతకడానికి వెళ్ళేవారికి చాలా యిబ్బందులున్నాయి. మొదటిది ఆర్థికనష్టం. శ్రమపడి ఎంతో ఖర్చుపడి అంతదూరంవెళ్లినా, డబ్బుపెట్టి టిక్కెట్టు కొననిదే దేవుని దర్శనం లేదంటారు. కొబ్బరికాయ కొడితే దానికి పన్ను, స్పెషల్ దర్శనాని కింత పన్ను అని అక్కడుండే ఆలయాధికారులు పన్ను వసూలు చేస్తారు. చివరకు దేవుని ప్రసాదం కూడ పూజారులు బ్లాక్ మార్కెట్‌లో అమ్ముతుంటారు (సభలో నవ్వులు). ధన సంపాదనే ఈ ఆలయాలలో ప్రధానంగా ఉన్నట్లు కనబడుతుంది మనకు. పైగా యిక్కడి నుండి బయలుదేరితే మీరు ఆక్షేత్రాలకు వెళ్లగలరో లేదో కూడ చెప్పలేం. రైలు ప్రమాదాలు, కారు ప్రమాదాలు సంభవించవచ్చు. తిరుపతికి వెళ్ళే టూరిస్టుబస్ రైలుకు ఢీకొని అందులోని యాత్రికులు ఒకరిద్దరు తప్ప అందరూ చనిపోయారన్న సంగతి మనకు తెలుసు. ఈ ప్రమాదాలే కాకుండా తిరుపతి దేవాలయంముందే దేవుని దర్శనం కోసం నిలువబడిన యాత్రికులు త్రొక్కిసలాడి 19 లేక 20 మంది (స్త్రీలు పిల్లలుకూడ) మరణించినట్లు మనకు తెలుసు. దేవుని సన్నిధిలో యీ ప్రమాదాలా? మిమ్మలను నేను యాత్రలు చేయవద్దనడం లేదు. కాని దేవుని కోసమని యాత్రలు చేయటం చాల పొరపాటంటున్నాను. అక్కడుండే దేవుడే యిక్కడా ఉన్నాడు. మేము దేవుణ్ని చూడటానికికాదు, దేశం చూడటానికి యాత్రలు చేస్తున్నాం, అంటారా అలాగైతే మంచిదే. నాకేమి అభ్యంతరం లేదు. విహారయాత్రలవల్ల విజ్ఞానం వృద్ధి అవుతుంది కూడ. దేవునికొరకు దేవాలయాలకు కూడ వెళ్ళ నవసరంలేదు. మనలో ఉండే

దేవున్ని మరచి దేవాలయాలకు వెళ్ళడం అనేసరికి పరమేశ్వరునికి మనకు మధ్యలో దేశదూరం ఉందని చెప్పాలి. అలా చెప్పుట సరికాదు.

ఇలా పరమేశ్వరునికి మనకు మధ్య దేశదూరం, కాలదూరం ఏమీ లేదని తెలుసుకున్నాము. కాని యింతటితో సమస్య పూర్తికాలేదు. ఆయనకు మనకు మధ్యలో యింకొక దూరం కూడ ఉంది. అది 'అజ్ఞాన మనే దూరం'. అజ్ఞానమంటే తెలియనితనం. మీరు ఆఫీసు పని చేస్తుంటారు. మీ సీట్లోనే కలం ఒకచోట పెట్టి (మరచిపోయి) ఆఫీసంతా వెతుకుతారు. నా కలం తీశావా అని కనపడిన ప్రతివాణ్ణి అడుగుతారు. మళ్ళీ కలాన్ని మీ సీట్లోనే చూస్తారు. అరే! యిక్కడే ఉంచుకుని ఆఫీసంతా వెతికానే అని నవ్వుకుంటారు. మన యిండ్లలో వృద్ధులుంటారు. వారు కంటి అద్దాలు ముక్కుకు పైన ఉంచుకొని ఇంటిలో ఉండే పిల్లలను తిడుతుంటారు, తన కళ్ళద్దా రెవరో తీశారని. ఏ మనుమరాలో వచ్చి అదేమిటి తాత! కంటి అద్దాలు నీ ముక్కుపైనే ఉన్నాయిగా, మమ్మేల నరుస్తావేం అంటే- కళ్ళజోడు చూచుకొని అరే, యిక్కడే ఉన్నాయమ్మా, నేను మరచిపోయాను అంటాడు. అంటే తెలియనితనంవల్ల వస్తువు దగ్గరుండి కూడ దూరమవుతుంది. కాబట్టి పరమేశ్వరుని ఉపాసించడం అంటే ఆయనను తెలుసుకోవడమని అర్థం. అందుచేత తెలియని వాళ్ళకు 'తద్దూరే' - పరమేశ్వరుడు దూరం. తెలిసినే వాళ్ళకు 'తద్అంతికే' - ఆయన దగ్గరే ఉన్నాడు, అని మంత్రం చెబుతుంది.

జీవునికి పరమేశ్వర సాక్షాత్కారము అసాధ్యమని మాత్రం ఎంచరాదు. ప్రయత్న సాధ్యమే. ఒక వ్యక్తి పరమేశ్వర సాక్షాత్కారము పొందితే అన్యులుకూడ దానిని పొందవచ్చును. ఒకరికి సాధ్యమైన పని యింకొకరికిని సాధ్యమే. పరమేశ్వర సాక్షాత్కారము కోరినవ్యక్తి బాహ్య

పదార్థములను కోరరాదు. ఆతనికి పరమ వైరాగ్యం కలగాలి. వైరాగ్యం అంటే-

"దృష్టానుశ్రవిక విషయ వితృష్ణస్య వశీకార సంజ్ఞా వైరాగ్యమ్"
యో. ద. ౧-౧౫

అనుశ్రవ మంటే వేదమని అర్థం. (అనుశ్రవో నామ వేదః). వేదము ద్వారా బోధింపబడిన పారలౌకిక (జన్మాంతరములకుసంబంధించిన) విషయములు అనుశ్రవికము లనబడును. దృష్ట పదార్థాలు - అంటే ఇంద్రియగ్రాహ్యములైన ఐహికవిషయములు. దృష్టములుఅనుశ్రవికములు అను ఉభయవిధ పదార్థములలో వాంఛ లుడగడం వైరాగ్య మనబడు తుంది. వైరాగ్యంకొరకు సాధనచెయ్యాలి. భక్తిప్రపత్తులు కలిగి ఉండ డం వైరాగ్యం కాదు. అజ్ఞానాన్ని పోగొట్టదలచుకుంటే మనసు శుద్ధం కావాలి. మనసు శుద్ధం కావాలి అంటే యమ నియమాదులను సాధన చెయ్యాలి. గుడికి వెళ్ళి మూర్తిపూజలు చెయ్యడం భక్తియని మోక్షానికిది మొదటి మెట్టని కొందరంటారు. కాని, దయానందు డిది నరకానికి మొదటి మెట్టన్నాడు. అందువలన నతనిని ద్వేషించి విషంపెట్టి చంపారు. మనుష్యుడు జడపూజలు చేస్తే జడుడవుతాడు. మూర్ఖుణ్ణి ఉపాసించే విద్యార్థికి మూర్ఖత్వం వస్తుంది. అలాకాక జ్ఞానంగల టీచర్‌కు అప్పగించితే పిల్లవాడు జ్ఞాని అవుతాడు. మన ప్రాచీన ఋషులు జడపదార్థాలను ఉపయోగించుకున్నారేగాని, వాటి నుపాసించలేదు. పరమాత్మనే ఉపాసించారు.

పరమేశ్వరుని జ్ఞానము కలగాలి అంటే మనం మొదట సాధించ వలసినవి యమనియమాలు. అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం యివి యమములు. శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము ఇవి నియమములు. ఇవియే నిజమైన వ్రతాలు. శివరాత్రి, గోకులాష్టమి మున్నగు వ్రతాలు వ్రతాలు కావు.

అహింస ఆచరించవలసిన వ్రతములలో మొదటిది. "సర్వదా సర్వధా సర్వభూతానాం అనభిద్రోహః అహింసా"— ఎల్లప్పుడు, సర్వవిధముల సమస్త ప్రాణులయెడ వైరభావం లేకుండుట అహింసావ్రతమౌతుంది. శివభక్తుడు, శివరాత్రిరోజు మాంసము తినడు. ఆనాడు తినుట పాపమంటాడు. ఆ ఒక్కరోజు తినకుండ ఉండి దేవుణ్ణి మెప్పించా లనుకుంటాడు పాపం. కాని ప్రతిరోజు తింటాడు.. ఒక శివరాత్రినాడు తింటేనే పాపంవస్తే మరి రోజూ తినడంచేత యింకా ఎక్కువ పాపం రాదూ? (సభలో నవ్వులు). పూర్వం తిరుపతి నడిచివెళ్ళే రోజుల్లో మాంసాదులు తినక అహింసావ్రతాన్ని పాటించేవాళ్ళు యాత్రికులు. ఇప్పుడు కార్లమీద తిరుపతి వెళ్ళి అన్నిపనులు చేసివస్తున్నారు. (సభలో నవ్వులు). కురుక్షేత్రమున ప్రాణిహింసచేయను, కాశియందు ప్రాణిహింస చేయను, అని కొన్నిప్రదేశములలో హింసను వర్జించడం దేశావచ్ఛిన్న అహింస. అట్లే ఏకాదశినాడు ప్రాణిహింస చేయను, పూర్ణిమనాడు హింసింపను అనడం కాలావచ్ఛిన్న అహింస, ఇలా దేశ, కాల భేదములు లేకుండ సర్వత్ర, సర్వకాలములందు అహింసను పాటిస్తే అది మహావ్రత మౌతుంది. కొందరసమర్థులు మానసికంగా హింసిస్తారు. శత్రువులను పైకి ఏమీ అనలేక లోలోపలమాత్రం – వారి గొడ్డు బిడ్డలు నాశనమయితే బాగుండును, ఆస్తిపాస్తులు హరించుకుపోతే బాగుండును. అని మనస్సులోనే అనుకుంటారు. ఇదికూడ హింసయే. (సభలో నవ్వులు). ఇది మానసికమైన హింస. అహింసావ్రతం పాలించాలనుకునే వ్యక్తి యిలాంటి కుబుద్ధితో ఉండరాదు.

సత్యం :- తెలిసింది తెలిసినట్లు చెప్పుట. అసత్యం చెప్పుట హింసలోనే చేరుతుంది. కావున అహింసకుడు సత్యమే చెప్పాలి.

తరువాత అస్తేయం :- స్తేయం అంటే దొంగతనం. అస్తేయం అంటే దొంగిలించకుండటం. మనవస్తువుల నెవరైన దొంగిలించితే మన

కెంతో వ్యథ కలుగుతుంది. అలాగే మన మెవరివైన అపహరించితే వారికి దుఃఖం కలుగుతుందని యెంచి దొంగతనం చేయకుండా ఉండాలి. ఇది అస్తేయం అనబడుతుంది. అస్తేయవ్రతంకూడ అహింసలో ఒక భాగం.

బ్రహ్మచర్యము :- సంతానోత్పత్తికి మూలమైన ఉపస్థేంద్రియ మును నిగ్రహించడం బ్రహ్మచర్యం అవుతుంది. వ్యభిచరించరాదు. వీర్య మును సాధ్యమైనంతవరకు తక్కువఖర్చు చేయాలి. అదికూడ భార్య యందే వినియోగించాలి, సంతానార్థమై. శరీరంలో ఎంత ఎక్కువ వీర్య మును నిలువచేసుకుంటే సాధకుడు అంత బలిష్ఠుడు, తేజోవంతుడు, శక్తిసామర్థ్యాలు కలవాడు అవుతాడు. అట్లు నిలవచేసిన వీర్యము ఓజ స్సుగా మారి అతనిలో మేధాశక్తి వృద్ధిఅవుతుంది. వీర్యనష్టమువలన ఆయువు క్షీణించుతుంది. (మరణం బిందుపాతేన జీవనం బిందుధార ణాత్) 'నాయమాత్మా బలహీనేన లభ్యః'-- బలహీనులచేత ఈ ఆత్మ తెలియబడదు. బ్రహ్మచర్య వ్రతమును పూని సమర్థుడైన సాధకునికే ఆత్మసాక్షాత్కారము కలుగుతుంది.

అపరిగ్రహం :- పరిగ్రహమంటే అన్నివైపులనుండి పట్టుకొనుట, బాగుగా గ్రహించుట లేక సేకరించుట అని అర్థం. 'అపరిగ్రహ' మంటే తనకు కావలసినవరకే గ్రహించడం అని భావము. ఈ అపరిగ్రహ వ్రత మును గూర్చి గాంధీమహాత్ము డెంతో ఆలోచించాడు. తుదకాపదమున కర్థము 'నాన్ పొసెషన్' (Non-possession) అని నిశ్చయించాడు. అంటే కూడబెట్టకుండుటని అర్థం. తనకు కావలసినవరకే పశు, ధనాదు లను కూడబెట్టాలి. అంతేగాని వంశపారంపర్యం, మనుమలు మునిమను మలు తిన్నా తరుగనంతగా ప్రోగుచెయ్యరాదు. అలా చెయ్యడం తన భావిసంతతిని సోమరులుగా, అయోగ్యులుగా తయారుచెయ్యడ మవుతుంది. ప్రతివ్యక్తి తనకు కావలసినవరకు ఉంచుకొని మిగిలిన సంపదను సంఘ

శ్రేయస్సునకు, దీనులకు, దరిద్రులకు ఉపయోగించాలి. అలా చేసేట ట్లయితే సంఘంలో యిప్పుడున్న విపరీతమైన ఆర్థిక వ్యత్యాసా లుండవు. కమ్యూనిజం దేశంలో వ్యాపించుటకు అవకాశంలేదు. ఈ అపరిగ్రహ వ్రతమును గాంధీజీ బాగుగా పాటించాడు. చనిపోవునాటికి ఆయన తన సంతతికేమీ మిగల్చలేదు. అపరిగ్రహవ్రతం పూని చివరికి ఆయన జీవిత భీమా పాలసీలుకూడ కడుతూ కడుతూ మానేశాడు. దక్షిణాఫ్రికాలో ఉన్నపుడు ఆయనచేసిన సంఘసేవలకు సంతసించి ప్రజలాయనకు నగలు నాణ్యాదులు బహూకరించగా అవి తాను తీసికొనక, కొన్నిలక్షల రూపా యలు విలువగలిగిన ఆ సంపదను దరిద్రనారాయణబ్యాంకిలో వేసి ఆ నిధిని సంఘశ్రేయస్సునకై వినియోగించాడు.

ఇపుడు మనం చెప్పుకొనిన యీ అయిదింటిని యమము లంటారు. మనుష్యుడు సంఘజీవి. సంఘము వ్యక్తిమీద, వ్యక్తి సంఘముమీద ఆధారపడి ఉండటంచేత ప్రతి మనుష్యుడు ఈ యమములను, సంఘశ్రేయ స్సును దృష్టిలో ఉంచుకొని తన నిత్యజీవితంలో ఆచరించుటకు పూను కోవాలి. ముఖ్యంగా ముముక్షువు కాగోరువారు వీటిని తప్పనిసరిగా ఆచరించాలి.

తరువాత నియమములు: అవియును అయిదు. శౌచము, సంతో షము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము.

శౌచము-అంటే శుద్ధి. ఇది రెండు విధములు. బాహ్యశుద్ధి, మాన సిక శుద్ధి.

అద్భిర్ గాత్రాణి శుద్ధ్యంతి మనః సత్యేన శుద్ధ్యతి
విద్యా తపోభ్యాం భూతాత్మా బుద్ధిర్ జ్ఞానేన శుద్ధ్యతి॥

—మనుస్మృతి ౫-౧౦౯

స్నానముచేత శరీరావయవములు శుభ్రపడతాయి. సత్యము నాచరించడంచేత మనస్సు శుద్ధమౌతుంది. విద్య, తపస్సు, వీనివలన జీవాత్మ పవిత్రమవుతుంది. పృథివి మొదలు పరమేశ్వరుని పర్యంతముగల పదార్థ జ్ఞానమువలన దృఢనిశ్చయము కలిగి బుద్ధి స్థిరమవుతుంది.

శారీరక శుద్ధికంటె మానసిక శుద్ధి ముఖ్యము. గంగలో స్నానము చేసినంతమాత్రంచేత మానసికశుద్ధి కలుగదు. గంగలో స్నానంచెయ్యడం అందరికి సాధ్యంకూడ కాదు. అందుచేత గంగాస్నానం చేయనివారిని సంతోషపెట్టడానికో ఏమో, గంగలో స్నానం చేయకపోయినా, గంగను స్మరించినంతమాత్రముచేతనే గంగాస్నానఫలం కలుగుతుందని శ్లోకాలు వ్రాసిపెట్టారు.

గంగే గంగేతి యో బ్రూయాత్ యోజనానాం శతైరపి
ముచ్యతే సర్వపాపేభ్యః విష్ణులోకం స గచ్ఛతి॥

హే గంగే! గంగే! అని వందలకొలది ఆమడల దూరంనుండి స్మరించినంత మాత్రముచేతనే (గంగలో స్నానం చేయకపోయినప్పటికి) మనుష్యుడు తాను చేసిన పాపములనుండి విముక్తుడై నేరుగా వైకుంఠమునకు పోతాడట! చూడండి, ముక్తికి ఎంత సులభోపాయం కనిపెట్టారో (సభలో నవ్వులు).

తరువాత సంతోషం: సంతోషమంటే తృప్తి. తన శ్రమకు లభించిన దానితో తృప్తిపడి ఉండడం. ఇతరులు తనకంటే ఎక్కువ సుఖ సంతోషములతో ఉన్నారని ఈర్ష్యపడరాదు.

తపస్సు: తపస్సంటే ఇంద్రియ నిగ్రహం. ఇంద్రియములతో చెడుగులు చేయకుండా ఉండటం. అంతేగాని, ఇంద్రియ శక్తుల్ని ఉడిగించడంకాదు. కొందరు మౌనవ్రతము పూని మేము తపస్సులో ఉన్నా

మంటారు. వారు నోటితో మాత్రం మాటలాడరు. మనసులో ఆలోచిస్తూనే ఉంటారు. తనకేదైనా కావాలన్నా, దగ్గరకు వచ్చిన వారికి సమాధానాలు చెప్పాలన్నా కాగితం మీద వ్రాసి యిస్తుంటారు. (సభలో నవ్వులు). నోటితో మాటలాడకపోతే తపస్సు చేసినట్లుకాదు. భగవంతుడు మనకు వాక్కును ప్రసాదించినందుకు, 'శ్లక్ష్ణయా మధురయా వాచా' – మృదువు, ప్రీతియుక్తమునైన మాటలు మాటలాడాలి. అంతేగాని నోటిని కట్టివేసు కొని కూర్చోరాదు. వంకరచూపులు మానాలి. దొంగచూపులు పనికిరావు. (సభలో చిరునవ్వులు). నేరుగా చూడటం నేర్వాలి. నేత్రేంద్రియాన్ని అదుపులో ఉంచడానికి ప్రయత్నంచెయ్యాలి. అంతేగాని కన్ను పాపం చేసిందని చెప్పి దానిని పొడుచుకోరాదు. కన్నులు పొడుచుకోవడం సరైన పనియా ? కన్నులు పోయిన తరువాత మనుజుడేమి చేయగలడు? ఏమి సాధించగలడు ? ఇంద్రియములలో పటుత్వము ఉన్నపుడే వాటిని నిగ్రహించాలి. అవి పటుత్వం కలిగి ఉంటేనే ఏదైనా సాధించగలం. ఇంద్రియములు బలహీనములైతే ఏమీ సాధించలేము.

భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః
భద్రం పశ్యే మాక్షభి ర్యజత్రాః
స్థిరై రంగై స్తుష్టు వాగ్ంస స్తనూభిః
వ్యశేమహి దేవహితం యదాయుః ॥

యజుర్వేదం ౨౫-౨౧

మే మెల్లప్పుడు శుభమునే వీనులతో విందుముగాక। కల్యాణకర దృశ్యములనే కన్నులతో చూతుముగాక। సుస్థిరములైన శరీరాంగములతో పరమేశ్వరుని స్తుతించుచు, విద్వాంసులకు హితకరములగు కార్యముల నాచరించుచు జీవింతుముగాక। ఈ విధంగా వర్తించడాన్ని ఇంద్రియ నిగ్రహమనాలి.

తరువాత స్వాధ్యాయం: ప్రతిరోజూ, సద్గ్రంథ పఠనము చేయడం స్వాధ్యాయ మవుతుంది. వేదాది శాస్త్రములు చదవాలి. మహాపురుషుల జీవిత చరిత్రలు చదవాలి. శంకర, దయానందాది మహాపురుషుల జీవితచరిత్రలు చదవడంచేత మనకెంతో మేలు కలుగుతుంది. నిత్యజీవితంలో వారిని మనం ఆదర్శంగా ఉంచుకొని మన జీవితాలను సరిదిద్దుకోగలం. సైన్సు గ్రంథాలు చదవటంకూడ మంచిది. అందుచేత ప్రకృతి రహస్యాలను తెలిసికొనగలం. నవలలు, అనార్ష గ్రంథాలు పఠించడంవలన మనకేమీ ఉపయోగంలేదు. శ్రీ దయానంద మహర్షి తమ 'సత్యార్థప్రకాశము' అనే గ్రంథంలో ఒక జాబితా యిచ్చారు- ఏ గ్రంథములు చదువతగినవో, ఏవి కూడనివో, ఏవి ఆర్షగ్రంథములో, ఏవికావో. అనార్ష గ్రంథములు విషమిశ్రిత అన్నంవలె త్యాజ్యము అన్నాడాయన. విషము కలిసిన అన్నంలో విషము ఏ భాగంలో ఉందో తెలియదు గనుక, మన మా అన్నము తినం. అలాగే సామాన్యులు అనార్ష గ్రంథములలో ఎక్కడ లోపం ఉందో గ్రహించలేరు గనుక, వానిని చదవటంవలన నష్టం కలుగుతుందని, సత్యము తెలియదని, అందుచేత వేదాది సద్గ్రంథములనే స్వాధ్యాయము క్రింద పఠించాలన్నా డాయన. స్వాధ్యాయంక్రింద నిత్యం కొన్నిపేజీలైనా చదవాలనే నియమం పెట్టుకోవడం మంచిది.

చదువురానివారు చేయవలసిందేమిటి ? 'స్వాధ్యాయో నామ ప్రణవ జపః'-వారు నిత్యము "ఓం" కారమును జపించడమే స్వాధ్యాయ మవుతుంది. ఏకాంత ప్రదేశంలో కూర్చొని ప్రణవ జపం చేయడం మంచిది. తాను చేసే సాధన ఎంత గుప్తంగా ఉంచితే సాధకున కంత మంచిది. ఒక్కొక్కరు బజారులో అరుగుమీద కూర్చుండి జపమాలను త్రిప్పుతుంటారు "రాం, రాం" అని. వచ్చే పోయేవారితో ముచ్చట్లుకూడ నడుస్తుంటాయి యీ జపంలోనే. (శ్రీ గోపదేవ్‌గారిచట, తమ చేతివ్రేళ్ళతో జపమాలను తిప్పుచున్నట్లు అభినయించుతూ, యిలా అన్నారు చిరు

నగవుతో) ఏమేవ్ ! అమ్మాయి ఏంచేస్తుంది ? కాస్త మంచినీళ్ళు పట్టుక రమ్మను. "రాం, రాం" అంటాడు. (సభలో నవ్వులు). ఎవరైన ఆ బాటనే పోతుంటే వారి నిటు రమ్మని పిలుస్తాడు. వారితో అంటాడు. ఏంరా ! యివ్వాళ ధాన్యం రేటు ఎలాగుంది? "రాం, రాం" మినుములరేటు మరీ ముండమోసిందేం ! "రాం, రాం" (సభలో నవ్వులు). శనక్కాయలకు అసలు రేటు వస్తుందంటావా ? "రాం, రాం" (సభలో నవ్వులు). అంటూ ఇలా బేరాలాడుతుంటాడు. ఇలా ధార్మిక జీవనం నేడు అంతా డంబముతోనే నడుస్తున్నది. అభ్యాసకుడు ఏకాంతంగా కూర్చుండి, "ఓం"ను మాటిమాటికి స్మరించాలి. "ఓం" అంటే రక్షకుడని అర్థం. 'అవతి ఇతి ఓం' ఓంకారము పరమేశ్వరుని నామములన్నింటిలో ఉత్తమమైనది. ఆయన సృష్టికర్త, రక్షకుడు. ఇతర చింతలు లేక నిరంతరం మన మాయనను ధ్యానించాలి. పరమేశ్వర సాక్షాత్కారం పొందాలి. కొందరు సంశయిస్తుంటారు మన కిది సాధ్యమా అని. దీనిలో సంశయించ వలసిన పనిలేదు. మనుష్యులకు చెప్పేవి సాధ్యమౌతాయి. ప్రయత్నించేస్తే అసాధ్యమౌతా యనుకోరాదు.

ఈశ్వరప్రణిధానం : నిధానం అంటే ఉంచడం. ప్రణిధానం అంటే బాగా ఉంచడం. ఈశ్వర ప్రణిధాన మంటే ఈశ్వరునియందు బాగా ఉంచడం. ఏమి ఉంచాలి ? మనంచేసే ప్రతి కర్మను ఆయనయం దుంచాలి. అంటే మనం చేసే కర్మలు పరమేశ్వరార్పణంగా చేసి, కర్మఫలములను త్యజించాలి. (దీనినే నిష్కామకర్మ లేక కర్మయోగమని అంటారు). మరియు భగవంతునియందు భక్తిప్రపత్తుల నుంచాలి. మనసు నెప్పుడూ ఆయన యందే ఉంచి ఆయననే స్మరించుతూ ఆయననుగూర్చి మననం చెయ్యాలి. ఇదికూడ ఈశ్వర ప్రణిధానమే. ఇపుడు నియమములను గూర్చి తెలుసుకున్నాం. నియమములు వ్యక్తి శ్రేయస్సాధకములు, కనుక సాధకుడు వీనిని గూడ నిత్యము అనుష్ఠించాలి.

యమాన్ సేవేత సతతం న నియమాన్ కేవలాన్ బుధః
యమాన్ పత త్యకుర్వాణో నియమాన్ కేవలాన్ భజన్॥

మను. ౩-౨౦

యమముల నెప్పుడూ సేవించవలసిందేకాని మానరాదు. కేవల నియమములనే సేవించనురాదు. సంఘశ్రేయస్సును దృష్టిలో నుంచుకొని యమములను పాటించాలి. అలా చేయని సాధకుడు సంఘద్రోహియై పతితు డవుతాడు. అలాగని చెప్పి నియమములను మానరాదు. వ్యక్తి శ్రేయస్సు దృష్ట్యా నియమములనూ సేవించవలసిందే. నేను ధ్యానంచేసు కుంటాను. లేక చదువుకుంటాను. ఇవి నా వ్యక్తిగత శ్రేయస్సుకై చేసే పనులు. దానివలన యితరులకేమీ హానిలేదు. అందుచేత ముముక్షువు కాగోరు నతడు యమనియమములను రెంటినీ ఆచరణలో పెట్టాలి.

ఇంతవరకు మనం యమనియమాలను గూర్చి చెప్పుకున్నాం. వీటిని బాగా అభ్యాసంలో పెట్టేకొలది వైరాగ్యం వస్తుంది. ప్రాపంచిక వస్తువులయందు, విషయ సుఖములయందు విముఖత జనిస్తుంది. చూడండి, ఫాన్సీషాపుల్లో ఉండే వస్తువులు, రబ్బరు పరుపులు (Foam beds) అన్నీ మన ఇండ్లల్లో ఉంటాయి. నిజానికిన్ని వస్తువులు మన యిండ్లలో అవసరంలేదు. సుఖముల నపేక్షించి వీటిని సంపాదిస్తుంటాము. కాని భోగ లాలసులం కారాదని యోగంలో వృద్ధిపొందే కొలది మనసు తెలుస్తుంది. శరీర సుఖాలే మనగమ్యం కారాదు.

యమ నియమములను గాంధీజీ పాటించాడు. ఆయన సత్యవ్రత మును బాగా ఆచరించాడు. 'యేవై అనృతం వదంతి తేవై మనుష్యాః, యేవై సత్యం వదంతి తేవై దేవాః'-అబద్ధం చెప్పినంతకాలం మను ష్యులు మనుష్యులుగానే ఉంటారు. సత్యం చెప్పుతున్నప్పుడు మనుష్యులు దేవత లనబడతారు. అలాగే గాంధీజీ అహింసాదులనుకూడ బాగా సాధిం

చాడు. సంపూర్ణంగా సాధించనప్పటికీ తీవ్రంగా కృషిచేశాడు. కాని బుద్ధుడు అహింసావ్రతంలో పూర్ణతను సాధించాడు. ఆయన అజాతశత్రు వన బడినాడు.

"అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైర త్యాగః"

యో. ద. ౨-౩౫.

అతని సమీపంలో జాతివైరంకూడ ఉండేది కాదు. ముంగిసకు పాముకు, పిల్లికి ఎలుకకు, అలాగే పులికి మేకకు పుట్టుకతోనే విరోధం ఉంటుంది. దీన్ని జాతివైరం అంటారు. మన ఋషుల ఆశ్రమాల్లో జాతి వైరం విడిచి లేళ్లు పులులు కలిసిమెలిసి తిరుగుతుండేవని కథల్లో చదువు తాము. బుద్ధునిజీవితంలో యిలాంటి సంఘటనలు ప్రత్యక్షంగా చూడ గలం. ఆయన జీవితం కట్టుకథకాదు. అది History (చరిత్ర ప్రసిద్ధ మైనది). ఆయన కాలంలో అంగుళీమాలు డనే క్రూరుడైన ఒక బంది పోటు దొంగ ఉండేవాడు. అతడు అరణ్యమార్గమునపోయే బాటసారులను దోచుకోవడమే కాకుండ వారిని చంపి వారి వ్రేళ్ళను నరికి మాలగాచేసి మెడలో వేసికొంటూ ఉండేవాడు. అందుచేత అతనికి అంగుళీమాలుడనే పేరు వచ్చింది. అతణ్ణి మార్చవలెనని యెంచి, బుద్ధుడు బయలుదేరుతాడు. అనేకులు ఆయనకు అడ్డుతగిలి మీ రచటికి వెళ్ళవద్దు. వాడు మిమ్ములను కూడ చంపగలడు. మహాక్రూరుడని చెబుతారు. కాని బుద్ధుడు అతని దగ్గరకు వెళ్ళడానికే నిశ్చయించి వెళతాడు. బుద్ధుడు తనను సమీపించుట చూచి ఆయనను హతమార్చుటకు అంగుళీమాలుడు విల్లు నెక్కు పెడ తాడు. కాని బుద్ధు దేమాత్రము చలించలేదు. చిఱునగవుతో తన కారుణ్య దృక్కులను అంగుళీమాలునిపై బరపుతాడు. అంగుళీమాలుడు భయ కంపితుడై గజగజ వణకుచు వచ్చి బుద్ధునిపాదములపైబడి తనను రక్షించుమని వేడుకుంటాడు. తుద కాతడు బుద్ధుని శిష్యులలో ఒకడౌతాడు. అంతవరకు ఎందుకు, లోకంలో తల్లిప్రేమించునట్లు బిడ్డను మరెవరూ

ప్రేమించరు. కొడుకు దుష్టుడైనా అతన్ని తల్లి ప్రేమించడం మానదు. ఆ ప్రేమ ప్రభావంవలన, ఊరందరికీ అతడు చెడుగుచేసినా తన తల్లిదగ్గర మాత్రం అదిచేయలేడు. కనుక అహింసావ్రతమునకు ఫలం వైరత్యాగమని బోధపడుతుంది.

తరువాత ఆసనం - 'స్థిర సుఖ మాసనం' - (యో. ద. ౨-౪౬) స్థిరంగా, సుఖంగా ఎక్కువకాలం ఏ ఆసనంలో కూర్చోగలడో అది సాధకునికి ఉపకరిస్తుంది. ప్రతిదినం అభ్యాసం ఒక నిర్ణీతసమయంలో ఏకాంతంగా చేయాలి. సాధకుడు ప్రతిదినం ఉదయం 4 గంటలకు (బ్రహ్మ ముహూర్తం) నిద్ర మేలుకోవాలి. తరువాత ఆసనబద్ధుడై ఒకచోట కూర్చుండి మొదట ప్రాణాయామం చెయ్యాలి.

ప్రాణాయామము ;-ప్రాణాయామమునుగురించి సాధకులలో అనేక అపోహలున్నాయి. ప్రాణాయామముచేయడమే యోగమనియెంచి యిల్లు వాకిలి వదిలేవాళ్ళున్నారు. ఇది చాల పొరపాటు. ప్రాణాయామమే యోగ పరమావధి కాదు. అది ఒక శారీరక ప్రక్రియ. ప్రాణాయామమును **Breathing Exercise** అంటారు. లేక శ్వాసకోశములకు సంబంధించిన వ్యాయామమంటే సరిపోతుంది. దీనివలన రక్తము శుద్ధమై శరీరము వ్యాధి రహిత మౌతుంది. ఆరోగ్యము కాపాడబడుతుంది. కొంతవరకు చిత్త వేగముతూడ అరికట్టబడుతుంది. ప్రాణాయామమువలన కలుగు ఫలిత మింతమాత్ర ముంటుంది. కాని యోగాభ్యాసి చిత్తైకాగ్రతను మొదట సాధించాలి. మనస్సులో ఈర్ష్యాదిదోషములు నశించాలి. అపుడు మనస్సు శుద్ధమౌతుంది. మనస్సు శుద్ధమై ఏకాగ్రత కుదిరినపుడు ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది. 'కశ్చి ద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్'-ఒకానొక ధీర పురుషుడు (ధ్యానశీలుడు) ఆత్మను దర్శిస్తాడు.

సమాధి నిర్ధూత మలస్య చేతసో నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్ ।
న శక్యతే వర్ణయితుం గిరా తదా స్వయం తదంతఃకరణేన గృహ్యతే॥

సమాధిద్వారా మాలిన్యరహితమైన శుద్ధచిత్తము ఆత్మయందు ప్రవేశించినపుడు సుఖం కలుగుతుంది. అలా కలిగేసుఖం ఎలా ఉంటుందో మాటలతో వర్ణించుట వీలుకాదు. అది స్వయముగా అనుభవించవలసినదే.

సమాధి అంటే ఏకాగ్రత అని అర్థం. అంతేకాని కాళ్ళు చేతులు విరుగగొట్టి పూడ్చిపెట్టడం సమాధికాదు. (సభలో నవ్వులు). "యోగః చిత్త వృత్తి నిరోధః"—(యో. ద. ౧–౨). చిత్తవృత్తులను నిరోధించడమే యోగము లేక సమాధి అనబడుతుంది. చిత్తవృత్తి రెండు విధములుగా ఉంటుంది. బాహ్యము ఆంతరము నని. మనస్సు బాహ్యవిషయములందు వర్తించడం బాహ్యప్రవృత్తి. మనస్సును బాహ్యప్రవత్తులనుండి తొలగించి అంతర్ముఖంచేస్తే అది లోలోపలనే తిరుగుతూ (సంకల్పించుతూ) ఉంటుంది. ఇది అంతఃప్రవృత్తి. సాధకుడు యీ రెండువిధములైన చిత్తవృత్తులను నిరోధించడమే యోగం లేక సమాధి అవుతుంది. ఈ స్థితిలో తా నెవరో తెలుసుకుంటాడు. పరమాత్మ అంటే ఏమిటో కూడ తెలిసికొంటాడు. దీనినే అమనస్కస్థితి లేక అమనస్క యోగమని అంటారు. పరమాత్మ స్వరూపం 'అవాఙ్మనస గోచరం'—అని సామాన్యంగ అంటుంటారు. ఇది సరికాదు. అది సామాన్యమనస్సునకే అందదు. కాని వృత్తిరహితమై నిర్మలమైన మనస్సున కది అందదని అర్థంకాదు. "మనసైవాను ద్రష్టవ్యః"—శుద్ధ మనసుతోనే ఆత్మను తెలిసికొనవలసి ఉంటుంది. అది ఎక్కడ తెలుసుకోవాలి. అంటే 'స్వయం తదంతఃకరణేన'–తనలోనే తెలుసుకోవాలి.

మరి ఆ సుఖం ఎలాంటిది? అని అడుగవచ్చు. సామాన్యంగా లౌకికసుఖాలనే వర్ణించి చెప్పలేం. ఆత్మసుఖం చెప్పే దెలా? తల్లిదండ్రులు

ప్రేమాతిశయంతో బిడ్డను ముద్దుపెట్టుకుంటారు. అపుడు వారికొక విధమైన సుఖం కలుగుతుంది. ఆ సుఖం ఎలా ఉన్నదని అడిగితే వారేమని చెబుతారు? అలాగే, మిఠాయి తింటాం. ఒకవిధమైన రుచి అనుభవిస్తాం. ఆ రుచి ఎలా ఉందో చెప్పమంటే మన మేమని చెప్పగలం? చెప్పలేం. మనం చేయగల పని, ఆ మిఠాయిని వారినే తినుమని చెప్పడం. అంతేగాని యథార్థమైన రుచి ఏమిటో మనం వర్ణించి చెప్పలేం. మనం ప్రతిదినం నిద్రలో సుఖం అనుభవించుతున్నాం. నిద్రపోతున్నంతసేపు మన కేమీ తెలియదు. కాని తెల్లవారి మేల్కొన్న తరువాతమాత్రం నేను రాత్రి హాయిగా, సుఖంగా నిద్రపోయాను అని ప్రక్కవారికి చెబుతాము. ఆ హాయి ఎలా ఉంటుందో మాటలతో చెప్పలేం. అది అనుభవించవలసిందే. పరమేశ్వరుడు ప్రతి దినము యీ సుఖాన్ని సమస్త ప్రాణికోటికి సుషుప్తి అవస్థలో కలిగించుతున్నాడు. కాని మనమా సుఖాన్ని తెలిసి అనుభవించడంలేదు. మనవాళ్ళు గాఢనిద్రలో వున్న వ్యక్తిని మేల్కొల్పబోతే పాపం కలుగుతుంది ఊరుకోమంటారు. అంటే గాఢనిద్రలో అత డనుభవించే సుఖాన్ని భంగంచేస్తే పాపం కలుగుతుందని వారి అభిప్రాయము. గాఢనిద్రలో పరమేశ్వరుని సుఖం ఎలా ఉంటుందో. తెలియకుండానే అనుభవిస్తాం. కాని ఆ సుఖాన్ని తెలిసి అనుభవించే స్థితి ఒకటుంది. అదే సమాధ్యవస్థ. అవి యోగి కుంటుంది. యోగి సమాధ్యవస్థలో ఆ సుఖాన్ని తాను తెలిసే అనుభవిస్తుంటాడు. దీనినే ముక్తిసుఖమని కూడా అంటారు. అంటే ముక్తుడైన జీవుడు దేహపాతానంతరం నిరంతరం యిట్టి ఆనందస్థితిలోనే ఉంటాడు. 'సమాధి, సుషుప్తి, మోక్షేషు ఏకరూపతా'- (అని సాంఖ్య దర్శనకర్త కపిలుడు. ౫-౧౧౬) అంటే సమాధియందు, సుషుప్తి యందు, మోక్షమునందు ఆత్మ ఒకేస్థితిలో ఉంటుంది. అయినా సమాధి, మోక్షము ఈ రెంటిలో ఆత్మానందాన్ని జీవుడు తెలిసి అనుభవిస్తాడు. సుషుప్తిలో అలా కాదు. మోక్షేచ్ఛ ప్రతివానిలో ఉంది. కాని, ఆ ముక్తి

సుఖాన్ని ఎలా పొందాలో తెలియకే మానవుడు తంటాలుపడుతున్నాడు. క్షణికములైన యింద్రియ సుఖములే శాశ్వతానందప్రదము లను భ్రాంతిలో చిక్కుకున్నాడు మానవుడు. అతడు బాహ్యవస్తువులలో ఏదో సుఖమున్న దనే భ్రమలోపడి వాటిని సంపాదించడానికే జీవితాంతం శ్రమించుతున్నాడు. అలాంటి అజ్ఞానులకు పరమేశ్వరుడు దూరం. కాని, నిజానికి మరేయితర వస్తువుకంటె ఆయన మన కతి సన్నిహితుడు. మన భార్యకంటె మన శరీరం దగ్గర మనకు. మన శరీరంకంటె మన మనస్సు మనకింకా దగ్గర. మన మనస్సుకంటెకూడ భగవంతుడు మనకింకా సన్నిహితుడు. మన కాయన అన్నిటికంటె అతి సన్నిహితు డవటంచేతనే ఆయనను మనం తెలుసుకోలేకుండ ఉన్నాం. ఆడవాళ్ళు కంటికి కాటుకపెట్టుకుంటారు. ఆ కాటుక కంటికి అతిసమీపములో ఉంటుంది. కాని, కన్ను దానిని చూడలేదు. కారణం, 'అతిసామీప్యా దతిదూరాత్'—అతి సమీపంలో ఉన్నా, అతి దూరంలో ఉన్నా వస్తువును గ్రహించలేం. అలాగే పరమాత్మ మనకు అన్ని పదార్థములకంటె అతి సమీపంలో ఉన్నాడు. కాని, మనస్సులో ఉండే మాలిన్యాలు కారణంగా పరమాత్మను మనం తెలుసుకోలేకపోతు న్నాం. పరమాత్మ తత్వం సర్వవ్యాపకం. అది దండలో దారం మాదిరిగా ఉండదు. పూలదండలో దారం పూలకు లోపలే ఉంటుంది. బయట ఉండదు. కాని, పరమాత్మ తత్వం లోపల బైటకూడ వ్యాపించి ఉంటుంది.

అసలు, లోపల వెలుపల అనే భావం స్థూలపదార్థములయందే వర్తి స్తుంది. సూక్ష్మపదార్థములలో యిది వర్తించదు. సూక్ష్మపదార్థం స్థూల ములో చొరబడగలదు. మన శరీరం సావయవం-అంటే అవయవములతో కూడినది, స్థూలమైనది. పరమాత్మ నిరవయం, సూక్ష్మ మైనది. పర మాత్మ, సూక్ష్మతత్వమైన కారణంచేత స్థూలమైన శరీరంలో కూడ అది వ్యాపించి ఉంటుంది. గోడలో గాలి ఉన్నది. ఆకాశం ఉన్నది. గోడలో రెండూ ఉన్నా ఉండటంలో తేడా ఉంది. గాలికంటెకూడ ఆకాశం సూక్ష్మ

తత్త్వం. అందుచేత ఆకాశం గోడలోని ప్రతి అణువుకు లోపల వెలుపల కూడ వ్యాపించి ఉంటుంది. కాని గాలి అలా కాదు. గోడలో ఏర్పడిన సూక్ష్మరంధ్రములందే అది ఉంటుంది. ఇంకొక ఉదాహరణ చెబుతాను. ఇనుపగుండు ఉంది. అది స్థూలం. అగ్ని దానికంటె సూక్ష్మం. సూక్ష్మమైన అగ్ని స్థూలమైన ఇనుపగుండులో వ్యాపించగలదు. ఇనుపగుండును బాగా ఎఱ్ఱగా కాల్చారనుకోండి. అపుడు అగ్ని ఇనుపగుండులో ప్రవేశించి దానిలో అంతటా వ్యాపించి ఉంటుంది. మీరపుడు, గుండును రెండుగా నరికితే, అగ్ని ఇనుపగుండులో ప్రతి అణువులోను వ్యాపించి ఉన్నట్లు తెలిసికొంటారు. అలాగే పరమాత్మ 'తదంత రస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః'-పరమేశ్వరుడు * ఓతప్రోతమై లోపల వెలుపల అంతటా ఉన్నాడు. ఇచట లోపల వెలుపల అనే పదాలు వివరించాలి. అపుడుగాని విషయం పూర్తిగాదు. మనవాళ్లు విగ్రహారాధన చేస్తుంటారు. భగవంతుడు విగ్రహానికి లోపల వెలుపలకూడ వ్యాపించిఉన్నాడు. విగ్రహం భగవంతుణ్ణి నియమించదు. అంటే తానున్నమేరలో భగవత్తత్వం లేకుండ చేయబడదు. ఉదాహరణకు - సముద్రంలో కడవ ముంచాం అనుకోండి. నీరు కడవకు లోపల వెలుపల కూడ నిండి ఉంటుంది. కాని కడవగా చేయబడిన యిత్తడిలోమాత్రం నీరు చొరలేదు. అలాగే రబ్బరుబంతి ఉంది. బంతిలో గాలి కొట్టామనుకోండి. అపుడు బంతికి లోపల వెలుపలకూడ గాలి ఉంటుంది. కాని రబ్బరులో మాత్రం గాలి ఉండదు. మరి పరమ్మాత తత్వం అలా కాదు. అన్ని పదార్థములల్లోను అణువణువునా అది చొచ్చుకుపోయి ఉంటుంది. అలాగైతే అది

---

* ఓతప్రోతమంటే పడుగు పేక అని. వస్త్రంలోని నిలువు పోగులను పడుగు అని, అడ్డుపోగులను పేక అని అంటారు. నిలువుపోగులు అడ్డుపోగులుకలిసి వస్త్రం తయారుచేయబడతాయి. దీన్నే ఓతప్రోతం అంటారు.

ఆకాశపదార్థమా ? అని అడుగవచ్చు. కాని, అది ఆకాశముకంటె కూడ యింకా సూక్ష్మతత్త్వం ! ఆకాశం శబ్దగుణం కలిగింది. * పరమాత్మ అలాంటిది కాదు.

పరమేశ్వరుడు విగ్రహానికి లోపల వెలుపల వ్యాపించి అంతటా ఉన్నాడని మీరంటున్నారుకదా ! మరి విగ్రహాన్ని మనమెందుల కుపాసింప రాదు. అని మీరడగవచ్చు. దానికి నేను, విగ్రహాన్ని పూజించితే అది విగ్రహారాధనే అనిపించుకుంటుంది గాని, పరమేశ్వరారాధన ఎలా అవుతుంది అంటాను. పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వజగన్నియామకుడు, సుసూక్ష్ముడు. మరి విగ్రహంలో యీ లక్షణాలేవీ లేవు. అది జడము. మనవాళ్ళు విగ్రహాలకుచేసే పూజా పురస్కారములను ఒకమాటు విమర్శాత్మక దృష్టితో పరిశీలించి చూస్తే నిజానికి వారు పరమేశ్వరుణ్ణి ఉపాసించడం లేదనియు, కేవలం విగ్రహాన్నే పూజించుతున్నారనియు మనకు విదితమవుతుంది.

విగ్రహారాధన చేసేవాళ్ళు ఏమి చేస్తారు ? తమ యిష్టదేవతను విగ్రహంలోనికి ఆవాహనం చేస్తారు. ఆవాహనమంటే పిలవడం. తరువాత షోడశోపచారాలు చేస్తారు. షోడశోపచారాలంటే ఏమిటి ? చూడండి, మన యింటికి బంధువులు వస్తారు. వారిని లోపలకు రండీ అని మర్యాద చేసి పిలుస్తాము. లోపలకు వచ్చిన తరువాత అందరూ బాగున్నారా అని కుశలప్రశ్నలు వేస్తాం. కాళ్ళు కడుగుకోవడానికి నీళ్ళు (పాద్యం) యిస్తాము. [illegible] కూర్చోండి అని ఆసనం యిస్తాం. మీకు మంచినీరు

---

* "అశబ్ద[illegible]ర్శ మరూప మవ్యయం
తథా రసం నిత్య మగంధవచ్చ యత్ ...." కఠ. ౩-౧౫.

బ్రహ్మము శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లను గుణములకు ఆస్పదములగు ఆకాశాది పంచభూతములకు భిన్నమైన సూక్ష్మతత్త్వము. అది నాశము లేనిది.

కావాలా అని అడిగి అవసరమంటే త్రాగడానికి మంచినీళ్ళు యిస్తాం. స్నానంచేయుమని నీళ్ళతోడి వస్త్రం యిస్తాం. స్నానమైన తరువాత, లక్షణంగా భోజనం పెడతాం. భోజనానంతరం తాంబూలం యిస్తాం. కొలది సేపు విశేషాలు మాట్లాడుతాం. తరువాత, మీరు చాలదూరంనుండి వచ్చారు, పాపం అలసిపోయినట్లున్నారు. కొంచెంసేపు విశ్రాంతి తీసికోండి అని పడకవేస్తాం. రెండుమూడు రోజులు చూస్తాం. తరువాత, మీరేంపనిమీద వచ్చారు ? పని అయిపోయిందా, సరే యిక వెళ్ళండి అంటాం. (సభలో నవ్వులు). అలాగే, ఆవాహనం దగ్గరనుండి ఉత్సర్జనం వరకూ చేసిన మర్యాదలు షోడశోపచారాలు. ఇవన్నీకూడ దేవునిపేరుతో విగ్రహానికి చేస్తారు. ఆవాహనం చేసినపుడు దేవుడువచ్చి విగ్రహంలో కూర్చుంటాడట. మళ్ళీ, ఉత్సర్జనం చెప్పగానే ఆయన విగ్రహం విడిచి వెళ్ళుతాడట. (ఉత్సర్జనం అంటే విడిచిపెట్టడం) నిజంగా ఆవాహనం చేసినపుడు దేవుడు వచ్చి విగ్రహంలో కూర్చుంటే, విగ్రహం చైతన్యవంతమై కదలినట్లుగాని, మాట్లాడినట్లుగాని కనపడాలి. కాని అదేమీ లేదు. సర్వవ్యాపకుడైన పరమేశ్వరుడు విగ్రహంలోకి ఎలావచ్చి కూర్చుంటాడు ? అసలు అంతకుముందు తాను విగ్రహంలో లేకపోతేగదా! వీళ్ళు ఆవాహన చేయగానే వచ్చికూర్చోడానికి? మళ్ళీ వెళ్ళిపో (ఉత్సర్జనం) అనగానే ఆయన విగ్రహం విడిచి వెళ్లుతాడట. ఎక్కడకు వెళ్తాడు ? సర్వవ్యాపక పదార్థం ఎక్కడికి కదులుతుంది? ఎక్కడికి పోతుంది? వీళ్ళు రమ్మని పిలువగానే రావడానికి యిక వెళ్ళిపో అనగానే వెళ్ళడానికి భగవంతుడే... నౌకరా? చాకరా ? ఆయన కింకేమీ పనిలేదా ? ఊరికే అటుయిటు...గడమేనా ? గుడిఒకటి కట్టి దానిలో రాతివిగ్రహం పెట్టి దేవుణ్ణి ప్రతిష్ఠ చేస్తున్నాం అంటారు! వీళ్ళు సర్వవ్యాపకుడైన భగవంతుణ్ణి అచట ప్రతిష్ఠచేసేవాళ్ళా ? గుడి తలుపులు మూసి ఆయనను బంధిస్తారా ? రాతివిగ్రహం కనుక ఉలకదు, పలకదు. అందుచేత గుడికి తాళంవేసినా ఊరుకుంటుంది. ఉక్కపోసినా ఊరుకుంటుంది. (సభలో నవ్వులు). విగ్రహానికి మేము ప్రాణ

ప్రతిష్ఠ చేస్తున్నాం అంటారు. దీనిలో ఏమైనా అర్థముందా ? నిజంగా విగ్రహానికి ప్రాణమేవచ్చి, భక్తులు సమర్పించే నైవేద్యాదులు తినడం మొదలుపెడితే, అసలు పూజారులకేమైన మిగులుతుందా అని. 'రాళ్ల దేవుళ్ళైన రాసులు మ్రింగవా' అన్నాడు వేమన (సభలో నవ్వులు). ఆకలిగొన్నవాడికి పట్టెడన్నం పెట్టం. గుడిగోపురాలకు ఎంతైనా ఖర్చు చేస్తాం. ధార్మికతంటే యిదేనా? దేవుణ్ణి స్నానం చేయించుతున్నాం అని చెప్పి (విగ్రహానికి) మూతితుడుస్తారు, ముక్కుతుడుస్తారు. కళ్ళు, ఒళ్ళు కడుగుతారు. దేవుడు మైలపడతాడా! నిజానికి దేవుడే మైలపడితే ఆయనను నిర్మలం చేసేవాళ్ళమా ? (సభలో నవ్వులు). మన యిండ్లలో చిన్నపిల్లలు పెండ్లిండ్లఆట ఆడుతుంటారు. బొమ్మలన్నీ ఒకచోటపెట్టి ఒక బొమ్మకు తాళిబొట్టు కట్టి యిది పెళ్ళికూతురంటారు. ఇంకొక బొమ్మను పెండ్లికొడుకును చేస్తారు. పెండ్లయిన తరువాత యీ రెంటిని ఒకచోట పడుకోబెట్టి, పెండ్లికొడుకు పెండ్లికూతురు యిపుడు ఏకాంతసేవలో ఉన్నారనిచెప్పి ఇలా ఆటలాడుతుంటారు. అలాగే మన ఆలయాల్లో దేవుళ్ళకు పాపం నిత్యం పడకలు, ఏకాంతసేవలు ఏర్పాటుచేస్తుంటారు పూజారులు! విగ్రహాలను ఒకచోట పడుకోబెట్టి వింజామరలు వీస్తుంటారు. జోలలుపాడి దేవుళ్ళను నిద్రపుచ్చుతారు, మళ్ళీ మేలుకొలుపులు పాడుతుంటారు, తెల్లవారింది యికనైనా లెమ్మని! మరి దేవుడు అంత మొద్దునిదుర పోతాడు కాబోలు! (సభలో నవ్వులు). * "భగవంతుడు నిత్య జాగరూకుడు, అనుక్షణం ఆయన సర్వ[illegible]హించుతుంటాడు" అని మనకు వేదశాస్త్రాలు బోధిస్తుంటే వీళ్ళు [illegible] నిద్రపుచ్చనిదే వదలిపెట్టరు. మళ్ళీ ప్రతిరోజూ మేలుకొలుపులు పాడవలసిందే. ఇంకొక విశేషం. మనవాళ్ళు దేవుళ్ళకు

---

* "య ఏష సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః...."

కఠ. ౫-౮

ప్రతియేటా పెండ్లిళ్ళు చేస్తుంటారు. అపుడు అమ్మవారికి మెడలో పూజారే తాళి కడుతుంటాడు! పాపం ! దేవుడేమీ పట్టించుకోడు. 'ఎవరు కడితే ఏమి పోయిందిలే తాళి' అనుకుంటాడో ఏమోమరి. ఇలా ప్రతియేటా దేవునికి పెండ్లి చేస్తుంటారు. ఆయన భార్యకు ఏటా విడాకు లిస్తాడోయేమో! (సభలో నవ్వులు).

ఇలా దేవుణ్ణి మనవాళ్ళు ఒకపెద్ద సంసారినిచేసి పెట్టారు. సృష్టి స్థితి లయ కారకుడు, సర్వజ్ఞుడు అయిన భగవంతుణ్ణి ఎంత అధమ స్థితికి దిగలాగారో చూడండి. అసలైన పరమేశ్వరుణ్ణి మరచి, విగ్రహాది జడ మూర్తులను ఎలా పూజిస్తున్నారో చూడండి. నిజానికి విగ్రహారాధన ఒక విధంగా చూస్తే ఆత్మవంచనకూడ.

అందుచేత పరమేశ్వరుని తత్త్వమేమిటో, ఆయన స్వరూప స్వభావాలేమిటో అనుభవపూర్వకంగా తెలిసికోవాలంటే, యోగమార్గం అనుష్ఠించాలి. యమ నియమాదులను ఆచరించడమే ముక్తికి మార్గం. ఇక వేరే మార్గం లేదు. 'నాఽన్యః పంథా విద్యతేఽయనాయ' - పరమాత్మ జ్ఞానానికి మించి తరించడానికి వేరు మార్గంలేదు. మిగిలింది రేపు.

---

గుంటూరు, 29-12-1968
ఆదివారం సా. 6-00 గం.

మ హా జ ను లా రా !

"తదేజతి తన్నైజతి...." అనే మంత్రంలో పరమేశ్వర తత్త్వాన్ని గురించి నిన్న కొంతవరకు చెప్పుకున్నాం. ఇపు డింకొక మంత్రం చెప్పుకుందాం.

యస్తు సర్వాణి భూతాన్యాత్మ న్యేవానుపశ్యతి
సర్వభూతేషు చాత్మానం తతో న విచికిత్సతి॥ ౬

భావార్థము :- సర్వవ్యాపియు, న్యాయకారియు, సర్వజ్ఞుడు, సనాతనుడు, సర్వాత్మయు, అంతర్యామియు, సర్వద్రష్టయు నగు పరమాత్మను గుర్తించి సుఖదుఃఖము లందును, హానిలాభము లందును తనతో తుల్యముగ ఎల్లప్రాణములను ఎరుంగు విద్వాంసుడు ధార్మికుడగును. అతడే మోక్షమున కర్హుడగును. ముక్తుడగును.

భూతము అంటే తయారయిన వస్తువు. 'భూ' ధాతువున కర్థము ఉనికి. చేతనా చేతనములు, స్థావరజంగమములు యివన్నీ భూతము లన బడతాయి. వీటిలో పరమేశ్వరుడు వ్యాపించి ఉన్నాడని తెలుసుకోవాలి. మనకు ఈ సృష్టినిగూర్చి, పరమేశ్వరుని గూర్చి చాల సందేహాలు కలుగుతాయి. పరమేశ్వరుడు సర్వవ్యాపకుడవునా, కాదా ? సర్వజ్ఞుడవునా, కాదా? అనునివి సందేహాలు.

కర్తలేనిచోట కార్యము జరుగదు. ఈ సృష్టికార్యము. అణువులు మొదలు బ్రహ్మాండము వరకు అంతటా జరుగుచున్నది. కాబట్టి దీనికర్త అయిన పరమేశ్వరుడు అంతటా వున్నాడని నిన్న తెలుసుకున్నాం. మనుష్యుడు తానెంతటి విజ్ఞానియైనా అతనికి అన్ని విషయాలు తెలియవు. అతని విజ్ఞాన[illegible]పూర్ణత ఉండదు. పరమేశ్వరుడు ఒక్కడే సంపూర్ణజ్ఞాని. మనకు బి[illegible]తెలియని విషయంలోగాని పూర్ణంగా తెలిసిన విషయంలోగాని సందేహం కలుగదు. కొంత తెలిసి, కొంత తెలియని విషయాన్ని గురించే సందేహం కలుగుతుంది. భగవంతుని విషయంలో మనకు సందేహం కలుగడానికి కారణం ఆయననుగూర్చి మనకు స్వల్పంగా తెలుసు. చాల భాగం తెలియదు. కావున పరమేశ్వరుని విషయమున సందే

హాలు కలుగును. సందేహనివృత్తికై యత్నించువాడు యమ నియమాలతో పాటు – శమము, దమము, తితిక్ష, ఉపరతి అనునవియు సంపాదించాలి.

శమము, దమము రెండూ ఇంద్రియ నిగ్రహానికి సంబంధించినవి. దమము– బాహ్యేంద్రియ నిగ్రహము. దమము అంటే అణచుట అని అర్థం. నేత్రాది జ్ఞానేంద్రియములను, వాక్కు మొదలైన కర్మేంద్రియములను నిగ్రహించుట దమము. బాహ్యమున ఉన్న ఇంద్రియములు కాక లోపల ఇంకొక ఇంద్రియము కూడ ఉంది. అది మనస్సు. అది మహావేగవంతమైనది. దానిని నిగ్రహించడం 'శమము' అనబడుతుంది. ఇంద్రియ జయము ఒకనాటితో చేకూరునది కాదు. అంత సులభము కాదు. నిరంతరం దీర్ఘ కాలం సాధనం చెయ్యాలి. దీర్ఘకాలమంటే యావజ్జీవితమునని. అప్పుడప్పుడు చేసే సాధనలవలన ఇంద్రియములు మనకు లోబడినట్లు కనబడినా, మనకు సంపూర్ణ ఇంద్రియ నిగ్రహం కలిగిందని భ్రమపడ రాదు. ఇంద్రియములు మనలనెప్పుడు బోల్తా కొట్టించుతాయో తెలియదు. నిరంతరం చాల జాగరూకులమై ఉండాలి.

మనసు వాయువువలె అతి చంచలమైంది. దాని నెలా నిగ్రహించాలి? అని అర్జును డడిగితే కృష్ణు డంటాడు.

అసంశయం మహాబాహో ! మనో దుర్నిగ్రహం చలమ్,
అభ్యాసేన తు కౌంతేయ ! వైరాగ్యేణ చ గృహ్యతే॥

గీ. ౬–౩౫

అర్జునా ! మనస్సును నిగ్రహించుట సులభము కాదని నీవు చెప్పిన దానిలో సందేహం ఏమాత్రం లేదు. దానిని నిగ్రహించుట అత్యంత కఠినమే. కాని అభ్యాసవైరాగ్యములవలన దానిని వశపరచుకొనవచ్చును, అంటాడు కృష్ణుడు. అందుచేత మనస్సును నిగ్రహించడం కష్టం కావచ్చుగాని "అసంభవం" మాత్రం కాదని మనం గుర్తుంచుకోవాలి,

ఒక మిత్రుడు నన్నడిగాడు- ఏమండీ ఆకారంలేని వస్తువునుగూర్చి మనం ధ్యాన మెలా చెయ్యగలం? ఒక రూపము ఉంటేగదా మనస్సును దానిపై నిలుపగలం అన్నాడు. సామాన్యంగా యీ సందేహం గుళ్ళ గోపురాలకు వెళ్ళేవారికి కలుగవచ్చు. మనోనిగ్రహం అంటే ఏమిటి? మనస్సును కదలకుండా చెయ్యడం. మీరు ఏ విగ్రహంపైనో దృష్టి నిలిపారనుకోండి. అపుడేమవుతుంది? మనసుద్వారా బొమ్మను చూస్తారు. అప్పుడు బొమ్మ కళ్ళు, ముక్కు, చెవులు, ఇతరావయవములు అన్నీ కనబడతాయి. అప్పుడు మనసుకు ఏకాగ్రత యెక్కడ కలిగింది? కనుక అసలు మనస్సును దాని స్థానమునుండి బయటికి కదలనీయకుండా ఉండటం మనోనిగ్రహం అవుతుంది.

భగవద్గీతలో నిత్యాభ్యాసాన్ని గురించి ధ్యానయోగంలో యిలా చెప్పారు.

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః
నా త్యుచ్ఛ్రితం నాతినీచం చై లాజిన కుశో త్తరమ్॥

గీ. ౬-౧౧

తత్రైకాగ్రం మనః కృత్వా యతచి త్తేంద్రియ క్రియః
ఉపవిశ్యాసనే యుంజాద్ యోగమాత్మ విశుద్ధయే॥

గీ. ౬-౧౨

సమ[redacted] శిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః
సంప్రేక్ష్య[redacted]గ్రం స్వం దిశశ్చా నవలోకయన్॥

గీ. ౬-౧౩

'యోగం యుంజ్యాత్' - నిత్యం యోగం చెయ్యాలి. మనసును పవిత్రం చేసుకోవాలి. ఏకాగ్రత నలవరచుకోవాలి. అపుడు మనస్సుద్వారా సూక్ష్మ వస్తుజ్ఞానం కలుగుతుంది. అంతేగాని నిత్యం "ధర్మక్షేత్రే కురు

క్షేత్రే సమవేతా యుయుత్సవః, మామకాః పాండవాశ్చైవ కి మకుర్వత సంజయ" (ఈశ్లోకాన్ని శ్రీ గోపదేవేవ్‌గారు పెద్దగా కంఠంయెత్తి ఒక లయలో విలక్షణంగా ఉండేట్లు చదివారు. సభికులలో నవ్వులు వినవయ్యేను) అని పెద్దగా చదివినందువల్ల మోక్షం వస్తుందని కొందరెంచుతారు. శ్లోక పఠనంవల్ల ముక్తిరాదు. 'శుచౌ దేశే' – యోగాభ్యాసం చెయ్యడాని కనువుగా యింట్లో ఒక ప్రత్యేకస్థలం ఉండాలి. అది పరిశుభ్రంగా ఉండేట్లు చూచు కోవాలి. 'స్థిరం ఆసనం ప్రతిష్ఠాప్య' – అక్కడ కదలకుండా ఉండే ఆస నాన్ని ఏర్పాటుచేసుకొని ఎక్కువసేపు కూర్చుండుటకు ప్రయత్నం చెయ్యాలి. తూగుటుయ్యాలలు, ఈజీచైర్‌లు యివి పనికిరావు. (సభలో నవ్వులు). 'చైలాజిన కుశోత్తరమ్' – ఆ ఆసనంపై వస్త్రము, మృగ చర్మము దర్భలు వరుసగా ఒకదానికంటె మరియొకటి క్రింద ఉండేట్లు వేసికోవాలి. మృగచర్మమునకు బదులు కంబళి పరచుకోవచ్చు. (మృగ చర్మము, స్వయంగా చచ్చిన లేడిదైతే వాడాలి).'నాత్యుచ్ఛ్రితం నాతినీచం'– ఆసనం ఎక్కువ ఎత్తుగాగాని మరీ గుంటలోగాని ఉండరాదు. ఎత్తుబల్లపై యోగంచేస్తే నిద్రవచ్చినపుడు పడితే పళ్ళూడతయ్. (సభలో నవ్వులు). మరీ గుంటలోనేమో వేడి ఎక్కువవుతుంది. కనుక సమతలముగానున్న ఆసనంపై కూర్చోవాలి. ఆసనాలు చాలా ఉన్నాయి. శరీరారోగ్యానికి పనికి వచ్చే ఆసనాలుకూడ ఉదయం కొలదిసేపు అభ్యసించవచ్చు. ఇవికాక అసలు ముఖ్యమైన ఆసనాలు రెండున్నాయి – సిద్ధాసనం, పద్మాస[illegible]ః రెంటిలో ఎక్కువకాలం సుఖంగా కూర్చుండుటకు తనకు [illegible] ఆసనమేదో సాధకుడు నిర్ణయించుకోవచ్చు. అలా నిర్ణయించుకొని నిత్యం ఆ ఆసనంలోనే కూర్చుండి యోగం అభ్యాసం చెయ్యాలి. కనీసం, తక్కువలో తక్కువ ఒక అరగంటైనా కదలకుండా కూర్చుండగలిగే స్థితి సంపాదించాలి. ఎక్కువలో ఎక్కువ 3 గంటలవరకు కూర్చోవచ్చు. మొదటిరోజు అయిదు నిమిషాలతో

ప్రారంభించి క్రమంగా అరగంటవరకు ఆసనములో కదలకుండ కూర్చొన గలిగే స్థితి సంపాదించాలి. యోగాభ్యాసంలో అభిరుచి కలిగే కొలది యింకా కాలం పొడిగించవచ్చు. ఇది మెల్లమెల్లగా సాధించాలి. అంతేగాని మొదటిరోజే 2 గంటల సేపు ఆసనంలో కూర్చొని కాళ్ళు నొప్పులు పుట్టినవని చెప్పి, గోపదేవ్‌గారు చెప్పిన యోగాభ్యాసం కష్టమే ననుకొని అసలు అభ్యాసం చెయ్యడం మానరాదు. (సభలో నవ్వులు). 'సమం కాయ శిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః' - శిరస్సు. మెడ, మేరుదండము (వెన్నుపాము) వీనిలో వంపులేకుండా సమంగా ఉండేట్లు కూర్చోవాలి. మేరుదండములో వంపు ఉండరాదు. వంపుంటే వంకర ఆలోచనలు వస్తాయి. నిటారుగా కూర్చోవాలి. 'దిశ శ్చానవలోకయన్' - దిక్కులేమి చూడరాదు. 'సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం'- నాశికాగ్రమంటే ముక్కు చివరిభాగం. భ్రూమధ్యముగాని, ముక్కుకొనగాని యీ తావు లందు ఏదో ఒకచోట, 'ప్రేక్ష్య'-చూడాలి. 'సంప్రేక్ష్య'-అంటే యింకా బాగా చూడాలి. కాని ఎవరిముక్కు? బొమ్మనో లేకపోతే పటమునో ఎదురుగా పెట్టుకొని దానిముక్కు చూడరాదు. లేక భార్యను పిలిచి, ఏమేః కాసేపు నీవు అలా ఎదురుగా కూర్చో. నీముక్కు చూస్తూ నేను ధ్యానం చెయ్యాలి, అని చెప్పి భార్యాభర్తలు ఎదురెదురుగా కూర్చుండి పరస్పరం ముక్కులు చూచుకోవడం కాదు. (సభలో నవ్వులు). 'స్వం నాసికాగ్రం'- అందుకనే తన ముక్కుకొననే చూడుమన్నాడు. అలా చెప్పకపోయినట్ల యితే, భార్య [illegible] బోటివాడి గతేంకాను. (సభలో నవ్వులు). అలా తన నాసికాగ్రాన్ని చూస్తూ [illegible] 'యత చిత్తేంద్రియ క్రియః' - ఇంద్రియములయు మనస్సుయొక్కయు వ్యాపారములు కట్టిపెట్టి, 'న కించి దపి చింతయేత్'- ఏమీ చింతించరాదన్నాడు. చింతించడం అంటే ఆలోచించడం. మనస్సులో ఏవిధమైన వృత్తులు (సంకల్పములు) లేకుండ ఉండటం. ఇది అసలు యోగం చెయ్యవలసిన పద్ధతి. మన యోగులు మనస్సును ధారణ

చేయుటకు (నిలుపుటకు) శరీరంలో కొన్ని ప్రదేశాలు చెప్పారు. భ్రూమధ్యం, హృదయం, కంఠం, నాభి, శిరస్సున్నూ. ఈతావుల్లో ఎక్కడైనా మనస్సును నిలుపుటకు అభ్యాసం చెయ్యవచ్చు.

తితిక్ష:- తితిక్ష అంటే ద్వంద్వసహనము. శీతోష్ణములు, లాభాలాభములు, జయాజయములు, సుఖదుఃఖములు యిలాంటివన్నీ ద్వంద్వములు. వీటిని సహించే గుణం మనలో వృద్ధిచేసుకోవాలి. బాగా సంతోషం కలిగినా బాగా దుఃఖం కలిగినా మనకు కండ్లవెంట నీళ్ళు వస్తాయి. ఇవి రెండూ వికారాలే. మనం వీటికి లోనుకాగూడదు. ద్వంద్వాదులను సమానంగా అనుభవించడం అలవాటు చేసికోవాలి. మనకేదైనా కష్టమొస్తే యిరుగు, పొరుగు వారిని కూడ నిద్రపోనియ్యం. ఏడుపులు పెడబొబ్బలు పెడతాం. (సభలో నవ్వులు). సుఖం వచ్చినా దానిని యితరులకు తెలుపకుండా ఉండలేము.

ఉపరతి:- ఉరపతి అంటే వైరాగ్యం అని అర్థం. నిర్లిప్తుడై ప్రపంచమునందు వర్తించడం వైరాగ్యం అవుతుంది. ఇవన్నీ గుర్తుపెట్టుకని సాధించాలి. ఇవి సాధించితే ఆత్మదర్శనానికి యోగ్యుడవుతాడు.

మనకు ఆత్మ దర్శనం ఎందులకని కావడంలేదు? మనస్సులో మాలిన్యములున్నందున. ఆ మాలిన్యము లేవి? ఈర్ష్య, పరాపకారబుద్ధి, అసూయ, అసహనము. ఇవి మనసులో లేకుండా చేసుకోవాలి. అప్పుడు మనస్సు పవిత్రమై ఆత్మదర్శనానికి యోగ్యమై ఉ[illegible]. మొదటిది ఈర్ష్య. తోటి వాళ్ళకు తనకంటె ఎక్కువ స[illegible]టె మనుష్యుడు ఈర్ష్య పడతాడు. ఈ దుర్గుణాన్ని జయించడం ఎలా? తోటి వారితో * 'మైత్రి' కలిగి యుండటమే దీనిని జయించడానికి ఉపాయం. మిత్రుని

* మైత్రీ కరుణా ముదితో పేక్షాణాం సుఖదుఃఖ పుణ్యాపుణ్య విషయాణాం భావనాత శ్చిత్త ప్రసాదనమ్ ॥ యో. ద. ౧-౩౩

అభివృద్ధికి ఓర్వలేని స్నేహితు డుండడు గదా! తరువాత పరాపకారబుద్ధి. బాధలుపడే వాళ్ళను (దుఃఖితులను) చూచి దయ కలగాలి. దీనినే 'కరుణ' అంటారు. వారికి ఆర్థికంగాగాని, శారీరకంగాగాని చేతనైనంత సహాయం చెయ్యాలి. కనీసము మాటలతోనైనా వారిని ఓదార్చాలి. అపుడు వారికి కొంత బలం వస్తుంది. నాకేమిలే అని పట్టించుకోకుండ ఉండటం భావ్యం కాదు. ఇతరులకు మేలుచేసేవానికి యితరులుకూడ మేలు చేస్తారు. ఇలా చేయడంవల్ల పరాపకారబుద్ధి తొలగుతుంది. తరువాత అసూయ. సుఖపడే వాళ్ళను చూచి సంతోషించాలి. కాని తన కది లేదని అసూయ పడరాదు. ఇలా సంతోషించడాన్ని 'మోదం' అంటారు. ఈ గుణాన్ని వృద్ధిచేసు కున్నందువల్ల చిత్తంలో అసూయ అనే మాలిన్యం తొలగుతుంది. మన మిత్రులుగాని, బంధువులుగాని సుఖసంతోషాలతో ఉంటే మనమెంతో ఆనందిస్తాముకదా! తరువాత అసహనం. దుష్టులను చూచినపుడు అసహనము (అమర్షము) కలుగుట లోకసామాన్యము. ముముక్షువు ఒకటి గుర్తుంచు కోవాలి. అతడు దుష్టులకు దూరంగా ఉండాలి. దీనిని 'ఉపేక్ష' భావం అంటారు. ఈ ఉపేక్షాభావం వలన, అసహనమనే చిత్తమాలిన్యం తొలగు తుంది. సాధకు డీవిధంగ ప్రపంచంలో వర్తించడంవల్ల మనస్సు పవిత్ర మౌతుంది. [illegible]డు బాహ్యవృత్తులు నశించి మనస్సు నిలుస్తుంది. ఇది ఒకటే ఉపాయం. మో[illegible] కోరినవారు వీనిని తప్పక ఆచరించాలి. ఇలా మనస్సు పవిత్రమైనపుడు దాని[illegible] సూక్ష్మవస్తువును గ్రహించే శక్తి వస్తుంది. దానితో ఆత్మను దర్శించగలడు. దర్శించడమంటే అనుభవించడం. 'స్వయం త దంతఃకరణేన గృహ్యతే' – ఆత్మపదార్థమును ఎవరికి వారు స్వయంగా తమ అంతఃకరణముద్వారా తెలిసికోవలసిందే – అనుభవించవలసిందే. 'యస్తు

సర్వాణి భూతాని ఆత్మన్నేవానుపశ్యతి' – సర్వభూతములలో ఉన్న వ్యాపక తత్వాన్ని ప్రతిక్షణం గుర్తించాలి. ఇదే ఉపాసన అని చెప్పుకున్నాము.

తరువాత ప్రార్థన అంటే ఏమిటో యిపుడు చెప్పుకుందాం. అర్థన అంటే కోరటం. ప్రార్థన అంటే బాగా కోరడం. మనుష్యుడు దేనిని కోరతాడు. తనదగ్గర లేనిది, తనకు తక్కువగా ఉన్నది కోరతాడు. ధనం లేనివాళ్ళు ఉన్నవాళ్ళను కోరి ధనం తెచ్చుకుంటారు. కాని, నిజమైన వైదికుడు భగవంతుణ్ణి వెండి బంగారములు అడగడు. సంపదలు కోరడు. అడిగినవాళ్ళకు సాయిబాబా కాసులు యిస్తాడట. అవి ఎలా యిస్తాడు? తనవద్దనున్న కాసులనే, మీకు కనబడకుండ యిస్తాడు. మరి ఆ యిచ్చే కాసు అయిపోతే ఆయన యింకేంచేస్తాడు? భగవంతుని స్థితి అలాలేదు. పరమేశ్వరుడు యీ భూమిలో రత్నములు, వెండి, బంగారము మొదలైన విలువైన సంపదలుంచాడు. మనకు బుద్ధికూడ ఇచ్చాడు. ఆ బుద్ధితో యివి సంపాదించడానికి ప్రయత్నం చెయ్యాలి. అంతేగాని, భౌతికపదార్థాల నిమ్మని భగవంతుణ్ని అడగడం ప్రార్థనకాదు. మనం నిత్యం సంధ్యలలో భగవంతుని యిలా ప్రార్థిస్తాము.

ఓం భూర్భువః స్వః, తత్స వితు ర్వరేణ్యమ్॥
భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్॥

యజు–౩౬–౩, ఋ. ౩–౬౨–౧౦.

ఇది నిచృత్ గాయంత్రీమంత్రము. యజుర్వేదము[illegible]. దీనిలో 23 అక్షరాలుంటాయి. 3 పాదాలుంటాయి, ఈ మం[illegible]యత్రీ ఛందస్సులో ఉంది. పూర్వం చిన్ననాడే యీ మంత్రాన్ని గురువులచేత పిల్లలకు చెప్పించేవాళ్లు. పెద్దవాళ్ళకుకూడ యిపుడిది తెలియదు. అసలు శూద్రాదులు యీ మంత్రాన్ని వినరాదు; స్మరించరాదు; అని కొందరు స్వార్థపరులు యిప్పటికీ ప్రచారం చేస్తూనేఉన్నారు. ఇది అందరు గ్రహించ

దగ్గ విషయం. ఈ మంత్రంలో ఉన్నదేమి? ఓం, భూః, భువః, స్వః. ఇవి పరమేశ్వరునికి వాడబడినపదాలు.'ఓం'అంటే రక్షకుడు,'భూః' అంటే ఉనికి కలవాడు.'భువః'అంటేకేవలజ్ఞానస్వరూపుడు.స్వరూపమంటేఆకారమనికాదు. డెఫినిషన్ (Definition) అంటే పెద్దగా చిక్కులేదు. సంస్కృతభాషలో దీనిని 'లక్షణం' అంటారు. పరమేశ్వరుని లక్షణం జ్ఞానం (చిత్) అని, తరువాత 'స్వః'-అంటే ఆనందం. మన సుఖానికి ఆయన సుఖానికి తేడా ఉంది. ప్రాకృతిక పదార్థాల సంయోగంవలన కలిగే సుఖం మనది. ఆయన సుఖం అలాంటిదికాదు. అది ఆనందం – నిత్యసుఖం. కనుక ఓం, భూః, భువః, స్వః అను యీ పదాల్లో మనమేం తెలుసుకుంటాం? పరమేశ్వరుడు సత్, చిత్, ఆనందస్వరూపుడని. 'సత్' అంటే పరమేశ్వరుడు కేవల సత్తా మాత్రుడని, ఆయన ఉనికి భూతభవిష్యత్ వర్తమానకాలముల మూడింటిలో కూడ ఉంటుందని, ఆయన ఒకప్పుడుండి యింకొకప్పుడు లేకుండా ఉండని వాడు కాడని మనం గ్రహించుతాం. తరువాత 'చిత్'. చిత్ అంటే పరమేశ్వరుడు కేవలం జ్ఞానస్వరూపుడని. ఆయనలో అజ్ఞానం అణుమాత్రం కూడ లేదు. ఆయన కేవల జ్ఞానస్వరూపుడు. ఆయన కేవల ఆనందస్వరూపుడు కూడ. దుఃఖం ఆయనలో లేదు.

ఈ మంత్రం రెండుమూడు మారులు చెబితే మీకు వస్తుంది. కొందరికి యిప్పటికే వచ్చిఉంటుందనుకుంటాను. ఈ మంత్రమును ప్రచారము చేసిన ఋషి విశ్వామిత్ర మహర్షి. ఈ మంత్రమునకు దేవత అంటే విషయము సవిత. ఛందస్సు గాయత్రి. 'సవితా' అంటే లౌకికభాషలో సూర్యుడంటారు. కాని వైదికభాషలో ప్రపంచాన్ని సృష్టించేవాడు అని అర్థం. ఇది తెలియక యీ మంత్రం చదువుతూ చాలమంది సూర్యుడికి అర్ఘ్యం యిస్తారు.

ఇది సూర్యునికి సంబంధించిన మంత్రం కాదు. పరమేశ్వరుని

ధ్యానించే మంత్రం. దీనిని సావిత్రీమంత్రమని కూడ అంటారు. 'తత్ వరేణ్యం భర్గః' శ్రేష్ఠమైయొప్పు జ్ఞానానందాదిరూపం వరింపదగినది. 'వయం ధీమహి' - అట్టి పరమాత్మ స్వరూపమును మేము ధ్యానింతుము. 'ధియో యోనః'-(ఆయన) మా బుద్ధులను 'ప్రచోదయాత్' - ప్రేరేపించునుగాక! అంటే మనమీ మంత్రంలో పరమేశ్వరుణ్ణి జ్ఞానమిమ్మని కోరతాం. ఇది వైదికులు పరమేశ్వరునిగూర్చి చేసే ప్రార్థన. ప్రపంచంలో మరేమతంలోను యిలాంటి ప్రార్థన చూడము. ఒక్క వైదికమతస్థులే జ్ఞానము నిమ్మని భగవంతుని ప్రార్థిస్తారు. ఇది గుర్తుంచుకోవాలి.

మహమ్మదీయులు చేసే భగవత్ ప్రార్థన ఏమిటి? - 'లా ఇలాహీ యిల్లిల్లాహ్ ముహమ్మదుర్ రసూలల్లాః' - అంటే ఏమిటి? 'అల్లాతప్ప మరొకటిలేదు. 'మహమ్మదు సందేశహరుడు' (పైగంబర్). దీనిని మహమ్మదీయులు 'పాకేకలాం' - పవిత్రవాణి అంటారు. మరి యీ ప్రార్థనలో భక్తుడు భగవంతుణ్ణి ఏమి కోరుతున్నాడో తెలియదు. క్రైస్తవులు భగవంతు నిలా ప్రార్థిస్తారు. * 'పరలోకమందున్న మా తండ్రీ!' నీ నామము పరిశుద్ధపరచబడుగాక!' 'నీ చిత్తము పరలోకమందు నెరవేరుచున్నట్లు భూమియందును నెరవేరుగాక!' అని ప్రార్థిస్తారు. 'మా అనుదినాహారము నేడు మాకు దయచేయుము' అని అడుగుతారు. ఇక బౌద్ధులకు, జైనులకు అసలు దేవుడు లేడు. కనుక వారు ప్రార్థనచేయరు. ఆహారపదార్థాల కొరకు భగవంతుని ప్రార్థించ నవసరంలేదు. అవి డబ్బిస్తే ల[illegible]తాయి. కాని

---

* "Our Father which art in heaven, Hallowed be thy name. Thy kingdom come. Thy will be done in earth, as it is heaven. Give us this day our daily bread."

— New Testment, Mathai 6-10

జ్ఞానం మనకు బజారులో దొరకదు. అందుచేత మనం భగవంతుణ్ని జ్ఞాన మిమ్మనే ప్రార్థిస్తాం.

ఇంకా ఏమని మనం భగవంతుని ప్రార్థిస్తాం. 'ఓజోఽసి, ఓజో మయిధేహి'- వీర్యంకంటె మించిన తేజస్సు కలది ఓజస్సు. పరమేశ్వర ! నీవు ఓజస్సువు. నాకా ఓజస్సును కలిగింపుమని అడుగుతాం. అలాగే 'మన్యు రసి మన్యుం మయి ధేహి'- నీలో మన్యువున్నది. నాకా మన్యువును కలిగించుమంటాము. మన్యువు అంటె ఒకరకం కోపము. ఇతరులపై కక్షసాధించేది లేక వారికి హాని కలిగించేది క్రోధం అనబడుతుంది. మన్యువు అంటే యితరుల మేలు కోరి వారిపై తనకు కోపమున్నట్లు అభినయించడం. గురువు శిష్యుణ్ని దండించుతాడు. ఎందుకు? శిష్యుని మేలు గోరి. పిల్లలను పెద్దవాళ్ళు కొడతారు. ఎందులకని? వాళ్ళు చెడిపోతారేమో బాగుచేద్దామని. ఇది మన్యు వనబడుతుంది. ఈ మన్యువును మనకిమ్మని భగవంతుని ప్రార్థిస్తాము.

కనుక మనం నిత్యం గాయత్రి మంత్రంతో రెండువేళలా జ్ఞానమును భగవంతునినుండి అర్థించాలి. డబ్బున్నవాడిని అర్థిస్తే వాడు డబ్బు ఇస్తాడు. అలాగే భగవంతుని అర్థిస్తే మనకు జ్ఞానాది కోరికలు నెరవేరుతాయా? అని అడుగవచ్చు. అర్థించడమంటే కోరడమని లేక సంకల్పించడమని అర్థం. [illegible]నం ఒక వస్తువును అర్థించడం ఎప్పుడు జరుగుతుంది? అది మనదగ్గర [illegible] లేక ఉన్నది కొఱతగా ఉన్నప్పుడు. పరమేశ్వరా! మాకు జ్ఞాన మిమ్మ[illegible] అని అర్థించుతాము. ఇది కోరిక. అంటే మనలో జ్ఞానం కొఱతగా ఉన్నదని గుర్తించామన్నమాట. ప్రతిరోజు యిది గుర్తించడం నేర్చుకోవాలి. కాని అంతటితో ఊరుకుంటే లాభంలేదు. తనలోని కొఱత ఏమిటో గుర్తించి, తన కది కావాలని కోరిన తరువాత దాన్ని సాధించడానికి ప్రయత్నం చెయ్యాలి. ప్రయత్నం చెయ్యకుండా కోరికలు

తీరవు. మరి ప్రయత్నం చేయడంవలన కోరికలు తీరితే, అసలు భగవంతునితో మనకు ప్రసక్తి యేల అని అడుగవచ్చు. అంటే యిక్కడొక చిక్కుంది. నాలో జ్ఞానం తక్కువని నాకెప్పుడు తెలుస్తుంది? నాకంటె అధికజ్ఞానం కలవాణ్ణి గుర్తించినప్పుడు. (తమ చేతి రెండువ్రేళ్ళను చూపుతూ) ఇక్కడ రెండు వ్రేళ్ళున్నాయి. వీటిల్లో ఒక వ్రేలును ముడిచాను. అది పెద్దదో చిన్నదో మనకు తెలియదు. కాని ప్రక్కన రెండవ వ్రేలుకూడ ఉన్నదనుకోండి. అపుడు ఆ రెంటిలో ఉండే తారతమ్యము తెలుస్తుంది. ఏది పెద్దదో ఏది చిన్నదో చెప్పగలం. అలాగే మనకుండే జ్ఞానం కొఱత గలదని మన కెపుడు తెలుస్తుంది? మనకంటె మించిన జ్ఞానవంతుని మనం గుర్తించినప్పుడు. 'అధోధః పశ్యతః కస్య బలవాన్ నోపచయ్యతే'-(పంచతంత్రం) అంటే తనకంటె క్రిందివాణ్ని చూచుకుంటే తాను బలవంతుడుగా కనబడతాడు. తనకంటె ఎక్కువ వాళ్ళను చూచుకుంటే తాను తక్కువగా కనబడతాడు. మరి ప్రపంచంలో సంపూర్ణ జ్ఞాని ఎవరూలేరు. ప్రతివారికి ఏదో ఒక కొఱత ఉండనే ఉంటుంది. కనుక మనం వారితో పోల్చుకోవడంకంటె సంపూర్ణజ్ఞానియైన పరమేశ్వరునితోనే పోల్చి చూచుకొని మనలో ఏమేమి కొఱత లున్నయ్యో గుర్తించడం ఉత్తమం. అంటే మనం భగవంతుణ్ణే ఆదర్శంగా పెట్టుకోవాలి. ఆయన్ని ఆదర్శంగా పెట్టుకొని, మన కొఱత లేమిటో గుర్తించి మనం కోరువాటిని సంపాదించడానికి స్వయంగా ప్రయత్నం చెయ్యాలి. ఇదే ప్రార[illegible]ండే విశేషం.

తరువాత స్తుతి చేయుట అంటే స్తోత్రం చేయడం లేక కీర్తించడం. పరమేశ్వరునిలో న్యాయము, దయ, జ్ఞానము ఇత్యాది గుణములనేక మున్నాయి. ఇవి భగవంతుని గుణాలు. వీటిని మనం స్తుతి చేసిన కొలది ఈ గుణాలు మనలో వృద్ధి పొందుతాయి.

భక్తులు కొందరు తిరుపతి వేంకటేశ్వరుని, అలివేలు మంగమ్మను ప్రార్థించుతుంటారు. కొన్నాళ్ళు వెంకటేశ్వరస్వామిని ప్రార్థిస్తారు, నాకు అది కావాలి, ఇది కావాలి అని. కానీ ఏమీ ప్రయోజనం ఉండదు. ఇక ఈయనతో లాభం లేదని చెప్పి అలివేలు మంగమ్మ దగ్గరకు వెళ్ళుతారు, 'రికమండేషన్'కోసం. అమ్మా! ఓ అలివేలు మంగా! మీ భర్తగారైన శ్రీ వేంకటేశ్వర్లు నా ప్రార్థన నేమీ ఆలకించడం లేదు. తల్లీ! నీవైనా చెప్పి చూడవమ్మా! అపుడపుడు కొండ దిగి ఆయన ఏ అర్థరాత్రో నీతో ఏకాంత సేవకు వచ్చినపుడు కాస్త నా సంగతి వారికి విన్నవించు తల్లీ! (సభలో నవ్వులు) అని ప్రార్థిస్తారు. పాపం అలివేలు మంగమ్మ చెబితే మాత్రం ఆయన ఎందుకు వింటాడు? అసలు ఆమె ఆయనమీద అలిగి, కొండ దిగి వచ్చి వేరే ఉంటున్నది గదా! మరి వేంకటేశ్వరస్వామి అయినా ఏదో ఆమెతో రాజీపడి పైకి తీసుకొని వెళ్ళడాయె! పోనీ ఆమెకైనా బుద్ధి కలిగి పైకి వెళుతుందంటే అదీ లేదాయె. (సభలో నవ్వులు). మరి యీ భక్తుల కోరికలు ఎలాతీరుతవో! ఒకవేళ ఎవరైనా చూస్తే బాగుండదని చెప్పి, ఎవరికీ తెలియకుండ ఆయన అలివేలు మంగమ్మ దగ్గరకు అప్పుడప్పుడు వెళ్ళి వస్తుంటాడేమో తెలియదు! (సభలో నవ్వులు).

నేడు ఆస్తిక్యం యీ స్థితిలో ఉంది. మనలను భౌతికవాదులు, కమ్యూనిషులు విమర్శించు తున్నారంటే అందులో తప్పేముంది? ఆస్తిక్యం వెర్రితలలు [redacted]. M. A. చదివేవాడు, తాను పాఠాలు చదివితే ప్యాస వుతానను కో[redacted]పతి కొండెక్కి బుర్ర గొరిగించుకుంటే పరీక్షలలో ప్యాసవుతా ననుకుంటాడు. (సభలో నవ్వులు). అతనికి తన మీద, తన ప్రయత్నంమీద విశ్వాసమే లేకుండా పోయింది.

'సర్వభూతేషు చాత్మానం తతో న విచికిత్సతి' – ఎవడు సమస్త ప్రాణులలోను, ప్రకృతి మొదలు పృథివివరకు గల అన్ని పదార్థము

లందును వ్యాపకుడైన పరమాత్మను ఎఱుగునో అతడు సందేహమును పొందడు. ఇంకొక్క విషయం చెప్పి మిమ్ములను వదలిపెడతాను.

(శ్రీ గోపదేవ్‌గారు ఉపనిషత్తుల గ్రంథాన్ని తమ చేతిలో నిడుకొని తెఱచి చదువుతూ) ముండకోపనిషత్తులో ఒకచోట యిలా చదువుతాము –

శౌనకో హవై మహాశాలోఽఙ్గిరసం విధివ దుపసన్నః
పప్రచ్ఛ, కస్మిన్ను, భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి॥
ముం. ౧-౧-౩

'శౌనకోహవై' – పూర్వం శునక మహర్షి కుమారుడైన, 'మహాశాలః' గొప్ప సంపన్న గృహస్థు డొకడు, అంగిరసుడనే మహర్షి దగ్గరకు వెళ్ళాడు. ఎలా వెళ్ళాడు? 'విధివత్' – విధి ననుసరించి గురువు దగ్గరకు వినయంతో వెళ్ళాలి. ఇది మన ప్రాచీన ఋషి సంప్రదాయం. మనం ధార్ష్ట్యంతో జ్ఞానం సంపాదించలేం. వినయం అవసరం. ఇంకా అతనిలా వెళ్ళాడు –

తద్విజ్ఞానార్థం స గురుమే వాభిగచ్ఛేత్,
సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మ నిష్ఠమ్॥

విజ్ఞానం కొఱకు గురువుగారి దగ్గరకు వెళ్ళాడు. ఏమి తీసికొని వెళ్ళాడు? 'సమిత్పాణిః' – అగ్నిలోవేసే పుల్లలు తీసికొని [illegible]ని అర్థం. అంటే ఆరోజుల్లో అగ్నిహోత్రాలు ఋష్యాశ్రమా[illegible]దేవన్నమాట. గురువు ఎలాంటివాడై ఉండాలి? విజ్ఞానవంతుడై ఉండాలి. అంటే అతడు శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడుగా ఉండాలి. శ్రోత్రియుడంటే వేదవిదుడు– వేదశాస్త్రములను బాగాచదువుకొని అర్థసహితంగా, క్షుణ్ణంగా శిష్యునికి చెప్ప గలిగి ఉండాలి. తరువాత బ్రహ్మనిష్ఠుడైకూడ ఉండాలి. అంటే వేదములను బాగా చదువుకొని కేవల శబ్దార్థ జ్ఞానమున్నా లాభంలేదు. అతడు సామాన్య

పండితుడౌతాడు. అందుచేత గురువు పరమేశ్వర నిష్ఠగలవాడై కూడ ఉండాలి. అంటే సమాధ్యవస్థలో పరమేశ్వరానుభూతిని పొందినవాడుగ ఉండాలి.

అలాంటి గురువును శౌనకుడు, 'విధివ దుపసన్నః' – శాస్త్ర విధి ననుసరించి సమీపించినవాడై అడిగాడు. 'భగవన్' ఓ స్వామీ, 'కస్మిన్ను విజ్ఞాతే ఇదం సర్వం విజ్ఞాతం భవతి' – ఏది తెలుసుకుంటే యీ సర్వము తెలుస్తుంది? అని. తరువాత అంగిరసుడు, ఈ ప్రశ్నకు సమాధానంగా 'ముండకోపనిషత్తు'ను బోధిస్తాడు.

ఇచట 'భగవన్' అనే పదం వాడబడింది. భగవద్గీతలో కృష్ణుని కీపదం వాడటంవలన సంస్కృత విద్యావిహీనత చేత మనం కృష్ణుణ్ణి దేవుణ్ణి చేశాము. 'భగవాన్' పదం మనుష్యులకు వాడే పదం. గీతలో కృష్ణుని కిదే వాడారు. మనుష్యులకు 'భగవాన్' పదం వాడితే, అది ఆద రార్థమే వాడతారు. సంస్కృత గ్రంథాలలో కొందరు మహర్షులకు కూడ యీ 'భగవాన్' పదం వాడబడింది. అలాగే 'భగవాన్' పదం పరమేశ్వరు నికి కూడ వాడతారు. సమస్త ఐశ్వర్యము కలవాడు, భజించుటకు యోగ్యుడు కనుక ఆయనను 'భగవాన్' అన్నారు. ఈ భేదాన్ని మనం గుర్తించాలి.

పరమాత్మ తత్వం అత్యంత సూక్ష్మమైంది. నల్లపూస కనబడిన వానికి తాటికాయ బాగా కనబడుతుంది. కనుక సూక్ష్మ తత్వమైన పర తత్వము తెలిసినవానికి, స్థూలతత్వములు లేక భౌతిక పదార్థములు సుల భంగా తెలు[illegible]ము. సర్వభూతములు అంటే – యీ చరాచర జగత్తు అంతా కూడ-పరమా[illegible]ే ఉన్నవని అతడు తెలిసికుంటాడు. ఇది సమాధిస్థితిలో అనుభవించుతాడు స[illegible]డు.

భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వ సంశయాః
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥

ముం. ౨-౨-౮

'తస్మిన్ దృష్టే పరావరే' - పరమేశ్వర సాక్షాత్కారం పొందిన వ్యక్తికి హృదయములోని గ్రంథులు - ముడులు అంటే అజ్ఞాన వాసనలు విడిపోతాయి. సమస్త సందేహములు ఛేదింపబడతాయి. అతనిలో కర్మలు క్షీణించుతాయి. అంటే అతడు చెడ్డకర్మలు చెయ్యడు. శుభకర్మలే చేస్తాడు. శుభకర్మలుకూడ ఫలాపేక్షారహిత భావంతో చేస్తాడు.

'తతో న విచికిత్సతి' - తరువాత అతడు సందేహమును పొందడు. సర్వసంశయములు అతనినుండి దూరమవుతాయి. మిగిలింది రేపు.

---

గుంటూరు, 30-12-1968
సోమవారం, సా. 6-00 గం.

మహాజనులార!

నిన్నటిదినం "యస్తు సర్వాణి భూతాని...." అన్న మంత్రాన్ని చెప్పుకున్నాం. పరమేశ్వడు సర్వప్రాణులలోను, ప్రకృత్యాది పదార్థము లందెల్లెడల వ్యాపించి యున్నాడనియు, అవి ఆయనలో ఉన్నవనియు, తెలిసినవ్యక్తి సందేహమును పొందడని తెలిసికొన్నాం. ఈ సృష్టికి మూల కారణం తెలుసుకోడానికి మనం అంతర్ముఖులం కావాలి. జీవుడు, పరమే శ్వరుడు, ప్రకృతి అని మూడు మూలపదార్థాలున్నాయి. వీటిగురించి మనం తెలుసుకోవాలి. సామాన్యంగా జీవుడు, ఈ స్థూలప్రపంచం ... అందరి అనుభవంలోను ఉంటాయి. కాని పరమేశ్వర సాక్షా... ...ందినవారు బహు అల్పసంఖ్యాకులుగా ఉంటారు. జీవుడు అంతర్ముఖుడైనపుడు సమా ధ్యవస్థలో పరమేశ్వర సాక్షాత్కారం కలుగుతుంది. అపుడు సర్వసంశయ ములు విచ్ఛిన్నము లవుతాయి. అలాంటి వ్యక్తి ఆత్మసాక్షాత్కారానంతరం ఏమిచేస్తాడో యీ క్రింది మంత్రంలో మనం తెలుసుకుంటాం,

యస్మిన్ త్సర్వాణి భూతా న్యాత్మైవాభూద్ విజానతః,
తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః॥ ౭

భావార్థము :- సంన్యాసులు, విద్వాంసులు పరమాత్మయందు సంచరించు సమస్త ప్రాణులను తమతో తుల్యములయిన సుఖ దుఃఖములు గలవానిగ నెంచెదరు. వారు అద్వితీయుడగు పరమేశ్వరునే శరణు జొత్తురు. అట్టివారికి శోక మోహ లోభాదు లెన్నడును కలుగవు. అట్లే యెవరు తమ స్వరూపమును యథార్థముగ గుర్తించి, పరమాత్మనుగూడ తెలిసికొందురో వారు ఎల్లప్పుడు సుఖింతురు.

లోకంలో సాధారణ మానవులకు శోక మోహాలు కలుగుతాయి. ఆత్మ సాక్షాత్కారం పొందిన జ్ఞానుల కవి కలుగవు. 'మోహము'- అంటే ప్రేమ అని సామాన్యార్థం. విపరీతజ్ఞానము లేక భ్రమ, భ్రాంతి అనుట సరియైనఅర్థం. ఉన్నదాన్ని ఉన్నట్లు గ్రహించక యింకొకటిగా భావించడం విపరీతజ్ఞాన మవుతుంది. త్రాడును త్రాడుగ చూడక, పాము అనుకోవడం విపరీతజ్ఞానం. దీన్నే రజ్జుసర్పభ్రాంతి అంటారు. విపరీత జ్ఞానంవలన దుఃఖం కలుగుతుంది. కాని వస్తుతత్వం ఏమిటో గ్రహించిన వ్యక్తికి దుఃఖాలుండవు. అందుచేత వస్తుతత్త్వజ్ఞానం కలగడం సుఖదాయకం, లౌకిక పదార్థ జ్ఞానాన్ని ప్రాకృతిక పదార్థజ్ఞానం అంటారు. నేటి సైంటిస్టులు (Scientists) ప్రాకృతిక పదార్థజ్ఞానులు. వారికి అప్రాకృతిక జ్ఞానంతో సంబంధంలే[illegible]ప్రాకృతిక పదార్థములు రెండు. ఒకటి జీవుడు, రెండవది పరమాత్మ. ఈ రెంటిని గూర్చిన జ్ఞానం కలిగితే అతడు విజ్ఞాని అవుతాడు.

లోకంలో జీవులసంఖ్య అసంఖ్యాకం. ఈ సంఖ్య ఎంతో మనకు తెలియదు. కాని పరమేశ్వరునికి మాత్రం తెలుసు. స్వరూపతః అన్ని జీవులు ఒకటే. జీవుడు సూక్ష్మపరిమాణం కలవాడు. ఏనుగు శరీరంలో

పెద్దజీవుడు, క్రిమికీటకాదులలో చిన్న జీవులు ఉండవు. జీవునికుండే లక్ష ణాలు మన మిదివరకు చెప్పుకున్నాం. ఇచ్ఛ (రాగం), ద్వేషము (వైరము), ప్రయత్నము, సుఖము, దుఃఖము, జ్ఞానము-ఈ గుణములు గలది జీవాత్మ. జీవునిలో- నాకిది కావాలి అని కోరేగుణం ఉంది. ఆ కోరిన పదార్థమును సంపాదించడానికి ప్రయత్నంకూడ చేయగలడు. ఆ ప్రయత్నం వలన అతడు కోరిన పదార్థం సిద్ధించితే సంతోషిస్తాడు. లేకపోతే దుఃఖిస్తాడు.

నేను జీవుణ్ణి గురించి 'సైంటిఫిక్'గా (నవీనశాస్త్ర దృష్ట్యా) చెప్ప లేను. నాకు నేటి వైజ్ఞానిక పరిభాష (Scientific terminology) రాదు, మీకు వివరించి చెప్పుటకు. జీవుడు శరీరముకంటె భిన్నమని మాత్రము చెప్పగలను. అతనికి జ్ఞానాదిగుణా లున్నవి. శరీరాని కవి లేవు. దాని గుణాలు వేరు. వికలాంగులకు కళ్ళు, కాళ్లు, చేతులు ఇత్యాది అవయవ ములు లేకపోయినా వారిలో జ్ఞానాదిగుణాలు మాత్రం లేకుండా పోవు. శరీరంలోని మెదడులాంటి సూక్ష్మపదార్థాలు అస్తవ్యస్తమైనపుడు అతని వర్తనం క్రమబద్ధంగా లేకపోవచ్చును. కాని జ్ఞానాది గుణములు మాత్రం లేకుండా పోవు.

కణాద మహర్షి తమ వైశేషిక దర్శనంలో అణువులచేత ఈ ప్రపంచం ఏర్పడిన దంటాడు. ఆయన ప్రపంచగత పదార్థాలను ఆరుగా నిర్ణయించాడు. ద్రవ్యము, గుణము, కర్మ, సామాన్యము, విశేషము, సమ వాయము. ఈ యారింటిలోకూడ మొదట మూడు పదార్థ[illegible] ముఖ్యము లన్నారు. ద్రవ్యము-గుణము-కర్మ. ఈ మూడు పదార్థములలో మరల ద్రవ్యమును 9 విధములుగా విభజించారు.

"పృథి వ్యాప స్తేజో వాయు రాకాశం కాలో దిగాత్మా మన ఇతి ద్రవ్యాణి"

వైశేషికం ౧-౧-౫.

పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు ఆత్మ, మనస్సు ఇని 9 ద్రవ్యములు.

ఆత్మనుకూడ ఒక ద్రవ్యంగా ఆయన నిర్ణయించాడు. ఆత్మ ద్రవ్యం కాకపోతే పంచభూతములతో నిర్మితమైన యీ శరీరంపై ఆత్మ ఎలా అధికారం చలాయిస్తుంది? కనుక ఆత్మకూడ కణాదమహర్షి ఒక ద్రవ్యమే నంటాడు. నేటి సైంటిస్టులు యింకా ఈ సిద్ధాంతమును కనిపెట్టలేదు. వారు ఆత్మ ద్రవ్యం-పదార్థం కాదంటారు. కాని అది భౌతిక పదార్థమైన శరీరంపై ఎలా పనిచేయుచున్నదా ? అని సంశయం కలిగి ఆ సమస్యను యింకను తేల్చలేక పోతున్నారు.

ఈ ఆత్మ భావవాదుల దృష్టిలో (idia) కల్పిత వస్తువే. కాని (Substance) పదార్థం అని వారంగీకరించరు. కల్పితవస్తువు (Idia) కు (Existence) ఉనికి లేదు. కాని పదార్థాని కున్నది. పదార్థానికి లేక ద్రవ్యమునకు లక్షణమేమిటి ? క్రియా, గుణములు కలిగినది ద్రవ్యం. 'గుణ క్రియా సమవాయి కారణం ద్రవ్యం'-అని వైశేషిక సూత్రం. సమవాయి కారణం అంటే ఏమిటి ? ఉపాదాన కారణాన్ని గురించి నే నిది వరకు చెప్పాను. ఉపాదాన కారణమునే సమవాయి కారణ మంటారు. మట్టి ఉపాదాన కారణం. కుండ కార్యం. కుండనుచేసే కుమ్మరి నిమిత్త కారణం. ఈ కార్యకారణ భావము బాగుగా తెలుసుకోవాలి. లేకపోతే తత్త్వజ్ఞానం[illegible]గదు. జీవునికున్న ఆరుగుణాల్లో మూడు ముఖ్యములు. (will) ఇచ్ఛ. (knowledge) జ్ఞానం, (Effort) ప్రయత్నం. (Dead body) మృత శరీరంలో యివి కనబడవు, వస్తుగుణము ఎప్పుడూ వస్తువు నాశ్రయించి ఉంటుంది. అగ్నికి కాల్చేగుణము స్వభావం. అగ్ని కాల్చడం లేదంటే అచట అగ్ని లేదనే అర్థం. అట్లాగే (dead body) శవంలో ఇచ్ఛాది గుణములు వ్యక్తం కావడం లేదంటే జీవుని గుణములు జీవునితోనే వెళ్ళిపోయినవని అర్థమౌతుంది. ఒకానొకప్పుడు అంటే

మరణించినప్పుడు శరీరంలో ఇచ్ఛాదిగుణములు లేకుండాపోతవి. కారణం ? ఇచ్ఛాది గుణాలు శరీరమునకు సంబంధించినవి కాకపోవడంచేత. అవి జీవ గుణాలని శాస్త్రకారుల దృష్టి.

ఆత్మవిషయమై మన శాస్త్రకారుల దృష్టి ఏమిటో మీకు చెప్పాను. నవీన శాస్త్రజ్ఞులలో ఒకడైన డెకార్టె (Decorte) మన శాస్త్రకారులు చెప్పినదానికి అనుగుణంగా ఆత్మవిషయమై తన అభిప్రాయ మేమిటో చెబుతాడు. అతడు చెప్పినది ఇంగ్లీషులో ఉన్నది. అది చదువుతాను. సభికులలో అందరికి ఇంగ్లీషు రాకపోవచ్చును. అందుచేత ఇంగ్లీషు పాఠాన్ని మళ్ళీ తెలుగులో తర్జుమాచేసి చెబుతాను. (చిరునగవుతో) నాకు ఇంగ్లీషు అంతగారాదు. కనుక యీ తర్జుమా చెయ్యడంలో నేనెంతవరకు కృతకృత్యుడ నవుతానో మీరే గ్రహిస్తారు.

RENE DECORTE (1596-1650)

" The fact of my thinking reveals to me something that thinks. What is this something? It is I. I think therefore I am. My very doubt proves my existence as a doubter. Otherwise doubt itself could not exist. Hence I know that I am a substance whose entire nature it is to think and for whose existence there is no need of any place, nor does it depend on any material thing; so that this 'me' that is to say the soul by which Iam what I am, is entirely distinct from my body and even more easy to know than is the latter; and even if the body were not the soul would not cease to be what it is"

(రేనె డెకార్టె 1596-1650)

"నే నెంతగానో ఆలోచించగా నాకు అర్థమయిన దేమిటంటే, ఏదో ఒక వస్తువు నాలో ఉంది ఆలోచిస్తున్నదని. ఆ వస్తువు ఏమిటంటే, అది 'నేను' (జీవుడు) అని. కనుక 'నేను' ఉన్నాను. నాకు కలిగిన సంశయమే నేనొక సంశయాత్మనని రుజువు చేస్తున్నది. అలా కాని పక్షంలో అసలు నాలో సంశయమే ఉండెడిదికాదు. అందుచేత నేనొక పదార్థమనియు, ఆలోచించడమే నా స్వభావ మనియు, నా ఉనికి ఏదోయొక భౌతిక పదార్థముపై గాని, ఒకప్రదేశముపై గాని ఆధారపడిలేదనియు నేనెఱుగుదును. అందువలన ఆత్మ అనబడే యీ 'నేను' నేనుగానే ఉన్నాను. నేను పూర్తిగా నాశరీరము కంటె విలక్షణమైనవాడను. నేను నాశరీరము నెరుగుటకంటె నన్ను నే నెరుగుటయే సులభము. ఒకవేళ నాయీశరీరము మృతినొందినను 'నేను' మృతి నొందను."

ఇంకొక మహాశయు డేమన్నాడో గమనించండి. ఈయన పేరు డాక్టరు వి. బి. యస్. హాల్డెన్ (Dr. V. B. S, Holdane) (చిరునగవుతో) ఈ పేరు చదవటం కూడ నాకు సరిగా తెలియదు.

"We know a lot about life" but we not know where and when it was born. Many people are content to give [illegible] the Quest and to say that the origin of life is a mistery beyond the range of science. This may prove to be true".

"ఆత్మ (life) ను గూర్చి మన కెంతో తెలుసు. కాని, అది ఎప్పుడు ఎక్కడ ఉద్భవించినదో మన మెరుగము. కొందరు దీనిమూలము భౌతిక విజ్ఞానశాస్త్ర అవరణమునకు అవలి దనియు, దీని నన్వేషించుటకంటె

ఊరకుండుటయే ఉత్తమ మనియు నెంచి సంతృప్తి పదుదురు. ఇది యథార్థము వలెనే తోచుచున్నది".

అందుల కనియే జీవులు అనాది, స్వయంసత్తా కలిగినవని మన మహర్షులు నిశ్చయించారు. ఆత్మ ద్రవ్యం. అలాగే శరీరంకూడ ఒక ద్రవ్యం. అందుచేతనే ఆత్మ శరీరంమీద పనిచేస్తున్నది.

ఆత్మ సాక్షాత్కారం పొందినవ్యక్తి తనయందు తక్కిన జీవు లెలా స్నేహంతో వర్తిస్తాయో అలాగే తాను కూడ వాటియందు వర్తిస్తుంటాడు. ఇతరుల సుఖ దుఃఖాలను తనతో పోల్చి చూచుకుంటాడు. ఒకవేళ అన్య ప్రాణులవలన తనకు దుఃఖము కలిగినా, తాను మాత్రము వాటికి దుఃఖము కలిగించడు. అసంప్రజ్ఞాత సమాధిలోనో, సంప్రజ్ఞాత సమాధిలోనో ఆత్మ సాక్షాత్కారం పొందినవ్యక్తి యీ సమస్త చరాచర జగత్తులో పరమేశ్వరుడు సమంగా వ్యాపించి యున్నాడని తెలుసుకుంటాడు. అతడు ప్రవర్తించే విధానమును గురించి-భాగవతములో ప్రహ్లాదునిగూర్చి యిలా వర్ణిస్తాడు కవి.

"తనయందు అఖిల భూతములందు నొక భంగి సమహితత్వంబున బరగువాడు".

అలాంటివానికి శోకమోహాలు కలుగవు. మిత్రులు, పుత్రులు, భార్య వీరందరు నిజమునకు మనవారు కారు. ధన ధాన్యములుకూడ మనవి కావు, మనవి కాని వానియందు ఇవి మనవని దృష్టి నుంచడం మోహ... ఈ పదార్థములు మనలను వీడినపుడు మనం దుఃఖపడతాము. కాని, ఆత్మసాక్షాత్కారము పొందినవ్యక్తి యీ శోకమోహములకు వశుడుకాడు. ఇప్పటికి 7 మంత్రాలు చెప్పుకున్నాం. పరమేశ్వరునిగూర్చి కొంతవరకు ఈ మంత్రాల ద్వారా తెలుసుకున్నాం. ఇప్పుడు చెప్పుకొనబోయే మంత్రంలో ఆయనను గురించి మనం యింకా ఎక్కువగా తెలుసుకోగలం.

స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరగ్ం
శుద్ధ మపాప విద్ధమ్, కవిర్ మనీషీ పరిభూః
స్వయం భూర్, యాథా తథ్యతోఽర్థాన్
వ్యదధా చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః ॥ ౮

భావార్థము :- అనంతశక్తియుక్తుడు, అజన్ముడు, నిరంతరము ఎల్ల తావులయందుండువాడు, నిత్యముక్తుడు, న్యాయకారి, నిర్మలుడు, సర్వసాక్షి, నియంత, అనాది స్వరూపుడు నగు బ్రహ్మము - పరమేశ్వరుడు సర్గారంభమున వేదము మూలమున శబ్దార్థములు, వానికి గల సంబంధమును దెలుపు విద్యలను ఉపదేశింపకున్నచో లోకమున మానవులలో నెవరును విద్వాంసు లయ్యేడివారు కారు. ధర్మార్థకామమోక్షముల ననుభవించుటకును సమర్థు లయ్యేడివారు కారు. అందువలన నా బ్రహ్మమునే యెల్లప్పుడు నుపాసింపవలెను.

సః - అంటే అతడు లేక పరమేశ్వరుడు. పరిఅగాత్ - అంతటా వ్యాపించి ఉన్నాడు. సృష్టికర్త సృష్టి ఎక్కడెక్కడ జరుగుచున్నదో అక్కడక్కడ ఉంటాడనియు, దేశకాల భేదము లేక ఆయన సర్వవ్యాపకుడై సదా ఉంటాడనియు, ఒకమారు చెప్పుకున్నాం. పరమేశ్వరుడు ఏదో ఒకచోట ఉన్నాడనుట విరుద్ధజ్ఞానం. ఫలానిచోటే దేవుడున్నాడనినచో వైదికులు ఒప్పరు. దయానందుడు వేదములలోగాని, ఉపనిషత్తులలోగాని దేవాలయములను దర్శించుమని, విగ్రహాది జడమూర్తులను ఉపాసించుమని ఎక్కడా లేదన్నాడు. కనుక దయానందుణ్ణి నాస్తికుడన్నది లోకం. నా దృష్టిలో అసలు నాస్తికులు విగ్రహారాధకులే. ఈ విగ్రహారాధన పూర్వం వైదికమతస్థులలో లేదు. ఇది బౌద్ధ, జైనులనుండే మనకు సంక్రమించింది. బౌద్ధులు బుద్ధుని విగ్రహమునుపెట్టి పూజిస్తారు. జైనులు వారి మతగురువులైన తీర్థంకరుల విగ్రహముల నారాధిస్తారు. జినుడు వారి ప్రధాన గురువు.

ఆయనే జైనమతాన్ని స్థాపించాడు. ఆయన అసలుపేరు వర్ధమాన మహావీరుడు. ఆయన ఉపవాసాదికములచేత, తపశ్చర్యచేత యింద్రియములను జయించాడు. కనుక ఆయన్ని జినుడన్నారు. ఆయన స్థాపించిన మతం కనుక జైనమతంగా వ్యాప్తిలోనికి వచ్చింది. ఈ బౌద్ధ జైనులనుండే మనవారు విగ్రహములను పూజించడం నేర్చుకున్నారు. అజంతా, ఎల్లోరాలను చూచినవారికిది తెలుస్తుంది. అజంతాలో బౌద్ధశిల్పము కలదు. ఎల్లోరాలో బౌద్ధశిల్పంతోపాటు హిందూశిల్పాలు కూడ ఉన్నాయి. బౌద్ధులు, జైనులు కూడ విగ్రహారాధన చేస్తారు కనుక వారిని మనం నాస్తికులన్నాము. జైనుల గుళ్ళలో పెద్దపెద్ద గంటలు కట్టేవారు. అదిచూచి మనవారుకూడ గుళ్ళలో గంటలు కట్టడం మొదలు పెట్టాలు. జైనులువిగ్రహారాధన చేస్తారు కనుక వారు ఆస్తికులు కారు.

'అస్తి యితి మతిర్ యస్య స ఆస్తికః' - ఉన్నది అను బుద్ధి కలవాడు ఆస్తికుడు. ఆస్తికుని భావము ఆస్తిక్యము. అంటే పరమేశ్వరుడున్నాడని అంగీకరించేవాడు ఆస్తికుడవుతాడు. జైనులు భగవంతుడున్నాడని ఒప్పుకోరు. కాని జినుడు మొదలుగాగల తీర్థంకరుల విగ్రహాలను దేవాలయములలో పెట్టి పూజిస్తుంటారు. వారి గుళ్ళల్లో జరిగే అలంకారములను, కర్మకాండలను చూచి సామాన్యజనులు ఆకర్షింపబడినారు. మన వైదికులు వారి నెంతవారించినా వారు జైనుల మందిరాలకు పోవడం మానలేదు. అపుడు కొన్ని నియమాలను జనులపై విధించారు కూడ.

న వదేద్ యావనీం భాషాం ప్రాణైః కంఠగతైరపి,
హస్తినా తాడ్యమానోఽపి న గచ్ఛేత్ జైనమందిరం॥

ప్రాణాలు పోతున్నాసరే * యవన భాష మాట్లాడరాదు. ఏనుగు

---

* యవన భాష అంటే తురకం, ఇంగ్లీషు మొదలైన పరభాషలు. యవనులు అంటే తురకలు. యవనుల తరువాత ఇంగ్లీషువారు వచ్చి మనపైన ఇంగ్లీషు రుద్దారు.

చేత తరుమబడినను ప్రాణరక్షణార్థం జైనమందిరంలో ప్రవేశింపరాదు. అని నిషేధించినా జనులు జైనమందిరములకు వెళ్ళడం మానలేదు. పెట్టిన ఆంక్షలవల్ల లాభంలేకపోయింది. అప్పటినుండి వైదికులుకూడ జనుల నాకర్షించుటకు చారిత్రక పురుషులైన రాముడు, కృష్ణుడు మొదలగువారికి గుళ్ళు కట్టారు. దయానందుడు విగ్రహాది జడమూర్తుల నుపాసించడం అవైదికం, అలా చేయుమని వేదాలలో ఎక్కడ లేదన్నందుకు ఆయనను నాస్తికుడన్నారు. అసలు నాస్తికు లెవరు? 'నాస్తికో వేద నిందకః'– (మనువు). వేదములను నిందించేవారుకాని, వేదవిరుద్ధక్రియల నాచరించే వారు కాని నాస్తికు లనబడతారు. కనుక వేదవిరుద్ధమైన జడపూజల నాచరించడంచేత నిజానికి నాస్తికులు విగ్రహారాధకులే. బుద్ధుడు అహింసావాది. జంతుబలులను నిషేధించాడు, యజ్ఞములలో సైతము జంతువుల్ని బలియివ్వరాదన్నాడు. ఆయనతో ఎవరో, యజ్ఞార్థము పశుబలుల నివ్వవచ్చునని వేదములలో ఉన్నదని వాదించారు. నిజానికలా ఎక్కడా వేదములలో లేదు. కాని బుద్ధుడు వేదములను చదువలేదు. కనుక వారు చెప్పింది నిజమేనను కొని, అలాగైతే నాకు వేదాలతో పనిలేదు పొమ్మన్నాడు. ఇక అప్పటి నుండి బుద్ధుడు వేదములను ఒప్పుకోలేదు. గనుక ఆయన నాస్తికుడు అన్నారు. నిజాని కీనాడు మనం వైదికులం కాకుండాపోయాము. ఎందు చేత? పరమేశ్వర స్వరూపం ఏమిటో తెలియకుండా విగ్రహాది జడ మూర్తుల నుపాసించడంచేత.

తరువాత 'శుక్రం'–శుక్రం అంటే సామర్థ్యం కలవాడు. సృష్టిస్థితి లయములను చేయుగల సామర్థ్యం కలవాడు గనుక భగవంతుడు శుక్రం అనే పదంతో చెప్పబడ్డాడు. 'శుక్రం వై వీర్యం'– శక్తిసామర్థ్యములు కలవాడని అర్థం. పరమేశ్వరుడు చేసే పనేమిటి? కారణరూపంలో సూక్ష్మంగా ఉన్న ప్రకృతిని స్థూలము చేస్తాడు. కనుక దేవుడు సృష్టిస్తాడు. మరి సాయిబాబా ఒక ఈగనైనా పుట్టించలేదు. రాముడు, కృష్ణుడు

మొదలైనవారంతా సృష్టికర్తలు కారు. వారికి పూర్వమే ప్రపంచం ఉంది. వారీ జగత్తును సృష్టించలేదు. క్రైస్తవులు క్రీస్తును దేవు డంటున్నారు. మనం రామకృష్ణాదులను దేవుళ్ళనేసరికి వారు క్రీస్తే దేవుడు, ఆయన కన్యగర్భమున ఉద్భవించాడు అంటారు. మరి రామకృష్ణాదులను దేవుళ్ళని ఒప్పుకున్నప్పుడు క్రీస్తునుకూడ ఒప్పుకోవలసివస్తుంది కదా। వారు క్రీస్తును latest Addition, క్రొత్త అవతారం అంటున్నారు. (సభలో చిరునవ్వులు). ఇది యిలావుంటే కొందరు విజ్ఞానులు (Scientists) అసలు దేవుడేలేడు పొమ్మంటున్నారు. (సభలో నవ్వులు). వారు నాదగ్గరకు వచ్చి, మీరు దేవున్నాడని ఎలా ఋజువు చేస్తారు. ఒక్కరా, యిద్దరా? ప్రపంచంలో అనేకమంది దేవుళ్ళు వెలిశారుగదా। వారిలో మీరు ఎవరిని దేవుడంటారు అని అడుగుతుంటారు. నేను వారితో వీళ్ళెవరూ దేవుడు కాదు, అసలు భగవంతుడు శరీరధారణ చెయ్యడు, ఆయన సర్వవ్యాపి అని చెబుతాను. మొదట భగవంతుని లక్షణము లేవో చెప్పి, భగవంతుని అస్తిత్వమును కారణయుక్తంగా నిరూపించేసరికి వారుకూడ అపుడు భగవంతు డొక డున్నాడని అంగీకరించుతారు.

'అకాయం'-భగవంతునికి శరీరం లేదు. ఆయన జన్మ ఎత్తడు. పుట్టడు, పెరుగడు, మరణించడు. కొందరడుగవచ్చు" కుమ్మరి కుండలను చేస్తాడు. సాలి వస్త్రములను నేస్తాడు. వారికి శరీరం ఉంది కనుక అలా చేయగలిగారు. అట్లే ప్రపంచాన్ని సృష్టించిన పరమేశ్వరునికి శరీరం లేదంటే ఎలా ?'' అని. అయితే యిక్కడ అకాయం 'నాస్తికాయం యస్య తత్ అకాయం' శరీరం లేనిది పరమాత్మ తత్వం అని వేదము చెప్పుచున్నది. పరమాత్మకు శరీరం ఉంటే పరిచ్ఛిన్నమవుతుంది. హద్దు అనేది ఏర్పడుతుంది. అపుడు భగవంతుడు పరిమితు డౌతాడు. పరిమితుడైనవాడు అపరిమితముగానున్న యీ సృష్టిని చేయలేడు. కర్త ఒకచోట కార్యమింకొకచోట ఉండవుకదా। కుమ్మరి ఒకచోట ఉంటే కుండ

యింకొకచోట తయారుకాదు. ఎక్కడ కుమ్మరి ఉన్నాడో అక్కడే కుండ తయారవుతుంది. కనుక అపరిమితమైన యీ సృష్టి కార్యమును చేయుటకు పరమేశ్వరుడు సర్వవ్యాపకుడై ఉండాలి. సర్వవ్యాపకుడైన పరమేశ్వరునకు శరీరం ఉండదు. కనుక ఆయనను 'అకాయం' అంటున్నది వేదమీ మంత్రంలో.

అపాణి పాదో జవనో గ్రహీతా పశ్య త్యచక్షుః స శృణోత్యకర్ణః।
సవేత్తి వేద్యం నచ తస్యాస్తి వేత్తా త మాహు రగ్ర్యం పురుషం మహాంతమ్॥

శ్వేతా. అ ౩-౧౯.

పరమేశ్వరునికి చేతులు లేవు. కాని తన అనంతశక్తిచేత యీ ప్రపంచాన్ని నిర్మిస్తాడు, గ్రహిస్తాడు. ఆయనకు కాళ్లు లేవు. కాని ఆయన సర్వవ్యాపకు డవటంచేత అన్నింటికంటె వేగము కలవాడు. ఆయనకు కన్నులులేవు. కాని ఉన్నదున్నట్లు చూస్తాడు. ఆయనకు చెవులు లేవు. కాని అందిరి మాటలు వింటాడు. ఆయనలో అంతఃకరణము లేదు. కాని సమస్త జగత్తును తెలిసికొంటాడు. ఆయనను సంపూర్ణముగ తెలుసుకున్న వారెవరూ లేరు. ఆయన సనాతనుడు, మహాపురుషుడు, సర్వశ్రేష్ఠుడు.

జీవులకు శరీరములు మూడు ఉంటవి. స్థూలశరీరం, సూక్ష్మశరీరం, కారణ శరీరమని. పరమేశ్వరునికి యీ మూటితోను సంబంధంలేదు. ఇవి జీవునికి సంబంధించినవి. పరమేశ్వరునికి శరీరమేలేదు కనుక, 'అవ్రణం' ఆయన వ్రణములు లేనివాడు. అలాగే 'అస్నావిరగ్ం' అంటే నరములు మొదలైన శరీర సంబంధమైన పదార్థాలేవీ ఆయనలో లేవని. చూడండి- పరమేశ్వరుడు శరీర రహితుడని చెప్పడానికి ఎంతటి స్పష్టపదాలతో ఈ మంత్రంలో వివరించడం జరిగిందో. స్థూలశరీరం - ఇది అందరికి తెలిసిందే. తరువాత సూక్ష్మశరీరం-దీనినే వాహక శరీరమని కూడ అంటారు.

అంటే జీవుడు స్థూల శరీరమును వదలి వెళ్ళేటప్పుడు యీ వాహక శరీరంతో వెళతాడు. ఇది 17 తత్వములు కలిగివుంది. పంచప్రాణములు (ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము) పంచజ్ఞానేంద్రియములు, పంచసూక్ష్మభూతములు, మనస్సు, బుద్ధి మొత్తం యివి 17 తత్త్వములు. మూడవది కారణ శరీరము-ఇది ప్రకృతిరూపమై ఉంటుంది. ఈ మూడు శరీరాలనుండి విముక్తులమైతేగాని మనకు ముక్తి లభించదు. ముక్తిని వాంఛించే జీవుడు ఈ శరీరాలు తన కక్కరలేదని దానికి తగినట్లు ప్రయత్నం (సాధన) చెయ్యాలి. అపుడు ముక్తి వస్తుంది.

శంకరాచార్యుడు తత్త్వవిదుడు. ఆయన గొప్పతనమును యిచట ఉన్న వాళ్ళెవరూ కాదనరనే అనుకుంటాను. ఆయన ప్రస్థానత్రయముపై భాష్యము వ్రాశారు. ఈ సంగతి మీ కిదివరకే చెప్పాను. ఆయన బ్రహ్మ సూత్రములకు భాష్యం వ్రాస్తూ, 'కరణవ దితి చేత్ న, భోగాదిభ్యః'- (బ్ర. సూ. ౨-౨-౪౦) అనే సూత్రానికి యిలా భాష్యంవ్రాస్తారు. ముందు సూత్రానికి అర్థం చెప్పి తరువాత ఆయన వ్రాసిన భాష్యాన్ని గురించి చెబుతాను. సూత్రార్థం- భగవంతునికి శరీరమున్న దందురేని అది సరికాదు, శరీరమున్నచో భోగాదులు సంభవించును.

శంకర భాష్యం : "అథ లోకదర్శనానుసారేణ, ఈశ్వర స్యాపి కించిత్ కరణానా మాయతనం కామేన కల్ప్యేత, ఏవమపి నోప పద్యతే సశరీరత్వేహిసతి సంసారివద్ భోగాదిప్రసంగాత్; ఈశ్వరస్యా ప్య నీశ్వరత్వం ప్రసజ్యేత''

తాత్పర్యం ; ''లోకమున చూడబడునట్లు భగవంతునికి శరీరము కల్పింతుమేని, అదియును తగదు. ఈశ్వరుడు శరీరధారి యగు నెడల సాంసారిక పురుషునివలె సుఖ దుఃఖాదులను అనుభవించవలసిన వాడ

గును. సుఖ దుఃఖములకు లోబడునెడల ఈశ్వరునికి ఈశ్వరత్వము ఉండ నేరదు. అతడు ఈశ్వరుడు కాలేడని భావము".

ఈశ్వరుడు - అంటే నియమించేవాడు అని అర్థము. జనులకు లోబడితే జనేశుడు (రాజు) కాదు. నరులకు లోబడితే నరేశుడు (రాజు) కాదు. ఈశ్వరుడు శరీరధారణ చేసినట్లయితే తన ఈశ్వరత్వమును పోగొట్టుకుంటాడు. ఆయనకు ఏ విధంగాను శరీర సంబంధం అంగీకరించ రాదు.

'శుద్ధం' - పరమాత్మని యింకొక లక్షణం శుద్ధ స్వరూపం. ఆయన మలిన రహితుడు. రాగద్వేషాది మలినము లాయనలో లేవు. ఆయన ఫలము కోరి కర్మలు చేయడు. ఈ సృష్టిని రచించటం జీవుల భోగము కొఱకే నని గుర్తించాలి. ఆయన విశ్వమంతట వ్యాపించి ఉన్నా నీళ్ళలోని తామరాకువలె దేనిని అంటకుండా ఉంటాడు.

'అపాపవిద్ధం' - అంటే భగవంతుడు పాపముగూడ చెయ్యడు అని. చూడండి, ఈ మంత్రంలో పరమేశ్వర స్వరూపం ఎంతటి స్పష్టపదాలతో చెప్పబడిందో. ఈ మంత్రం పెద్ద పెద్ద అక్షరాలతో వ్రాసి ఫ్రేమ్ కట్టించి ప్రతియింటా తగిలించుకోవచ్చు. విష్ణువు, రాముడు, కృష్ణుడు, వీళ్ళకు పాపం అంటింది. కర్మఫలముల ననుభవించారు. విష్ణువు ఇంకా సాలిగ్రామమై నదిలో పడి ఉన్నాడు! బహుశః అతడెప్పుడూ అలాగే ఉండవలసి వస్తుం దేమో కూడ! కాని పరమేశ్వరుడు పాపాలు చెయ్యడు కనుక ఆయనను 'అపాపవిద్ధం' అన్నారు.

'కవిః' - అంటే క్రాంత దర్శి. ఆయన పదార్థములను లోపల వెలు పల కూడ తెలుసుకోగలడు. ఆయన కావ్యం వేదం. 'పశ్య దేవస్య కావ్యం న మమార న జీర్యతి' - దేవుని కావ్యం చావదు, జీర్ణించదు. మనవాళ్ళు వాల్మీకిని ఆదికవిని చేశారు; అసలు కవిని వదలిపెట్టి. అసలు ఆదికవి పర

మేశ్వరుడు. రామాయణమునకు పూర్వమే కావ్యాదులున్నాయి. వేదం ఉన్నది. భాషా వైచిత్ర్యం కూడ వేదంలో ఉంది. వేద మంత్రములలోని లక్షణములనుబట్టి, భాషనుబట్టి యిది గ్రహించగలం. లౌకిక కవులు భగవంతునివలె క్రాంతదర్శులు కాకపోవచ్చు.

వేదములు అపౌరుషేయములు, పురుష నిర్మితమైనవికావు అని కొందరందురు. పురుషుడంటే పరమేశ్వరుడు. పరమేశ్వరుడు కూడ వాటిని రచించలేదు. కనుక అవి అపౌరుషేయములు అని మీమాంసకుల వాదం. ఈ వేద శబ్దాలు నిత్యంగా ఆకాశంలో ఉంటాయి. వాటిని మహర్షులు తమ సమాధి స్థితులయందు దర్శించి ప్రచారం చేశారు అని అంటారు. మంత్రముల కర్థమును కూడ వారు సమాధిస్థితులలోనే గ్రహించగలిగారు. మహర్షులు వేదమంత్రములను గ్రహించగలిగిన (Receiving Stations) గ్రహణ నిలయాలు. ఎక్కడో రేడియోస్టేషనునుండి * ఈథరు లోనికి ప్రసారం చేయబడిన కార్యక్రమములను రేడియోద్వారా మనం యింటిలోనే వినగలుగుతున్నాము. రేడియో మనకు (Receiving Set) గ్రహణ యంత్రం. అలాగే యిదిన్నీ.

ఇక వేదములు ఈశ్వరీయములను వారి దృష్టిలో పరమేశ్వరుడు నిత్యం. వేదం పరమేశ్వరుని జ్ఞానం. పరమేశ్వరుడు నిత్యము కనుక పరమేశ్వర జ్ఞానమైన వేదంకూడ నిత్యమే. అచ్చువేసిన గ్రంథాలు నశించవచ్చు. కాని శబ్దరూపమైన వేద విజ్ఞానం మాత్రం ఎప్పుడూ నశించదు. ఎన్ని కల్పములు మారినా ఆ విజ్ఞానం మాత్రం అలాగే ఉంటుంది.

* ఈథర్ : ఇది ఒకవిధమైన ఆకాశ పదార్థం. ఇది సర్వవ్యాపకంగా ఉంటుంది. దీనిని సైంటిష్టులు కనుగొన్నారు. దీనిలో కాంతి తరంగము సెకనుకు 1,86,000 మైళ్ళవేగంతో ప్రయాణించగలదు.

'మనీషి' - 'మనసాం ఈశః' ఆయన జీవుల మనోవృత్తుల నెరుగువాడు. కనుక మనీషి. జీవులు చేసే సత్సంకల్పములను, దుస్సంకల్పములను ఎప్పటి కప్పు డాయన గ్రహిస్తూనే ఉంటాడు.

'పరిభూః' - పరమేశ్వరుడు అంతటా ఉంటాడు గనుక ఆయనను 'పరిభూః' అన్నారు. లేక దుష్టులను పరిభవించగలవాడు-అన్నిటినిమించిన శక్తికలవాడు అని కూడ అర్థం.

'స్వయంభూః' - అంటే ఆయన ఉనికి రెండవ పదార్థంపై ఆధారపడిలేదు. ఆయన స్వతఃసిద్ధంగా ఎప్పుడూ ఉంటాడు. పరమేశ్వరుని అంగీకరించని కేవల భౌతికవాదులు కొందరు, యీ సృష్టి స్థితి లయములకు కారణమైన పరమేశ్వరు డొకడున్నాడని మీరంటున్నారు కదా! మరి ఆయనను సృష్టించిన వాడొక డుండాలి కదా! ఆయ నెవరు? అంటారు. ఆయన్ని సృష్టించిన వాళ్ళిం కొకరున్నారని చెబుతా ననుకోండి. మరి ఆయనను సృష్టించిన వాళ్ళెవరు అని మళ్ళీ అడుగుతారు. ఇలా చెప్పుకుంటూపోతే అది తెగదు. దీనినే అనవస్థాదోష మంటారు. అలా అడిగేవారికి ఒక నమస్కారం పెట్టి, సరే బాబు మీదే 'రైటు' (Right - మీరు చెప్పిందే నిజము) అని ఒప్పుకొని, నేను వాళ్ళ నొకటి అడుగుతాను. తమరు అసలు యీ ప్రపంచం ఉన్నదని ఒప్పుకుంటారా? ఆహా! ఒప్పుకుంటామంటారు. మరి యీ ప్రపంచానికి కారణ మేమిటి? అంటే దానికి కారణమేముంది; అది అలాగే ఉంది అంటారు. అవును, పరమేశ్వరునికి మాత్రం వేరే కారణమెందుకు? పరమేశ్వర తత్త్వంకూడ 'అలాగే ఉంది' అని మీ రెందు కంగీకరించరు అంటాను. ఇక ఏం చేస్తారు. (సభలో నవ్వులు).

పరమేశ్వరుడు ఈ సృష్టికి కారణమన్నాం. సృష్టికార్యం. 'లాజిక్' (Logic) తర్కశాస్త్రమునకుండే బేస్ ఆధారంసుబట్టి కార్యానికి కారణం

అడగవచ్చు. కాని, కారణానికి కారణం అడగరాదు. అంటే కార్యానికి కారణం ఉంటుంది. మూలకారణానికి కారణం ఉండదు. ఉదాహరణకు : వృక్షము-బీజము యీ రెంటిలో ఏది ముందు? కొంద రిదొక పెద్ద సమస్యగా చర్చించుతుంటారు. విత్తుముందని ఒకరు; చెట్టుముందని యింకొకరు. ఇలా వాదిస్తుంటారు. నా ఉద్దేశ్యంలో యిదొక పెద్ద సమస్య కాదు. ఎలాగంటే, విత్తనం కారణం, వృక్షం కార్యం. కార్యానికెప్పుడూ కారణం ముందుంటుంది. అందుచేత విత్తనం ఎప్పుడూ వృక్షానికి ముందే ఉంటుంది. (Cause) కారణం And (Result) కార్యం వీటిల్లో (Cause) కారణం ముందుంటుంది. తరువాత (Result) కార్యం వస్తుంది. ఎప్పుడూ మూల కారణానికి కారణం ఉండదు. అందువలన పరమేశ్వరుడు కారణరహితుడు.

"యాథా తథ్యతో ఒ ర్థాన్ వ్యదధాత్ శాశ్వతీభ్యః సమాభ్యః"

సనాతనులు, అనాది స్వరూపులు - స్వరూపంతో ఉత్పత్తి వినాశములు లేని జీవులకొఱకు యథాతథంగా పదార్థాలను పరమేశ్వరుడు చేస్తున్నాడు.

జీవుడు, ఈశ్వరుడు, ప్రకృతి యీ మూడు మూలపదార్థాలు కలిసి విశ్వ మనబడుతుంది. ఇందులో పరమేశ్వరుడు సర్వవ్యాపకుడై ఉంటాడు. ఆయన సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు. జీవుడు చేతనుడు, ప్రకృతి జడము, ఇవి రెండును వ్యాప్యములు. ఈ మూడు అనాదులు, శాశ్వతమైనవి. కాని ప్రకృతి పరిణామం చెందుతుంటుంది. రూపాంతరములు పొందుతుంటుంది. సర్వవ్యాపకుడైన పరమేశ్వరునిలో మిగిలిన రెండు పదార్థాలు - అంటే జీవ, ప్రకృతులు ఉంటాయి, వ్యాపక తత్త్వంలో అన్నిపదార్థా లుంటాయి. కొందరు దీనిని కాదని, కేవలము (Absolute) ఒకే పూర్ణపదార్థం మాత్రమే ఉన్నదంటారు. సరిగాదని తోస్తుంది.

ప్రపంచంలోని కార్యములు అనేక కారణములచే ఏర్పడుతున్నాయని మన కర్థమవుతుంది. కనుక ప్రపంచం కార్యమైతే యిది ఏర్పడుటకు అనేకకారణా లుండాలి, అనేది నియమం. కేవలం భౌతిక వాదులు ప్రపంచమున కనబడు చైతన్యమునకు కారణం చెప్పజాలరు. భౌతికపదార్థములకు కారణభూతములైన ఎలక్ట్రాన్స్ (Electrons) న్యూట్రాన్స్ (Netrons), ప్రొటాన్స్ (Protons) అను సూక్ష్మపదార్థములలో చైతన్యం కనిపించదు. కాబట్టి వానిచే ఏర్పడు స్థూలప్రపంచమునందు కనబడు చైతన్యమునకు కారణము దురూహ్యము.

తరువాత – మరి కేవల చేతనవాదులు ఒకేఒక చైతన్య పదార్థం (బ్రహ్మము) ఉంది. జగత్తు మిథ్య అంటున్నారు. 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ'-యిలాంటి బ్రహ్మతత్వంలో జడతత్వం ఎలా వస్తుంది? అని యీ కేవల చేతనవాదుల నడిగితే సమాధానం రాదు. అందుచేత, యీ ప్రపంచ సమస్యను కేవలం చేతనవాదం కాని, కేవల భౌతికవాదం కాని పరిష్కరించలేవు. ఇందుకు 'త్రిత్వవాదమే' సరియైనదని వేదం బోధిస్తున్నది. ఋగ్వేదంలో ఒకచోట మూడు మూలపదార్థాలున్నాయని ఆలంకారికంగా వర్ణించబడింది.

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా..........అభిచాకశీతి"

ఈ మంత్రార్థమును 26-12-68 తేదీ ఉపన్యాసములో చెప్పియే యున్నాను.

ఇలాగే ఉపనిషత్తులో కూడ చెప్పబడింది:

అజా మేకాం లోహిత శుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాం సరూపాః
అజో హ్యేకో జుషమాణోఽనుశేతే జహాత్యేనాం భుక్తభోగా మజోఽన్యః॥

శ్వేతా. ४-५

తెలుపు, ఎఱుపు, నలుపు వర్ణములు కలిగిన ఒక ఆడు మేకను, తనకు సమానమైన బహు సంతానమును కను దానిని ఒక మగమేక ఊరక కనే అంటిపెట్టుకొని ఉంటుంది. రెండవ మగమేక ఈ ఆడుమేకను అనుభవించిన తరువాత విడిచిపెడుతుంది, అని సామాన్యార్థము. ఇచట తెలుపు, ఎఱుపు, నలుపు వర్ణములుకల మేక సత్వరజస్తమో గుణములు గల ప్రకృతిని సూచిస్తుంది. సమానమైన బహు సంతానమును కనునది అనుటచే, ప్రకృతిరూప కారణమునుండి సమాన గుణములుకలిగిప స్థూలపదార్థములు ఏర్పడునని సూచింపబడినది. దాని నంటిపెట్టుకొని ఉన్న మగమేక పరమాత్మగా వర్ణించబడింది. అలాగే యీ ఆడుమేకను అనుభవించి విడిచిపెట్టే మగమేక ముక్తజీవుడుగా వర్ణించబడ్డాడు. ముఖ్యంగా యీ మూడు 'అజ' శబ్దంచేత చెప్పబడటంవలన యివి పుట్టినవి కావని తెలుస్తున్నది. పరమాత్మ, జీవ, ప్రకృతులు ఇవి మూడును అజములు. అనగా వీని కెన్నడును జన్మములేదు. ఈ మూడును సమస్తజగత్తునకు కారణములు. వీనికి కారణ మేదియు లేదు. ఈ అనాదియగు ప్రకృతిని అనాదియగు జీవుడనుభవించుచు అందు తగులువడుచున్నాడు. పరమాత్మ దానియందు చిక్కడు, దానిని భోగింపడు.

భగవద్గీతలోకూడ వేదవ్యాస మహర్షి యీ త్రైతసిద్ధాంతమును పొందుపరచినట్లు మనం చూడగలం.

ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవచ,

క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే॥ గీ. ౧౫-౧౬.

ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః,

యో లోకత్రయ మా విశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః॥ గీ.౧౫-౧౭

ఇందు మొదటి శ్లోకములో 'క్షర'-'అక్షరు'లను పురుషు లిరువురు కలరని చెప్పబడింది. ప్రకృతి మొదలు పృథివ్యాది పంచ మహాభూత

ములు, సమస్త ప్రాణుల శరీరములు 'క్షర' పురుషుడు. అనగా క్షర శబ్దం చేత యిచట ప్రపంచం చెప్పబడింది. క్షర మంటే నశించడం. నశించడ మంటే యిచట రూపనాశనమేకాని పదార్థనాశనం కాదని గ్రహించాలి. శరీర ధారి యయి శుభాశుభ కర్మలనుచేస్తూ వాటి ఫలములను అనుభవించు కూటస్థుడు అక్షరశబ్దంచేత చెప్పబడినాడు. కూటస్థుడనగా జీవుడు. కూటము అంటే మాయలేక ప్రకృతి అని. మాయలో ఉండేవాడు కనుక జీవుడు కూటస్థుడు అనబడినాడు. తరువాత రెండవ శ్లోకంలో– ఈ క్షరాక్షరులకంటె విలక్షణుడైన ఉత్తమపురుష డొక డున్నాడని చెప్పబడింది. ఇచట చెప్ప బడిన ఉత్తమపురుషుడే పరమాత్మ. అతడు భూనభోంతరాళములు మూడింటిని అనగా విశ్వము నంతటిని వ్యాపించి పాలించుచున్నాడు.

'యథాతథ్యతోఽర్థాన్ వ్యదధా చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః'–

జీవులకొఱకు పరమేశ్వరుడు యీ ప్రపంచపదార్థములను సృష్టించు తున్నాడు అని యిచట మంత్రార్థం. కొంద రడుగుతారు–అసలు పరమే శ్వరు డీ సృష్టిని ఎందులకు చేస్తున్నాడు? ఆయన కేమైనా ఉపయోగం ఉందా ? ఆయన ప్రపంచాన్ని సృష్టించకుండినా బాగుండేది. మన కీ యాత నలు తప్పేవి (సభలో చిరునగవులు) అని.

పరమేశ్వరుడు యీ సృష్టిని ఎందుకు చేస్తున్నాడంటే జీవులు చేసిన కర్మఫలితాన్ని వానిచేత అనుభవింపజేయడానికి. ఈ సృష్టిరచన వలన ఆయనకేమీ ఉపయోగంలేదు. మరి ఉపయోగం లేనపుడు అసలు సృష్టిని చేయకుండ ఊరుకోవడం మంచిదికదా। అంటే, అలా ఊరుకోడు. అది ఆయన స్వభావానికి విరుద్ధం. అగ్నికి స్వభావం కాల్చడం. అగ్నిని కాల్చవద్దంటే ఊరుకుంటుందా ? ఊరుకోదు. అట్లాగే పరమాత్మ సృష్టి, స్థితి, లయములు చెయ్యడం ఆయన స్వభావం. మనకు సుఖశాంతులను కలిగించేనిమిత్తం చేస్తున్నాడు. భగవంతుడు ఈ సృష్టి చేయకుండా

వుంటే జీవుల కీ కష్టాలు లేకుండా పోతాయికదా యని కొందరంటారు. కాని, మనం ప్రపంచంలో దుఃఖాలకంటె ఎక్కువగా సుఖాలనే అనుభ విస్తాము. కాని విచిత్రమేమంటే, దుఃఖాలనే గుర్తుపెట్టుకుంటాము. సుఖా లను మరచిపోతాం. ముసలివాడుకూడ చావడానికి ఒప్పుకోడు. యింకా కొన్నేళ్ల బ్రతికితే బాగుండు ననుకుంటాడు. (సభలో నవ్వులు). జీవ నేచ్ఛ మనిషిలో ఉంటుంది. ఎందుకని? ఏదోవిధంగా ఈ జీవితంలో ఇంకా సుఖాన్ననుభవిద్దామని అతని అభిలాష. నాకు 70 సంవత్సరాలున్నాయి. ఈ నా జీవితకాలంలో 4 సంవత్సరాలు మాత్రం కష్టాలనుభవించాను. మిగతాకాలం నాకు సుఖంగానే గడిచిపోతున్నది. నిజానికి మనం ప్రపం చంలో ఒక క్రమబద్ధ జీవితం గడిపేటట్లయితే దీర్ఘకాలం జీవించి అనేక సుఖా లనుభవించవచ్చు. ఒక మిత్రుడు నాతో, ఈ సంసారంలో సుఖం లేదు, నీపనే హాయిగా ఉంది అన్నాడు. సరే, యింకేం సంసారాన్ని వదలి పెట్టి నాతో బయటికి రావయ్యా అన్నాను. ఎలా ? మావాళ్లు ఒప్పుకోరు గదా అన్నాడు. సరే, మీవాళ్ళకు నేను చెప్పి ఒప్పిస్తాను రమ్మంటే ఆహా.....వీలుకాదంటాడు. (సభలో నవ్వులు). ఏదైన పొరుగూరికి వెళ్ళితే సాయంత్రానికి యిల్లుచేరందే మనకసలు తోచదు. ఏమిటో పిచ్చిలో పడినట్లుంటుంది (సభలో నవ్వులు). కనుక మనుష్యుడు సుఖాలే ఎక్కువ అనుభవిస్తుంటాడు. కేవలం దుఃఖాలనుభవిస్తున్నా డనడం సమంజసం కాదు.

జడపూజలు చేయడం మొదలు పెట్టిన దగ్గరనుండి మనము అసలు వస్తుతత్వం (పరమేశ్వని యథార్థ స్వరూపం) మరచిపోయాము. ఈ మంత్రంలో పరమేశ్వర స్వరూపం ఎలా వర్ణించబడిందో మీరు విన్నారు. ఇంక కొంచెం చెబితేగాని విషయం పూర్తికాదు. ఈ ఉపన్యాసంలో మనం స్థూల సూక్ష్మకారణ శరీరాలు మూటిని గురించి చెప్పుకున్నాం. ఈ మూడుశరీరాలు కాక జీవునికి నాలుగవ శరీరం కూడ కలుగు

తుందని గరుడ పురాణంలో చెప్పబడింది. పౌరాణికులు దీనికి 'యాతనా శరీరమని' పేరు పెట్టారు. శాస్త్రములో ఎక్కడా జీవునికి యీ యాతనా శరీరమున్నట్లు చెప్పబడలేదు. అయినా యీ యాతనా శరీర మేమిటో- దీన్ని గురించి తెలుకోవడం మంచిది.

మనుష్యులు మరణించినపుడు యమకింకరులు వచ్చి జీవులను పాశబద్ధులను చేసి యమలోకమునకు తీసికొని పోతారని పౌరాణికు లంటారు. ఈ యమదూతలు 'కాక కృష్ణా'- కాకివలె నల్లగా ఉంటారట! (సభలో చిరునవ్వులు). యమదూతలు జీవుణ్ణి మొదట యముని దగ్గరకు తీసికొనివెళ్ళినపుడు అతనికి శరీరం ఏమీ ఉండదు. కేవల జీవునికి కష్ట సుఖములు కలుగవు. ఎవరు కలిగింపలేరు.

జీవుణ్ణి శస్త్రములు ఛేదించలేవు, అగ్ని దహించలేదు, నీళ్ళలో వేస్తే తడవదు, వాయువు ఎండించలేదు అని చెబుతుంది గీత.

'అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవచ'

గీ. ౨-౨౪.

అంటే అతనిని ఏవిధంగా కూడ శిక్షించడానికి వీల్లేదన్నమాట. మరి అలాంటి జీవుణ్ణి యమధర్మరాజు అగ్నిలో పడవేసినా, సలసలకాగే నూనె కళాయిల్లో వేయించినా, ఏనుగులచేత త్రొక్కించినా, కఱకు రంపా లతో కోయించినా లాభంలేదు. ఎలా శిక్షిస్తాడు! శిక్షిద్దామంటే వీలు కాదయ్యే. జీవునికి స్థూలశరీరం ఉంటేగాని శిక్ష అనుభవింపడయ్యే. అందు కని చెప్పి భటుల్ని పిల్చి, ఒరే! వీడు పనికిరాడు. వీణ్ణి మళ్ళీ భూలోకం తీసుకువెళ్ళండిరా అంటాడట! (సభలో నవ్వులు). పాపం మరి యీ సంగతి యమధర్మరాజుకు ముందుగా తెలియదు కాబోలు! సరే యమ భటులు జీవుణ్ణి తీసికొని మళ్ళీ భూలోకం వస్తారట! అప్పటికి, యీ చచ్చినవాని బంధువులు దశగాత్రాలు చేయించడానికి సిద్ధంగా ఉంటారు.

దశగాత్రాలని చెప్పి వీళ్ళు పదిరోజులు వరుసగా పిండాలు వేస్తారు. ఈ పదిరోజులు వేసిన పిండాలు తిని జీవునికి హస్తప్రమాణం యాతనా శరీరం వస్తుందట. 'హస్త పరిమితం యాతనా శరీర ముద్భవతి'. ఇక అప్పుడు యమభటులు జీవుణ్ణి తీసికొని యమలోకానికి ప్రయాణమవుతారట! ఈ ప్రయాణం సంవత్సరంపాటు సాగుతుందట! పంద్రెండు నెలల్లో పంద్రెండు చోట్ల మజిలీ (మకాం) వేస్తారట! ఈ ప్రయాణంలో జీవుడు ఆకలిదప్పులకు మాడకుండ, పాపం యిక్కడ పురోహితులు మాసికాలని చేయించుతారు. కారణమేమంటే, యిక్కడ పురోహితులకు బంధు బాంధవులకు భోజనాదులు పెట్టి సంతృప్తిపరిస్తే, యమలోక ప్రయాణంలో ఉన్న జీవునికి మధ్యలో భోజనాది సమస్త సదుపాయాలు ఒనగూడుతా యట! మరి కొన్నికోట్లమైళ్ళ దూరాన, యమలోకానికి ప్రయాణంచేస్తున్న జీవునికి, యిలా మాసికాలు పెట్టడంవలన అన్నాదులు చేరుతుంటే, గ్రామాంతరం వెళ్ళేవారికి దారిబత్తెంతో పనిలేదుకదా! (సభలో నవ్వులు). యమలోక ప్రయాణంలో ఉన్న జీవుడు ఆయా మజిలీలలో విశ్రమించు తాడట! అందుకు పడక కావాలి కనుక యిక్కడ పురోహితునికి ఒక పట్టె మంచం, పరుపు దానం చెయ్యమంటారు. అలాచేస్తే అక్కడ జీవుడు పడుకోటానికి మంచం, పరుపు లభిస్తాయట! (సభలో నవ్వులు). అదీ గాక యీ ప్రయాణంచేసే మార్గంలో అనేక సూర్యులు ప్రకాశిస్తుంటారట! జీవుని కపుడు ఎండకు తలమాడి కాళ్ళు బొబ్బలు పెడతాయని పాపం యిక్కడ పురోహితునికి ఒక క్రొత్తగొడుగు క్రొత్తచెప్పుజత దానం చెయ్యమంటారు. అలాచేస్తే మార్గమధ్యంలో నున్న జీవునికవి లభించి ప్రయాణంలో నాతడు బాధపడడట! కాని వీరిచ్చినవన్నీ యిక్కడ పురో హితుని దగ్గరే ఉంటవి.

ఇంతటితోనే జీవునికి యిక్కట్లు తొలగలేదు సుమండీ. అసలు పెద్దగండం ఉంది. మధ్యలో వైతరణీనది ఒకటి దాటాలి! దానిలో చీము,

నెత్తురు ఆకాలం ఈకాలం అనకుండా ఎప్పుడూ పారుతునే ఉంటుందట అది ఎండకాలంలోకూడ ఎండదట ! ఆ నది కొన్ని యోజనాల వెడల్పుంటుందట ! అది దాటాలంటే జీవుడు ఒక్కడే దాటలేడట! ఆ చీము నెత్తురులో పడి పాపం ఎలా ఈదుతాడు? అందుకని, సహాయంగా ఒక గోవును పంపితే ఆ గోవు తోకను పట్టుకొని జీవుడు ఎలాగో నదిని దాటుతాడట ! దాటేటప్పుడు తలతప్ప అతని శరీరంయావత్తు చీము నెత్తురులోనే ఉంటుందట. అప్పుడప్పుడు అలలతాకిడికి చీము నెత్తురు ముక్కుల్లోనికి, నోటిలోనికి పోతుందట పాపం ! ఎలాగైతేనేం గోవుఉంటేమాత్రం జీవుడు వైతరణిని దాటుతాడట ! అందుకని యిక్కడ పురోహితునికి ఒక గోవును దానం చెయ్యమంటారు. అలా దానంచేస్తే అక్కడ జీవునికి గోవులభించి వైతరణి దాటుతాడు (సభలో నవ్వులు). ఇంకొక విచిత్రమేమంటే- యిక్కడ మనంచేసే దానాలు అంటే గోవు, మంచం, పరుపు, గొడుగు, చెప్పులు యిత్యాది దానాలు యిక్కడ పురోహితునికి చేస్తేనే అక్కడ జీవునికి చెందుతాయట! యింకెవరికైనా దానంచేస్తే అవి చెందవట ! మరి యీ పురోహితులు వారికి ఏజంట్లో ఏమో మరి !

తరువాత యమ భటులు జీవుణ్ణి యమధర్మరాజు దగ్గర ప్రవేశపెడతారట! అపుడు యమధర్మరాజు లెక్కల గుమాస్తా అయిన చిత్రగుప్తుణ్ణి పిలిచి ఏమిటి వీడిసంగతి? పాపపుణ్యాల జాబితా బయటికి తీసి వీడేంచేశాడో చెప్పుమంటాడట ! (సభలో నవ్వులు). మహాప్రభో ! ఈ జీవుడు ఫలానా ఫలానా పాపాలు చేశాడని చిత్రగుప్తుడు చెబితే యముడతనికి తగినశిక్ష విధించి బాధలు పెడతాడట !

మా అమ్మ చనిపోయినపుడు నే నసలు దశగాత్రాలు చేయించలేదు. దశగాత్రాలు చేస్తేగదా ఆమెకు యాతనాశరీరం వచ్చేది ? యాతనాశరీరం ఉంటేగదా మా అమ్మను యముడు శిక్షించేది ? యాతనాశరీరం లేనిదే

యమధర్మరాజు కూడ మా అమ్మను ఏమీ చేయలేడుకదా! అందుకని యీ సంగతి మా అన్నయ్యకుచెప్పి మా అమ్మకు దశగాత్రాలు చేయడం మాన్పించాను. యాతనాశరీరం లేదని యముడు మా అమ్మను తిరిగి పంపించివేశాడనుకోంచి, మంచిదేకదా! ఆమెవచ్చి యింట్లోనే ఉంటుంది. నష్టమేముంది? కాస్త యింటికి కాపలా అయినా కాస్తుంది గదా! (సభలో నవ్వులు). నాకు తెలియని రోజుల్లో మా నాన్నకు మాత్రం 'రెగ్యులర్'గా (Regular—క్రమము తప్పకుండా) తద్దినాలు పెడుతుండేవాడు మా అన్నయ్య. కాని మా అమ్మకు మాత్రం నేను పెట్టనివ్వలేదు. అందుచేత మా నాన్న సంగతి నాకు తెలియదు గాని, మా అమ్మమాత్రం నరకానికి వెళ్ళలేదని గట్టిగా చెప్పగలను. (సభలో కడుపుబ్బ నవ్వులు విననయ్యేను). మిగిలింది రేపు.

---

గుంటూరు, 31-12-1968
మంగళవారం, సా॥ గం. 6-00

మహాజనులార!

ఇంత వరకు 8 మంత్రాలు చెప్పుకున్నాం. ఈ మొదటి ఎనిమిది మంత్రములలో ఈశ్వరుని స్వరూపాన్ని గురించి తెలుసుకున్నాం. ఈ దినం యింకా విశేషంగా తెలుసుకుందాం. వేదము పరమేశ్వరు నొక్కనినే ఉపాసింపవలెనని చెబుతుంది. వేదములలో దేవునకు అనేక నామములున్నట్లు తెలుస్తుంది. వానిలో ఉత్తమనామం 'ఓం' అని ఎంచబడుతుంది. ప్రాచీన ఋషులు పరమేశ్వరుని 'ఓం' తోనే స్మరించారు. 'ఓం ఇతి ఉద్గీథ ముపాసీత' (ఛాం. ఉ.) భగవంతుని 'ఓం' అని ఉపాసింపవలెను. బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడు, ఇంద్రుడు, లక్ష్మి, సరస్వతి, శక్తి, కాళి, అను నిట్టివి పరమేశ్వరుని నామములు. ఇలాంటి వింకా ఎన్నో ఆయన

కున్నాయి. పై పేర్లకు ఒక్కొక్క దేవతను, ఆ దేవత కొక్కొక్క విగ్రహమును కల్పించి వానిని ఉపాసించడం మొదలుపెట్టారు పౌరాణికులు. దయానంద మహర్షి వీనిని నిరసించాడు. ఆయన ఈ యుపాసనలన్నీ అవైదికా లన్నాడు. పరమేశ్వరుడు అంతటా ఉన్నాడు. ఆయన శరీర రహితుడు, సర్వశక్తిశాలి, శుద్ధుడు, పాపరహితుడు, కవి, మనీషి అని నిన్న చెప్పుకున్నాం. 'సఏవ ఉపాసనీయః' అతడే ఉపాసింపదగినవాడు.

పరమేశ్వరునికి దేవుడు అనే పదంకూడ కలదు. వేదాలలో యీ 'దేవ' పదం చాలచోట్ల వస్తుంది. వ్యాఖ్యానకారులు వేదములలో చెప్పబడిన దేవతలు మొత్తం (33) ముప్పది ముగ్గురు. 'త్రయస్త్రిగ్ంశో వై దేవాః' అని నిర్ణయించారు. 34వ దేవత పరమేశ్వరుడు.

యాస్క మహర్షి తమ 'నిరుక్తం'లో 'దేవః' అనే పదాన్ని, దేవో దానాద్ వా. ద్యోతనాద్వా, దీపనాద్వా, అథ ద్యుఃస్థానాద్వా' అని నిర్వచించారు. వీటిని గురించి * ఒకనాడు సంక్షేపంగా చెప్పాను. 'దానము చేయుట, ప్రకాశించుట, ప్రకాశింపజేయుట, ద్యుఃస్థానమున నుండుట' అను లక్షణములు గల భూమ్యాది పంచభూతములు, సూర్య చంద్రులు, విద్యుత్తు మున్నగు పదార్థములు శాస్త్రములందు దేవతలని వ్యవహరింబడతాయని చెప్పాను.

'కతి వై దేవాః' అవి ఎన్ని ? త్రయస్త్రిగ్ంశో వై దేవాః' - అవి ముప్పది మూడు. ఆ దేవత లెవరు? "అష్టౌ వసవః, ఏకాదశ రుద్రాః, ద్వాదశాదిత్యాః, ఇంద్రః, ప్రజాపతిః"

అష్టవసువులు : ఆ ఎనిమిది దేవత లెవరంటే, పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, చంద్రుడు, సూర్యుడు, నక్షత్రములు. అష్ట వసువులంటే పురాణాలలో చెప్పబడిన వసువులు కారు. పురాణాలలో అష్ట

* 26-12-68 తేదీ ఉపన్యాసములో దేవతలను గురించి చెప్పియున్నారు.

వసువులు శాపగ్రస్తులై శంతనునికి గంగవలన పుడతారని, భీష్ముడు 8 వ వసువని మనం చదువుతాము. వేదంలో చెప్పబడిన వసువులు వీరు కాదని గ్రహించాలి. 'వసం జీవా యేషు తే వసవః'. ఏనియందు జీవులు వసించుతుంటాయో వానిని వసువు లంటారు. నీటిని వరుణలోకం అంటారు. అక్కడ జీవు లుంటాయి. అలాగే వాయువులో కూడ జీవులున్నాయి. భూమిపై ఉన్నాయి. అగ్నిలో కూడ జీవులున్నాయి. అవి అగ్ని తత్వంగల తేజశ్శరీరములతో ఉంటాయి. జీవులు వసించుటకు తగిన స్థానములు కనుక ఈ ఎనిమిదింటికి వసువులని పేరు.

ఏకాదశ రుద్రాః : పది ప్రాణములు, జీవాత్మ కలిసి ఏకాదశ రుద్రులు అనబడతాయి. ప్రాణము, అపానము, ఉదానము వ్యానము, సమానము అని ముఖ్య ప్రాణములు అయిదు; నాగ, కూర్మ, కృకల, దేవదత్త, ధనంజయములను ఉప ప్రాణములు అయిదును కలసి మొత్తం దశ ప్రాణములు. ఇవి శరీరంలో భిన్న భిన్న ప్రదేశములలో ఉండి పలు విధములైన పనులు చేస్తుంటాయి. 'హృది ప్రాణః' - హృదయంలో ప్రాణ ముంటుంది. ఇది ఊపిరితిత్తులు, గుండె వీటి చలనమునకు తోడుపడుతుంది. 'గుదే అపానః' - అపానము గుదస్థానములో ఉంటుంది. మలమూత్ర, వీర్య విసర్జనములు దీనివలన కలుగుతుంటాయి. 'సమానో నాభి సంస్థితః'- సమానమను ప్రాణము నాభిదేశమునందుండి జఠరాగ్నిని ప్రేరేపించి అన్నాదులను జీర్ణింపజేస్తుంది. 'ఉదానః కంఠదేశస్థః'-ఉదానమను ప్రాణము కంఠమందుండి వాంతులు మున్నగువానికి తోడుపడుతుంది. 'వ్యానః సర్వ శరీరగః' - వ్యానము శరీరమంతటా ఉండి రక్త ప్రసరణకు తోడ్పడుతుంది. ఇవి అయిదును ముఖ్యప్రాణములు. మిగిలిన ఉపప్రాణము లయిదును ఇలాగే శరీరమున పలురకముల కార్యములు చేస్తుంటాయి. ఈ పది ప్రాణములు, జీవుడు శరీరమును వదలిపెట్టినపుడు అతనితోకూడ వెళ్ళి

పోతాయి. మనుష్యునికి ప్రాణములు పోయేటప్పుడు బంధువుల నందరిని ఏడిపిస్తాయి. కనుక యివి రుద్రు లనబడుతాయి. 'రోదయంతీతి రుద్రాః'- ఇవి ఏడిపించే దేవతలు కనుక వీటిని రుద్రులన్నారు.

ద్వాదశాదిత్యాః : ఆదిత్యులు పండ్రెండు. ఆదిత్యు డంటే సూర్యు డని అర్థం. సూర్యునివలననే మనకు ఉదయ, సాయం సమయములు, రోజులు, నెలలు ఏర్పడుతున్నాయి. ఈ విధమైన కాలరూపంగా ఆయన జీవులయొక్క ఆయువును హరించుతున్నాడు; కనుక 12 నెలలకు 'ద్వాదశాదిత్యాః' అని పేరు. 'ఆదత్తే ప్రాణానితి ఆదిత్యః' ప్రాణుల ఆయువును గ్రహించుతాయి గనుక 12 నెలలు ఆదిత్యు లనబడినాయి. 32 వ దేవత ఇంద్రుడు. ఇంద్రు డంటే మెఱుపు అని. 33 వ దేవత ప్రజాపతి లేక యజ్ఞము. వాయువు, జలము, ఔషధముల శుద్ధియును, విద్వాంసుల సత్కారమును, శిల్పవిద్యలను కలిగించి యజ్ఞము ప్రజలను పాలించుతుంది. కాబట్టి యజ్ఞమునకు ప్రజాపతి యనిపేరు. ఈ ముప్పది మూడు దేవతలలో జీవుడు మాత్రము చేతన పదార్థం. అంటే జ్ఞానం కలిగింది. మిగిలిన ముప్పది రెండును జడములు. కనుక చేతనుడైన జీవుడు యీ ముప్పది రెండు పదార్థములను ఉపయోగించుకోవాలి. కాని ఉపాసింపరాదు. 34 వ దేవత అయిన పరమేశ్వరుని మాత్రమే ఉపాసించుట యుక్తం. ఎందులకంటే పరమేశ్వరుడు పైన చెప్పిన 33 దేవతలకు స్వామి. అన్నిటికంటె గొప్పవాడు. సచ్చిదానందస్వరూపుడు. కనుక జీవుడు జడదేవతలను ఉపయోగించుకొని కేవలచైతన్య స్వరూపుడైన ఈశ్వరుణ్ణే ధ్యానం చెయ్యాలి.

భగవద్గీతను విన్నవాళ్లు, చదివినవారు భగవంతు డవతరిస్తాడని అంటారు. రాముడు, కృష్ణుడు, క్రీస్తు మొదలైనవారు దేవుళ్ళు కాదని ఒక మారు చెప్పాను. అవతారవాదులు రామ, కృష్ణాదులు దేవుని అవతారము

లెందుకు కారాదంటారు. భగవద్గీతలోని రెండు శ్లోకాలు అవతార వాదులకు బలమైన ప్రమాణంగా కనబడతాయి.

యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత ।
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్॥

గీ. ౪. ౭

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥

గీ. ౪-౮

ఎప్పుడెప్పుడు ధర్మమునకు ముప్పుకలుగుచుందో అప్పుడప్పుడు సత్పురుషులను రక్షించుటకు దుష్టులను శిక్షించుటకు, ధర్మమును సంస్థాపించుటకును నేను పుడుతుంటాను. ఇదీ పై శ్లోకముల అర్థం.

ఈ శ్లోకములను పరమప్రమాణముగా భావించి ఆస్తికులు భగవంతుడు అవతరిస్తా డంటారు. కాని వైదికు లిది అంగీకరించరు. ఈ సిద్ధాంతం వేదశాస్త్రాల కనుకూలం కాదు. (పదచ్ఛేదంచేసి పదములను విడివిడిగా చదువుచు) చూడండి, అవతారపదం యీ రెండు శ్లోకాల్లో లేదు. మరి దీన్నెలా కల్పించారో తెలియదు. కృష్ణుడు తా నవతరిస్తుంటానని అన్నట్లు అవతారవాదులు చెబుతుంటారు. భగవద్గీతలో 700 శ్లోకాలు న్నాయి. ఇచట గీతాపారాయణం నిత్యంచేసే భక్తులుంటారు. నా కెక్కడా అవతారపదం గీతలో కనబడలేదు. మరి వారికేమైనా తెలుసునేమో ! చూప వచ్చును.

భగవంతుడు జన్మించితే చచ్చితీరాలి. 'జాతస్య హి ధ్రువో మృత్యుః-(గీ. ౨-౨౭) అని గీతే చెబుతుంది. అందుకని భగవంతుడు జన్మిస్తాడనకుండ ఆయన అవతరించుతా డంటారు ! ఆస్తికుడు దేవుడు

చస్తాడంటే ఒప్పుకోడు. రామకృష్ణాదుల శరీరాలు మామూలు శరీరాలు కాదంటారు. అవి లీలా మానుష విగ్రహాలట!

పిల్లవాళ్ళకు చదువుచెప్పే ఉపాధ్యాయులను బడిపిల్లలు ఏవైన ప్రశ్నలు వేస్తే వాటికి సమాధానం చెప్పలేనపుడు కోపించి కూర్చోబెడ తారు. (సభలో నవ్వులు). నేను యిదివరలో ఎలిమెంటరీ స్కూలు టీచ రుగా కొన్నాళ్ళు పనిచేశాను. ఒకరోజు పాఠం చెబుతుంటే ఆ పాఠంలో 'అంతఃకరణము' అనే పదం వచ్చింది. నేను తెలుగు నిఘంటవు చూచి దానికర్థము మనస్సని, చిత్తమని తెలుసుకున్నా. పాఠంచెబుతూ, అంతః కరణమంటే మనస్సని అర్థం చెప్పాను. ఒక కుఱ్ఱవాడు లేచి సార్! మనస్సంటే ఏమిటి అన్నాడు. నేను ధీమాగాచిత్తమని జవాబిచ్చాను. ఇంకొక కుఱ్ఱవాడు లేచి, సార్! చిత్తమంటే ఏమిటండీ అన్నాడు. ఇక నాదగ్గర పదాలు అయిపోయినాయ్. ఇంకేం చేస్తాను. వెధవా! చిత్తమంటే మనస్సనలేదా అని చెప్పి గదమాయించి కూర్చోబెట్టా! (సభలో నవ్వులు). అలా ఉంటుంది మనవాళ్ళుచెప్పే 'లీలామానుషవిగ్రహం'. లీలేమిటి? మానుషవిగ్రహ మేమిటి? మానవశరీరమును మానుషవిగ్రహం అంటారు. మరి లీలేమిటి? అంటే ఈ శరీరం లేదనా? రామునికి శరీరం లేనిదే ఆయనను కౌసల్య ఎలా ముద్దుపెట్టుకుంది? ఆయన సీతతో చరింపలేదా? రావణాదులు వేసిన బాణములకు ఆయన నొచ్చుకోలేదా?

"ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజం"

రామాయణం.

'నేను నన్ను, మనుష్యునిగా ఎంచుతున్నాను. నా పేరు రాముడు. నేను దశరథుని పుత్రుడను' అని ఆయన నిస్సందిగ్ధంగా చెబుతుంటే అవ తారవాదులు ఆయనను భగవంతుడని, అవతారమని అంటుంటారు. శ్రీకృష్ణు డంటాడు.

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తాన్యహం వేద సర్వాణి నత్వం వేత్థ పరన్తప ।- గీత ४-५.

'అర్జునా ! నాకును నీకును అనేకజన్మలు గడచినై. నేను వాట న్నింటిని ఎఱుగుదును, కాని నీవెఱుగవు. అని కృష్ణుడు తాను జన్మలు ఎత్తినట్లు ఒప్పుకుంటున్నాడు. కనుక ఆయనకూడ అందరివలె జనన మరణములకు లోనయినట్లు తెలుస్తున్నది. యోగసిద్ధుడు కనుక ఆయనకు తానెత్తిన జన్మలు గుర్తున్నాయి. అర్జునునికవి గుర్తులేవు. కాని యిద్దరు జీవులే !

ఇక అవతార శబ్దాన్ని గురించి తెలుసుకుందాము. 'అవతరణ' మంటే; తరణం అంటే దాటడం, అవతరణం అంటే దిగడం అని అర్థం. దిగుట అంటే పైనుండి క్రిందికి వచ్చుట. 'బాలః ప్రాసాదాత్ అవతరతి'-బాలుడు మేడనుండి దిగుచున్నాడు. ఒక శరీరధారి ఒకచోట నుండి ఇంకొక చోటికి దిగుట, ఎక్కుట సంభవిస్తుంది. మరి పరమేశ్వరు డలా కాదుగదా ! ఆయన సర్వవ్యాపి. శరీరము లేనివాడు. అలాంటివాడు అవతరించుతాడంటే ఎలా సాధ్యమౌతుంది? పైగా దేవుళ్ళని చెప్పబడే త్రిమూర్తులలో కూడ, ఒక్క విష్ణువుకే యీ అవతారాలు కల్పించారు. మరే దేవుళ్ళకు లేవు. ఆయనకు వైకుంఠము నొకదానిని సృష్టించారు. ఆయన వైకుంఠంలో ఉండి అప్పుడప్పుడు భూమికి దిగుతాడట !

అవతారములు రెండు విధములట :- పూర్ణావతారములని, కళావ తారములని. కృష్ణుడు పూర్ణావతారమట. రాముడు, పరశురాముడు తదిత రులు కళావతారములట ! కళావతారములంటే అయనలోని కొన్ని కళలే యీ అవతారాలల్లో ఉంటాయట. మరి రాముడు పుట్టకముందు కౌసల్య గర్భం ఖాళీగా ఉందా? పరమేశ్వరు డామె గర్భంలో అంతకుముందే వ్యాపకమై ఉన్నాడుకదా! ఆయన, ఈ ప్రపంచంలో లోపల వెలుపల

అంతట వ్యాపించియే ఉన్నాడు కదా. కనుక భగవంతుడు అవతరించుతా డనడం ఎట్లా పొసగుతుంది।

శరీరం జీవునికి కర్మఫలం అనుభవించడానికి వస్తుంది. శరీరం ఉంటేనే కర్మఫలాలను మన మనుభవించగలం. పరమేశ్వరుడు అవతార మెత్తి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తాడట। శిష్టులను రక్షించి దుష్టులను మాత్రమే శిక్షిస్తాడట। మరి కృష్ణుడు కంస, శిశుపాలాదులను మాత్రమే శిక్షించాడు. కాని ఆయన జరాసంధుని చేతిలో ఓడిపోయాడు. చివరకు అతన్ని భీమునిచేత చంపిస్తాడు. మీలో కొందరు. గోపదేవ్ పురాణాలు బాగా చదువుకోలేదు, అందువలన జరాసంధునికి భీమునిచేతిలో చావవలసిన శాపమున్నదని తెలియదు అంటారేమో। మరి కృష్ణుడు పరమాత్మ అయిన పుడు, శాపమున్న సంగతి ఆయనకు తెలియవలయునుకదా। బుద్ధిలేకుండా అతనితో యుద్ధం చేయడ మెందులకు? పదహారుసార్లు తన్నులు తినడ మెందులకు? (సభలో నవ్వులు). ఒక్కసారే భీమునిచేత చంపిస్తే పోదూ। ఆయన చివరకు తన యాదవ వంశం నాశనమవుతున్నా ఏమీ చేయలేకపోతాడు। తాను భిల్లుని బాణానికి గురియై చచ్చిపోతాడు. ఇదేమి టంటే భగవంతుడు రాముని అవతారంలో తప్పుచేశాడు. అందుచేత కృష్ణావతారంలో ఆ కర్మఫలం అనుభవించాడంటారు. మంత్రంలో 'అపాపవిద్ధం'- పరమేశ్వరుడు పాపముచేత అంటబడడు అని చెప్పబడినది కదా। కనుక రామకృష్ణాదులు పాపఫలం అనుభవించుటచేత వారు, భగ వంతు లెట్లవుతారు?

పతంజలి మహర్షిని శిష్యులడుగుతారు, ఎలాంటివాడు ఈశ్వరు డన బడతాడని. ఆయన చెబుతాడు.

'క్లేశ కర్మ విపాకాశయై రపరామృష్టః పురుష విశేష ఈశ్వరః'

యో. ద. ౧-౨౪

పురుష విశేష డంటే – పురుషోత్తముడు. లేక పరమాత్మ అని. పరమాత్మ క్లేశములు, కర్మలు, విపాకాశయములు-వీటిచే అంటబడడు. జీవులే వీటి ననుభవిస్తారు.

"అవిద్యాఽస్మితా రాగ ద్వేషాభినివేశాః (పంచ) క్లేశాః"

యో. ద. २-३

అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము అని క్లేశము లైదు. ఈ అయిదు రకముల క్లేశములతో పరమేశ్వరునికి సంబంధం ఉండదు. ఉంటే అతడు పరమేశ్వరుడు గా డనవలసి యున్నది.

అవిద్య అంటే-

"అనిత్యాశుచి దుఃఖానాత్మసు నిత్య శుచి సుఖాత్మ ఖ్యాతి రవిద్యా"

యో. ద. २-४

అనిత్యమైన వాటిని నిత్య మను కోవడం, అశుచిని శుచి అనుకోవడం, దు:ఖములను సుఖమను కోవడం, అనాత్మను ఆత్మ యని యెంచడం అవిద్య అనబడుతుంది.

అరవిందుడు పూర్ణయోగమును గూర్చి ఎంతగానో చెప్పేవాడు. పూర్ణయోగంలో శరీరం చావదంటాడు. అది నిజమే ననుకొని అరవిందుడు మరణించినపుడు ఆయన శిష్యులు పేపర్లలో కూడ ప్రచారం చేశారు. అరవిందుని శరీరం చెడదు; అలాగే ఉంటుంది. చనిపోయిన తరువాత మూడురోజులు ఆయన శరీరాన్ని అలాగే ఉంచారు కూడ. కాని వాసన బుట్టి మూడవనాడు పూడ్చివేయవలసి వచ్చింది. శరీరం పంచభూతాత్మకం కనుక మరణానంతరం దాని మూలపదార్థములలోని కది చేరిపోవడం ప్రకృతి ధర్మం. దాన్నెవరూ అరికట్టలేరు కనుక శరీరం నిత్య మెన్నడూ కాదు.

మన శరీరంలోపల అన్నీ మలాలే. నవద్వారాలలో నుండి వచ్చేవన్నీ మాలిన్యాలే. మలమూత్రములు, పుసి, గుమిలి, చెమట ఇత్యాది మలినాలు యీ నవరంధ్రాలనుండి ఎప్పుడూ వస్తుంటాయి. శరీరం అశుచికి పుట్ట. తోలు తీసి వ్రేలాడగడితే యీ శరీరం భయంకరంగా ఉంటుంది. అందరిశరీరాలు యింతే. కనుక అశుచియైన శరీరాలను శుచి అనుకోవడం అవిద్య. శంకరచార్యు డంతటి వాడు, ఒక మాలవాణ్ణి నీవు అస్పృశ్యుడవు; దూరముగా వెళ్ళు అంటాడు. తన అశుచియైన శరీరాన్ని గుర్తించకుండ యితరుని శరీరాన్ని అశుచి అనుకుంటాడు. ఇది అవిద్య. ఈ అవిద్య పండితపామరులకు కూడ సమంగ ఉన్నట్లు తెలుస్తుంది. మనం మన శరీరం మాత్రం శుచి అనుకుంటాం. ఇతరలవి కావనుకుంటాం. సాటి మానవుణ్ని కుక్క కంటె హీనంగా చూస్తాం. కుక్కలను, పిల్లులను యిళ్ళలో తిరుగ నిస్తాము. పైన ఎక్కించుకుంటాము. వాటిని ముద్దుపెట్టుకుంటాము కూడ. (సభలో నవ్వులు). కాని సాటి మానవుణ్ణిమాత్రం దగ్గరకు చేరనీయము. ఇది అవిద్య.

ఇకపోతే 'అస్మిత' – అంటే మోహము. 'రాగము'– ప్రాపంచిక సుఖములయందు అభిలాష కలగడం రాగ మనబడుతుంది. 'సుఖాను శయీ రాగః' – (యో. ద. ౨–౭) ప్రాపంచిక విషయములు మొదట సుఖము గానే ఉంటాయి. తరువాత దుఃఖములను కలిగిస్తాయి. కనుక రాగముకూడ ఒక క్లేశము. మనకు దేనివలన దుఃఖము కలుగుతుందో దానియెడ వైర భావము కలిగియుండుట ద్వేషము. 'దుఃఖానుశయీ ద్వేషః' (యో. ద. ౨–౮) ద్వేషమనేదికూడ ఒక క్లేశముక్రింద చెప్పబడింది. అభినివేశము– ఇది అయిదవ క్లేశము. అభినివేశమంటే నేను చావకుందును గాక ; జీవింతును గాక! అను భావము. ఈ అయిదు విధములైన క్లేశములకు పరమేశ్వరుడు అతీతుడుగా ఉంటాడు.

రెండవది. ఆయన శుభాశుభ కర్మలుకూడ చేయడు. మనము చేసే శుభాశుభ కర్మలవలన అంతఃకరణములో Impressions సంస్కారములు ఏర్పడతాయి. వీనినే వాసనలని విపాకాశయములనికూడ అంటారు. అవతార పురుషులు క్లేశాదులకు లోబడిన వారగుటచే వారు దేవుళ్ళుకారు.

కనుక పరమేశ్వరుడు క్లేశములు, కర్మలు, విపాకాశయములు వీటన్నింటికి అతీతుడు. కాని, అవతారవాదుల ప్రకారం, పై ఉదాహరణల వలన పరమేశ్వరుణ్ణి మనం ఎంత హీనస్థితికి తెస్తున్నామో అర్థమౌతుంది. వేదము లిట్టి సిద్ధాంతముల నంగీకరించవు.

ఇకపోతే 'ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' రాముడు, కృష్ణుడు వీరు రాకముందు ప్రపంచంలో ధర్మం లేదా? పోతే, రామునికి పూర్వం ఏకపత్నీ వ్రతం చేసినవారు, పితృవాక్యమును పాలించిన వారు లేరా? మరి ప్రత్యేకించి వీరు లోకానికి ఏమి నేర్పారో అర్థంకాదు. సృష్ట్యాదినుండి మన మహర్షులు ఈ ధర్మాలను బోధించడం లేదా? వేదములలో ఈ ధర్మములు చెప్పబడడం లేదా? భగవంతు డవతరించి లోకమునకు నేర్పిన క్రొత్త యేమున్నది?

రాముని కాలంలో ఉన్న వాలి బలవంతుడు. అతడు రావణాసురుని కంటె బలవంతుడు. అలాంటివానిని రాముడు చెట్టుచాటున ఉండి చంపుతాడు. చనిపోయేముందు వాలి, రామా! నీవు కాకితో కబురుచేస్తే నేను సీతను తెప్పించనా? నన్నెందు కిలా దొంగచాటుగా చంపావని అడుగుతాడు. నీవు జంతువవు కనుక చాటున ఉండి వేటాడి చంపానంటాడు రాముడు. మరి సుగ్రీవుడు (వాలి తమ్ముడు) కూడ జంతువే కదా? కాని యతనితో రాముడు స్నేహం చేస్తాడు. ఇది ఎంతటి న్యాయంగా ఉందో చూడండి. జంతువు కనుక రాముడు వాలిని చెట్టు చాటున ఉండి చంపా

దని వాల్మీకి తన రామాయణంలో అంటాడు. చూడండి, ఆయన ఎంతటి దుర్బల సమాధానం యిచ్చాడో!

నిర్మాణం చెయ్యడంకష్టమా లేక చెడగొట్టడమా? నిర్మాణమే కష్టం. మేడ నిర్మాణం కష్టం. దాన్ని కూలద్రోయడం సులభం. అలాగే బిడ్డను చంపడం సులభం కాని పుట్టించడం కష్టం. పుట్టించడం కష్టమని ఏ తల్లి నడిగినా చెబుతుంది. చంపటం సులభం. రావణాది దుష్టులను పుట్టించడానికి భగవంతు డవతరించాడా? లేదుకదా! మరి వాళ్ళను చంపడానికి అవతరించడ మెందుకు? వాడి గుండెను ఆపివేస్తే సరిపోయేది కదా! అపుడు రామావతారంతో పనిలేకుండా పోయేది. పైగా రావణాసురుని కాలంలో భగవదవతారమని చెప్పబడే పరశురాముడె లాగూఉన్నాడు గద! ఒకవేళ రావణుడు నరావతారం వలనగాని చావడంటే! పరశురాముడు కూడ నరావతారమే కద! ఆయనే రావణాసురుని చంపవచ్చును గదా! వేరే రాముడుగా భగవంతుడేల అవతరించవలసి వచ్చింది. దశావతారముల్లో ఒక్క పరశురాముడు మాత్రం బ్రాహ్మణావతారం. ఎందరో రాజులను చంపినవాడు. రావణాసురుణ్ణి అతడెందులకని చంపలేదు. రావణుడు పులస్త్యబ్రహ్మ కొడుకు. సాటి బ్రాహ్మణుడు. రాజు కాడు కదా! బహుశాఅందుకనే ఆయన రావణాసురుని చంపలేదేమో అనిపిస్తుంది. (సభలో నవ్వులు). మరి ఆ బుద్ధితో రావణుని వదలిపెడితే భగవంతుడు పక్షపాతి అగును కదా!

పైగా విష్ణువు అవతారములని చెప్పబడే వీళ్ళిద్దరూ (రాముడు, పరశురాముడు) ఒకళ్ళ నొకళ్ళు ఎదుర్కొంటారు. తామెవరో తెలుసుకోరు. శరీరం దాల్చడంతో వారికి మతి పోయిందేమో. లేకపోతే పరస్పరం యుద్ధం ఎందుకు చేస్తారు? కాసేపు తన్నుకున్న తరువాత ఓహో మన మిద్దరం విష్ణు అవతారంగదా అనుకుంటారు. (సభలో నవ్వులు). ఈ విధంగా అవతారవాదంలో పస కనిపించదు.

అదీగాక భగవంతుని అవతారాలన్నీ యీ దేశంలోనే పుట్టా యంటారు. ఇది ధర్మభూమి, కర్మభూమి యని చెప్పుకుంటారు. భగవంతుడు యిన్నిసార్లు యిక్కడే అవతరించాడంటే యీ దేశంలోనే పాపం ఎక్కువగా ఉన్నదని తేలుతుంది. ఇతరదేశాలలో ఈ అవతారాలు లేవు. అందుచేత పాపంకూడ యింతగా అక్కడలేదేమో! రావణాదులు, ముసోలిని, హిట్లర్ల కంటే పాపులా? వారివలన వేలాది జనులు మరణించారు. అమెరికా వాడొకడు జపాన్‌లోని హిరోషిమా పట్టణం పై అణుబాంబువేసి క్షణంలో 2½ లక్షల మందిని చంపాడు. (రెండవ ప్రపంచ యుద్ధంలో). రావణుడు వీళ్ళందరి కంటె ఎక్కువ పాపం చేశాడా? మరి భగవంతుడు వారిని శిక్షించడానికి అవతరించ లేదెందుకు?

అందుచేత భగవంతు డెప్పుడూ శరీరధారి కాడని ఆర్యసమాజము వారంటారు. వేదములలో యిదే చెప్పబడినది. పగటివేషగాడి మాయలకే మనం లోనవుతాము. పరమేశ్వరుని లీలావిలాసములను తెలుసుకోగలమా? భగవంతుడు సర్వశక్తిమంతుడు కావున అవతరించగలడు అంటారు. అటులయిన అతడు చావగలడా? అంటే అది ఒప్పుకోరు. (సభలో నవ్వులు). భగవంతుడు సర్వవ్యాపి. శరీరధారణ చేయటం లేక అవతరించడం అనేది ఆయన స్వభావానికి విరుద్ధం. స్వభావానికి విరుద్ధంగా చేయకపోవటం బలహీనతకాదు. భగవంతునిచేత పగటివేషాలు వేయించడం ఆయన శక్తిసామర్థ్యాలకు నిదర్శనమా? ఏ శరీధారణచేయకుండ ఈ మహావిశ్వమును సృష్టించగలిగిన పరమేశ్వరుని శక్తిసామర్థ్యములముందు రామకృష్ణాదులు చేసిన పను లెంతటివి?

భగవంతుడు సక్కుబాయికి పిండి విసిరాడట! భూమిని చాపగా చుట్టి తీసికొని వెళుతుంటే హిరణ్యాకశిపుణ్ణి భగవంతుడు పంది అవతారంలో వచ్చి చంపాడట! కూర్మావతారం. అంటే తాబేలురూపం ధరించి భగవం

తుడు మందరగిరిని మోశాడట। ఇలాంటి కథలన్నీ మనం పురాణాల్లో చదువుతుంటాము. వేదాలల్లో యిలాంటి అవాస్తవికములు, హేతు విరుద్ధములు నైన విషయాలు ఎక్కడా చెప్పబడలేదు.

భగవద్గీతలో కృష్ణుడు 'సంభవామి'-పుడతానంటాడు. పుడితే పుట్టనివ్వండి. చిక్కేమిటి? గాంధీజీ అస్పృశ్యత దేశంలో ఉన్నంతకాలం నేను మరల అస్పృశ్యుల మధ్యలో పుట్టి అస్పృశ్యత (అంటరాని తనం) నశించే వరకు విశ్రమించనంటాడు. దుఃఖములచే తపించువారికొఱకు. ప్రాణుల ఆర్తినాశనముకొఱకు జన్మలెత్తుతామంటారు మహాపురుషులు. తమకు స్వర్గం అక్కరలేదు. మోక్షసుఖం అక్కరలేదని మహాపురుషులు ఎంచుతారు. శ్రీ బాలగంగాధరతిలక్- స్వరాజ్యం వచ్చేవఱకు నేను భారతదేశంలో మరల మరల పుడతానంటాడు. ఆయన చనిపోయేటప్పటికి మనదేశం స్వతంత్రం కాలేదనుకోండి. మహాత్ములు కోరి తాము పుట్టవచ్చును కాని భగవంతుడు పుట్టడమేమిటి?

భగవంతుడు న్యాయకారి కనుక చేసిన తప్పులను ఆయన క్షమించడు. క్రైస్తవులు మనంచేసిన పాపాలను భగవంతుడు క్షమిస్తాడంటారు. క్రైస్తవులు తాము చేసిన తప్పులను ప్రతివారం ఫాదరీల చెవులలో చెబుతుంటే వారి పాపాలు పోతాయట. ఫాదరీ వాటిని భగవంతునికి (Submit) నివేదిస్తాడట. క్రైస్తవులు ఒక వారంలో చేసిన తప్పులు, ఫాదరీ చెవులల్లో చెప్పినందువల్ల తొలగిపోతాయి కనుక వారు మళ్ళీవారం వచ్చేదాకా పాపాలు చెయ్యవచ్చు ననిపిస్తుంది. (సభలో నవ్వులు). ఇక మహమ్మదీయులు—తప్పులుచేసి 'తోబా' అని చెంపలు వేసుకుంటే పాపాలు పోతాయంటారు. వైదిక దేవుడుమాత్రం యిలా క్షమించడు. మీరు ఒప్పుకోకపోయినా ఫరవాలేదు. కర్మఫలితం తప్పనిసరిగా అనుభవించాలంటుంది వేదం. 'నా భుక్తం క్షీయతే కర్మ'—అనుభవించకుండ కర్మఫలము వదలిపెట్టదు. చేసిన కర్మలఫలితము ననుభవింపజేసినప్పుడే

భగవంతుడు న్యాయకారి అవుతాడు. మంచిచేస్తే మంచి. లేక చెడుచేస్తే చెడు తప్పనిసరిగా అనుభవింపచేస్తాడు భగవంతుడు. లేకపోతే ఆయన అన్యాయకారి అవుతాడు. కొందరు తిరుపతి వెళుతుంటారు పాపాలు పోగొట్టుకోవడానికి. పాపపుడబ్బు కోట్లుగడించి ఎవరికి తెలియకుండా హుండీలో లక్షల రూపాయలు పడవేస్తుంటారు.

దయాళుడు:- భగవంతుడు దయాళు డనడంలో అర్థం, చేసిన తప్పిదములను క్షమించి విడిచిపెడతాడని కాదు. చేసిన తప్పులకు ఫలిత మనుభవింప చెయ్యటంవల్లనే ఆయన దయాళు వవుతాడు. దొంగతనము చేసినవాణ్ణి క్షమించి విడిచిపెడితే మళ్ళీ దొంగతనము చేస్తాడు. కాని తగిన శిక్షవిధిస్తే దాన్ని మానుతాడు. వైద్యుడు రోగిపై దయదలచి చేదు మందును మ్రింగించడనుకోండి. వ్యాధి నయముకాదు. కాని బలవంతముగ నైనా రోగిచేత మ్రింగిస్తాడనుకోండి. వ్యాధి నివారింపబడుతుంది. అపుడు వైద్యుడు దయాళువా? కాదా? అలాగే పరమేశ్వరుడుకూడ దయాళువు కనుకనే తగిన శిక్షలు విధించి వాటిని మనచేత అనుభవింపజేస్తాడు.

అజన్ముడు:- ఆయన జన్మలు ఎత్తడు. సర్వవ్యాపక పదార్థం జన్మ లెత్తుటకు వీలులేదని యిదివరకే చెప్పుకున్నాము.

భగవంతునికి 'చిత్రగుప్తు'డని కూడ పేరు. "చిత్రాగుప్తిః యస్య సః- చిత్రగుప్తః"ఎవని రక్షణ క్రియ గుప్తంగా ఉంటుందో వాడు చిత్ర గుప్తుడు. భగవంతుని క్రియలు చాల అద్భుతంగా ఉంటాయి. చూడండి, రాతి మధ్యలో కప్ప ఉంటుంది. అది జీవించడానికి తగిన నీళ్ళుకూడ అక్కడ ఉంటాయి. రాతిని పగులగొడితే కప్ప బయటికివస్తుంది. రాతి మధ్యలో ఒక చిన్న గుంట, దానిలో నీరుకూడ ఉంటుంది. ఒక్కొక్క మారు రైలు ప్రమాదాలు జరిగి, బోగీ (రైలుపెట్టె)లో ఉండేవాళ్ళందరూ చస్తారు. కాని కొండొక పసిపిల్ల బ్రతుకుతుంది. అలాగే 1932 సం.

భూకంపంలో కొన్ని విచిత్రసంఘటనలు జరిగాయి. అపుడు భూకంపం చాల ఉధృతంగా వచ్చింది. ఇంట్లోవుంటే యిల్లుకూలి మీదపడుతుందనేభయంతో తల్లి బయటికి వస్తుంది. అమ్మా అంటూ పిల్లవాడు తల్లివెనుకనే వస్తాడు. తల్లి నిలుపబడినచోట భూమి చీలుతుంది. తల్లి అగాధంలో పడిపోతుంది. మరుక్షణమే చీలినభూమి మరల మూసుకుంటుంది. పిల్లవాడుమాత్రం రక్షింపబడతాడు. పరమేశ్వరుని రక్షణ క్రియలు ఎంత విచిత్రంగా ఉంటాయో చూడండి. కనుక చిత్రగుప్తుడంటే అర్థం యముని దగ్గర ఉండి లెక్కలువ్రాసే గుమాస్తా కాదు. అది పరమేశ్వరుని పేరు. అలాగే 'యముడు' అన్నా పరమేశ్వరుని నామమే. యముడంటే నియమించేవాడని అర్థం.

అనాది:- పరమేశ్వరుడు ఆది లేనివాడు. అంటే అయన ఎప్పటి నుండి ఉంటున్నాడో ఎవరికీ తెలియదు. ఆది అంటే మొదలు-కారణము. ఆది లేనివాడు అనాది.

అనంతుడు:- అంతము లేనివాడు కనుక అనంతు డనబడినాడు. అంతము అంటే చివర అని. చివర ఉన్నట్లయితే మొదలు ఉంటుంది. కనుక మొదలు చివరలున్నవాడు వ్యాపకుడు కాడు. ఆయన అనంతు డన బడినాడు.

నిర్వికారుడు:- ఏ వికారములు లేనివాడు. అంటే ఆయనలో వృద్ధి క్షయాదు లుండవు.

అనుపముడు:- ఉపమించడం అంటే పోల్చడం అని. ఆయన ఏ వస్తువుచేత పోల్చుటకు వీలులేనివాడు. అతనికి సమానుడుకాని, అధికుడు కాని లేడు.

సర్వాధారుడు :- విశ్వములోని సమస్తపదార్థములు ఆయన ఆధారము తోనే ఉంటున్నాయి.

సర్వవ్యాపకుడు :- విశ్వమంతటా సూదిమోప సందులేకుండా సమస్త పదార్థములలో వ్యాపించి ఉన్నాడు. కనుక ఆయన సర్వవ్యాపకుడు.

అజరుడు :- జర అంటే ముసలితనము. ఆయనకు ముసలితనము లేదు. బాల్యము, యౌవనము, కౌమారము, వార్ధక్యము (ముసలితనము) అనేవి శరీరము ఉన్నవాళ్ళకు వచ్చే దశలు. భగవంతుడు అశరీరి కనుక ఆయనలో యివిలేవు. కనుక ఆయన అజరుడు.

అమరుడు :- మరణం లేనివాడు. చావు పుట్టుకలు శరీరానికి సంబంధించిన అవస్థలు. పరమేశ్వరునికి శరీరంలేదు. కనుక ఆయన మరణించడు. అందుచేత ఆయన అమరుడు.

అభయుడు:- భయములేనివాడు. ఆయన నిర్భయుడు. 'ద్వితీయాద్వై భయం భవతి'-(బృహదారణ్యకోపనిషత్తు). ఆయనకు సమానుడుకాని, ఆయనను మించినవాడు కాని రెండవవా డెవ్వడూ లేడు. కనుక ఆయన భయపడడు. అందుచేత ఆయన అభయుడు.

నిత్యుడు :- ఆయన భూత, భవిష్యత్, వర్తమాన కాలము లన్నింటిలో ఉంటాడు. కనుక ఆయన నిత్యుడు.

పవిత్రుడు :- ఆయన సమస్త మలినములకు దూరమైనవాడు. కామ క్రోధములు, ఈర్ష్యాద్వేషములు, లోభమోహములు యిలాంటి వాయనలో లేవు. కనుక ఆయన పవిత్రుడు.

సృష్టికర్త:- సూక్ష్మ రూపములోనున్న మూలప్రకృతిని స్థూలముగా చేసి సూర్య, చంద్ర, నక్షత్రాది సమస్త పదార్థములను ఆయన నిర్మిస్తున్నాడు కనుక సృష్టికర్త.

ఈవిధంగా పరమేశ్వరుని మనం అంగీకరించాలి. ఇలా చెప్పే దయానందుణ్ని, ఆర్యసమాజమువారిని లోకులు నాస్తికులని ప్రచారం

చేస్తారు. ఇది ఎంతటి అన్యాయమో చూడండి. ఆర్యసమాజమువారి మొట్ట మొదటి నియమం చూడండి. "సమస్త సత్య విద్యలకును, విద్యవలన నెరుంగదగు సర్వపదార్థములకును ఆదిమూలము పరమేశ్వరుడు" ఇక రెండవ నియమంలో పరమేశ్వరుని గుణములు వర్ణింపబడినాయి. ఆయన "ఈశ్వరుడు, సచ్చిదానంద స్వరూపుడు, నిరాకారుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయాళుడు, అజన్ముడు, అనాది, అనంతుడు, నిర్వికారుడు, అనుపముడు, సర్వాధారుడు, సర్వవ్యాపకుడు, సర్వాన్తర్యామి, అజరుడు, అమరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, సృష్టికర్తయునై యున్నాడు; అతనినే ఉపాసించుట యోగ్యము" అని. ఇప్పుడు మీకు తెలిసే ఉంటుంది, ఆర్యసమాజమువారు నాస్తికులో ఆస్తికులో. ఆర్యసమాజమువారు నిజమైన ఆస్తికులే కాని, కొందరివలె ఆస్తికనామధారులైన నాస్తికులుకారని గుర్తించాలి. అందుకే మీకీ మాటలు వినిపించాను. పైన వివరించిన లక్షణములు కల పరమేశ్వరుడే ఉపాస్యుడని ఆర్యసమాజమువారు అంగీకరిస్తారు.

ఆర్యసమాజికులు పరమేశ్వరుణ్ణిగూర్చి చేసే వర్ణన అందరు అంగీకరించుతారు. కాని వాళ్ళు చెప్పేది పెద్దమెట్టు. ఒక్కసారే మేడపైకి ఎగిరితే కాళ్ళు విరగవా అంటారు. అందుకని సగుణోపాసన మొదట చేయాలి అంటారు. సగుణోపాసన తేలిక, నిర్గుణోపాసన కఠినమని అంటారు. విగ్రహపూజను సమర్థించడానికి వారు సగుణోపాసన చేయాలని చెబుతారు. విగ్రహాలను పూజించవద్దని చెప్పడం ఆర్యసమాజికులు, క్రైస్తవులనుండి, మహమ్మదీయులనుంచి నేర్చుకున్నారని కూడ వారంటారు. ఇది చాల పొరపాటు. క్రైస్తవ మహమ్మదీయులలో కూడ విగ్రహారాధన ఉన్నట్లు వారికి తెలియదు. క్రైస్తవులలో క్యాథలిక్కులు మేరికన్య బొమ్మలను, శిలువను ఆరాధించడం చూడగలం. మహమ్మ

దీయులకు వారి మస్జిద్‌లో విగ్రహాలు లేకున్నా, వారుచేసే 'హజ్ యాత్ర' వలన వారిలోకూడ విగ్రహారాధన ఉన్నట్లు తెలుస్తుంది. 'హజ్ యాత్ర' చేస్తే పుణ్యవంతులవుతారని వాళ్ళ నమ్మకం. ఈ యాత్రలో వారు మక్కా, మదీనాలను దర్శించుతారు. మక్కాలో ఉన్న నల్లరాతిని ముద్దుపెట్టుకుని వస్తారు. అది ఒకప్పుడు శివలింగంగా ఉండేదని అభిప్రాయం. ఈ రాతికి 'సంగే అస్వద్' అని పేరు. 'సంగే అస్వద్' అనగా నల్లరాయి. కనుక వారిలోకూడ ఒకవిధంగా విగ్రహారాధన ఉన్నదనే అర్థమవుతుంది. విగ్రహారాధన చేసేవాళ్ళను మహమ్మదీయులు 'కాఫిర్' లని 'బుత్‌పరస్థు'లని అంటారు. బుత్‌పరస్థి శబ్దము బుద్ధపరః శబ్దమునకు వికృతము కావచ్చును. బౌద్ధులు విగ్రహారాధన చేస్తారు గనుక విగ్రహారాధన చేసేవాళ్ళను 'బుత్‌పరస్థు'లని వా రంటారు. 'హిందు' శబ్దం కాఫిర్ అనే అర్థంతోనే వాళ్ళు వాడతారు.

కనుక విగ్రహాది జడమూర్తుల నుపాసించవద్దనే సిద్ధాంతం, ఆర్య సమాజికులు క్రైస్తవులనుండి, మహమ్మదీయులనుండి నేర్చుకున్నారనడం పొరపాటు. పోతే రామ, కృష్ణాదులను మహాపురుషులుగా ఆరాధించితే ఫరవాలేదు. పరమేశ్వరుని స్థానంలో వారిని పూజించడంలోనే చిక్కువస్తుంది. సగుణోపాసన అంటే పరమేశ్వరునిలో ఉన్న గుణములను తెలిసికోవడం. నిర్గుణోపాన అంటే భగవంతునిలో లేని గుణములేవో తెలిసికోవడం. భగవంతుడు సగుణుడు నిర్గుణుడు అని కూడ అందరు అంగీకరించుతారు. ఆయన కేవలం సగుణుడుగాని కేవలం నిర్గుణుడు గాని కాదు.

ఒక పదార్థం తనకున్న గుణములచేత సగుణ మనబడుతుంది. తనలో అన్యపదార్థ గుణములు లేనికారణంచేత అది నిర్గుణ మనబడుతుంది. అందుచేత ఏ పదార్థముగాని సర్వగుణ సహితముగాని, సర్వగుణ

రహితముగాని కాదు. ఇట్లు ప్రతిపదార్థము సగుణము, నిర్గుణము అని తెలియాలి.

ఉదాహరణకు : ప్రకృతి ఉన్నది. దాని గుణము లేమిటి ? శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము - యివి. ఈ గుణములు తనలో ఉండడంచేత ప్రకృతి 'సగుణ' మనబడుతుంది. దానిలో జీవుని గుణాలు, పరమేశ్వరుని గుణాలు లేవు కనుక అది నిర్గుణమనబడుతుంది. అంటే జీవులలో ఉండే - ఇచ్ఛ, ద్వేష, సుఖ, దుఃఖ, ప్రయత్న, జ్ఞాన మనే గుణాలు; పరమేశ్వరునిలో ఉండే - సర్వవ్యాపకత్వ, సర్వశక్తిమత్వ, సర్వజ్ఞత్వాది గుణాలు ప్రకృతిలో లేవుగనుక అది నిర్గుణమనికూడ అనబడుతుంది.

అలాగే జీవుడుకూడ సగుణుడు, నిర్గుణుడు అనబడతాడు. ఎలా ? తనలో ఉండే - ఇచ్ఛా ద్వేషాది గుణాలచేత జీవుడు సగుణుడనబడతాడు. అతనిలో ప్రకృతి గుణాలు - సత్వ రజ స్తమస్సులు, జడత్వాది గుణాలు-సర్వవ్యాపకత్వాది ఈశ్వరగుణాలు లేవు. కనుక జీవుడు నిర్గుణుడనబడతాడు.

తరువాత పరమేశ్వరుడు కూడ అలాగే సగుణుడు, నిర్గుణుడు అనబడతాడు. తన గుణములైన సృష్టికర్తృత్వము, సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్వము, సర్వవ్యాపకత్వము ఇత్యాది గుణములచేత ఆయన సగుణుడనబడతాడు. జీవునిలో ఉండే ఇచ్ఛా ద్వేషాది గుణాలు, ప్రకృతిలో ఉండే జడత్వాది గుణాలు ఆయనలో లేవు కనుక పరమేశ్వరుడు నిర్గుణుడవుతాడు.

కొందరు సగుణోపాసన తేలికంటారు. అలా అనడం మోసం. సగుణోపాసనకంటె నిర్గుణోపాసన తేలికనడం యుక్తం, మన గుణాలేమిటో మనకు తెలుసు. ప్రకృతిలో ఉన్న రూప, రస, గంధాది గుణా

లన్నీ మనకు తెలుసు. ఇవి పరమేశ్వరునిలో లేవు కనుక పరమేశ్వరుడు నిర్గుణుడని తెలుసుకొనడం సులభం. అలా ఆయన నిర్గుణుడని తెలిసికొని మనం భగవంతుని ఉపాసించాలి. ఇది నిర్గుణోపాసన అవుతుంది. ఇక సగుణోపాసన అంటే – భగవంతునియందు ఏ గుణములున్నవో తెలిసికొని, అతనిని భావించడం– అది సగుణోపాసన అనబడుతుంది. సర్వజ్ఞత్వం, సర్వవ్యాపకత్వం, సృష్టికర్తృత్వం, ఫలదాతృత్వం, ఆనందం, దయ, యిత్యాది గుణాలు పరమేశ్వరుని గుణాలు. ఈ గుణములు తెలిసికోవడం సులభం కాదు. ఇట్టి గుణములు కలవాడని తెలిసికొని ఉపాసించడం కూడ సులభం కాదు. కనుక నిర్గుణోపాసనకంటె సగుణోపాసన సులభం కాదని బోధపడుతుంది. ఏది సులభమైనా, సులభం కాకపోయినా భగవంతుని రెండువిధములా ఉపాసించడం అవసరం.

ఇచట ఒక విషయం చెప్పాలి. విగ్రహారాధకులు చేసే విగ్రహారాధన సగుణోపాసన కాదు. ఇది 'సాకార ఉపాసన' అనాలి. సాకారం జడం. సాకారోపాసన చేస్తున్నారంటే ప్రకృతిని ఉపాసించుతున్నారని అర్థం. ఒక్కొక్కరు, కొన్ని బొమ్మలను యింట్లో పెట్టుకొని, ఉపాసన చేస్తున్నానని చెప్పి రోజూ రెండు గంటలు వృధా చేస్తాడు (సభలో నవ్వులు). ఆ రెండు గంటలు అతనేమి చేస్తాడు ? ఆ బొమ్మలన్నింటికి తిలకం పెడతాడు, గంధం పూస్తాడు, పూలు అలంకరిస్తాడు. మరి ఒక దేవునకివన్నీ పెట్టి యింకొక దేవునికి పెట్టకపోతే ఆయనకు కోపం వస్తుందేమోనని చెప్పి అన్ని బొమ్మలకు ఈ తతంగంఅంతా చేస్తాడు. తరువాత చెంపలు వేసుకుంటాడు. (సభలో నవ్వులు). ఇది సగుణోపాసన కాదు. సాకార ఉపాసనే అవుతుంది. ఉపాసన అసలు మానసికం మాత్రమేనని గ్రహించాలి. బాహ్యముగా చేసేవి ఉపాసన కాదు. పరమేశ్వరునికి ఉన్న గుణాలేమిటో, లేనిగుణాలేమిటో మొదట తెలుసుకోవాలి. ఆయన

కున్న గుణాలను గూర్చి ధ్యానం చెయ్యడం సగుణోపాసన అవుతుంది. ఆయనలో లేని గుణాలను స్మరించడం నిర్గుణోపాసన అవుతుంది.

మీ కిపుడు సాకారోపాసన (విగ్రహాది మూర్తిపూజ) ఎలా సగుణోపాసనకాని, నిర్గుణోపాసనకాని కాదో వివరించడం జరిగింది. పరమేశ్వరుని గూర్చిన సగుణ, నిర్గుణ ఉపాసనలను గురించి శబ్దాలతో మాత్రం మీ కిపుడు చెప్పాను. కాని యిది చాలదు. యోగాభ్యాసం చెయ్యాలి. స్వానుభవమును సంపాదించాలి. అపుడు మీరు నిజముగా పరమేశ్వరుని ఉపాసించిన ట్లవుతుంది.

సాకార ఉపాసన ఆర్యసమాజం ఒప్పుకోదు. అది కేవల నిర్గుణోపాసనం గాని, కేవల సగుణోపాసనం గాని ఒప్పుకోదు. ఇవి రెండూ చేయాలంటుంది.

'తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి నాన్యః పంథా విద్యతేఽ యనాయ' యీ రెండు విధములైన ఉపాసనల ద్వారా పరమేశ్వరుని ఎరిగినవాడే ముక్తుడవుతాడు. వేరేమార్గం లేదు. మిగిలింది రేపు చెప్పుకుందాము.

---

గుంటూరు, 1-1-1969
బుధవారం, సా॥ గం. 6-00

మహాజనులార!

మనం యిప్పటికి 8 మంత్రాలను గురించి చెప్పుకున్నాం. భగవంతుని స్వరూప స్వభావము లేమిటో తెలుసుకున్నాం. జీవుడు భగవత్తత్త్వాన్నే ఉపాసించాలని తెలుసుకున్నాం. స్తుతిప్రార్థనలు - సగుణ, నిర్గుణ ఉపాసనలు నిన్న చర్చించుకున్నాము.

శంకరుడు అద్వైత మతమును ప్రచారం చేశాడు. ఆయన కేవల చేతనవాది. అంటే పరమేశ్వరు డొక్కడే ఉన్నాడు. ప్రపంచం మిథ్య.

అది ఉన్నట్లు తోస్తుందేగాని నిజమునకు లేదంటాడు. 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః' - బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్య, జీవుడు బ్రహ్మమేగాని వేరుగాదు అంటాడు.

మిథ్యా అంటే సత్తాలేనిది; లేక ఉనికిలేనిదని అర్థం. ప్రపంచం మిథ్య అనడం వేదవిరుద్ధం. లేనివస్తువు పుట్టడంగాని, పెరగడంగాని, నశించడం కాని సంభవించదు. కార్యరూపంలో కనబడిన వస్తుసముదాయం, కారణ రూపంలో కనబడనంత మాత్రాన అసలు వస్తువే లేదనడం సరికాదు. అది నేటి విజ్ఞాన శాస్త్రానికి (Science) కూడ విరుద్ధం. అద్వైతులు తమ సిద్ధాంతాన్ని నిరూపించుకోడానికి స్వప్నదృష్టాంతము, బింబ ప్రతిబింబ వాదము, శుక్తిరజతభ్రాంతి, రజ్జుసర్పభ్రాంతి, ఎండమావులు యిలాంటి ఉదాహరణలను చెబుతారు. వీటిని సమాలోచిస్తే, యివి విషమదృష్టాంతము లని, సరియైనవి కావని, అద్వైతవాదం హేతువాదానికి కూడ విరుద్ధమని తెలుతుంది.

జీవు డెవరు ? అంటే జీవుడు బ్రహ్మ నంటారు అద్వైతులు. బ్రహ్మకు లక్షణమేమి ? ఉపనిషత్తులలో "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అని వర్ణింపబడినది. మరియు దీనినే నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తస్వరూప మనిరి. ఇది అద్వైతులు కూడ కాదనరు. అయితే జీవుడు అజ్ఞాని లేక అల్పజ్ఞాని. ప్రపంచంలో మీ రెంతటి విజ్ఞానిని తీసుకొన్నా పరమేశ్వరుని జ్ఞానంతో పోల్చినపుడు అతని జ్ఞానం అల్పమని, పరిమితమని మన కర్థమవు తుంది. అందువలన జీవుడు బ్రహ్మమే యనుట సరికాదు.

ఇక ప్రపంచం లేదనడానికి వారు స్వప్నదృష్టాంతం చెబుతారు. మనం కలతనిద్రలో ఉన్నప్పుడు శరీరంలో ఏనుగు యిత్యాదులు కనబడ తాయి. అవి నిజానికి శరీరంలో ఉన్నవా అంటే లేవు. కాని లేనివి ఉన్న ట్లుగా కనబడతాయి. అలాగే ప్రపంచంకూడ ఒక కల. దీర్ఘస్వప్నం అంటారు. ప్రపంచం లేకయే ఉన్నట్లు తోచును అని అద్వైతు లంటారు.

స్వప్నం అంటే ఏమిటో తెలుసుకోవాలి. ఎప్పుడైన జాగ్రదవస్థలో చూచిన, వినిన వస్తువులే స్వప్నంలో కనబడతాయి. వస్తువు మాత్రం బయట ఉంటుంది. ఈ వస్తువులకు సంబంధించిన పూర్వానుభవం సంస్కారరూపంగా అంతఃకరణంలో ఉంటుంది. ఇలా ఉండిన పూర్వాను భవాలు కలతనిద్రలో ఉద్బుద్ధమౌతాయి. ఇదియే కల. 'స్మృతి రేషా స్వప్న దర్శనం' అంటారు శంకరులు. పూర్వం తెలిసినదాన్ని జ్ఞాపకము నకు తెచ్చుకోవడం స్మృతి లేక స్వప్నం అనవచ్చు. స్వప్నంలో కనబడిన వస్తువులు నిజానికి శరీరంలో లేవు. అంతమాత్రంచేత అవి బయట లేవన కూడదు. కనుక జగత్తు మిథ్య కాదు. స్వప్న దృష్ట వస్తువులు శరీరంలో లేకున్నను బయట ఉంటవికదా!

అద్వైతులు ఇంకొక వాదన చేస్తారు. ఈ జగత్తు ఆదిలో లేదు. అంతంలో లేదు. కాని మధ్యలో ఉన్నట్లు కనబడుతుంది. అందుచేత జగత్తు మిథ్య అంటారు. ఈ వాదంకూడ శాస్త్రీయం కాదు. ఈ ప్రపంచగత పదార్థాలు ప్రపంచం సృష్టింపబడటానికి పూర్వం, ప్రపంచ లయానంతరం లేవు అనడం సరికాదు. మన కవి కనబడనంతమాత్రంచేత మిథ్య అనడం ఉచితం కాదు. ఇవ్వాళ సైంటిస్టులు చేసే పనేమిటి? కార్యాన్నిబట్టి కారణాన్ని కనుగొంటున్నారు. ప్రపంచం కార్యం, దీనికి కారణమైన మూలపదార్థా లేమిటి అని పరీక్షిస్తున్నారు. ఏ యే పదార్థాలు కలిస్తే భూమి, జలము, వాయువు మొదలైనవి ఉత్పన్నం అయినవో ఆ మూలతత్త్వము లేమిటో అన్వేషించడమే నేడు వారు చేస్తున్న పని. ఇప్పుడు ప్రపంచం కార్యరూపంలో ఉంది. ప్రపంచం స్థూలరూపముగా వ్యక్తము కాకపూర్వం సూక్ష్మమై కారణరూపంలో ఉంది. ఇలా సూక్ష్మంగా ఉన్నదాన్ని స్థూలంగా చేస్తాడు పరమేశ్వరుడు సృష్టికాలంలో. అలాగే లయావస్థలో యిపుడు కార్యంగా ఉన్న జగత్తు సూక్ష్మంగా కారణరూపంలో

ఉంటుంది. అంతేగాని లేనిది పుట్టదు, పుట్టినది లేకుండా పోదు. వస్తువు రూపాంతరం చెందవచ్చు. అంతే.

"నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః" గీ. ౨-౧౬

అందుచేత యీ ప్రపంచాని కంతటికి మూలతత్త్వం (ప్రకృతి) ఒకటున్నదని తెలుస్తుంది. కనుక జగత్తు మిథ్య అనడం సరికాదు.

ఇంకోవిషయం: అసలు బ్రహ్మతత్త్వమే యిలా జీవ, జగత్తులుగా పరిణమించింది అని కొందరు వాదిస్తారు. వారి వాదనప్రకారం బ్రహ్మమే జీవుడుగా పరిణమించా డనుకోవాలి. ఈ వాదన కొంతవరకు సరిగా ఉన్నట్లే కనబడుతుంది. కాని, విచారించితే దీనిలోకూడ దోషముంది. లేనిది పుట్టిందనడానికి వీల్లేదు. కనుక పాలు పెరుగైనట్లు, మట్టి కుండై నట్లు, దారం వస్త్రమైనట్లు, బంగారం నగలైనట్లుగా బ్రహ్మమే యిలా పరిణమించింది అనాలి. మరి బ్రహ్మమే జీవుడుగా పరిణమించితే, బ్రహ్మములో ఉండే గుణాలు జీవునిలో కనబడాలి. కాని కనబడవు. ఎందువల్ల అవి కనబడటంలేదు అంటే, అనాదిగా మాయ ఉన్నది. ఆ మాయకు లోబడి బ్రహ్మము జీవుడుగా వ్యవహరింపబడుచున్నా డంటారు. పోనీ ఈ మాయకు ఉనికి ఉన్నదా అని అడిగితే, దానికి ఉనికి లేదు. 'సత్తా లేనిది మాయ' అంటారు. మాయకు ఉనికి ఉన్నదంటే బ్రహ్మము, మాయ అనేవి రెండుంటాయి. కనుక అద్వైతం సిద్ధించదు. పైగా అనాది అని చెప్పబడే యీ మాయవలన బ్రహ్మము ఎప్పుడూ జీవుడుగానే బద్ధుడై ఉండాలి. ఉనికి లేని మాయ బ్రహ్మము నావరించి అతనిని జీవునిగా చేయడ మనేది పొసగదు. కనుక బ్రహ్మమే జీవుడుగా పరిణమించాడనడంకూడ సరికాదు.

అద్వైతులు 'సూర్యుడు ఒక్కడే అయినా నీటికుండల్లో ప్రతిబిం బించి తాను అనేకమైనట్లు భాసించుతాడు. అలాగే బ్రహ్మతత్త్వం,

'మాయ' అనే ఉపాధిలో ప్రతిబింబించి జీవులుగా వ్యవహరింపబడుతున్నా డంటారు.

విమర్శించితే, స్వప్నదృష్టాంతంవలె యీ బింబ ప్రతిబింబ దృష్టాంతంకూడ సరిగా ఉన్నట్లు కనబడదు. ఎలాగంటే, ఒక సూర్య బింబం దూరంగా ఉండి, అనేక నీళ్ళకుండలుంటే దాని ప్రతిబింబం వాటిల్లో కనబడుతుంది. పైగా సూర్యుడు, కుండలుకూడ ఆకారం కలిగిన పదార్థా లవడంచేత నీళ్ళలో ప్రతిబింబాలు ఏర్పడతాయి. కాని బ్రహ్మతత్త్వం అలాంటిది కాదు. అది వ్యాపకతత్త్వం. వ్యాపకతత్త్వానికి ప్రతిబింబం ఏర్పడటమనేది పొసగదు.

కనుక కేవల బ్రహ్మతత్వ ప్రతిపాదనవలన కాని కేవల ప్రకృతి తత్త్వ ప్రతిపాదనవలన కాని సమస్య పరిష్కారం కాదు. అందుచేత బ్రహ్మ తత్త్వం, ప్రకృతితత్త్వం, జీవతత్త్వం- యీ మూడింటిని అంగీకరించితేనే యీ ప్రపంచ సమస్య పరిష్కారమౌతుంది.

జీవుడు పరమేశ్వరుని మాత్రమే ఉపాసించాలని వేద మేల చెప్పి నదో యీ మంత్రం వివరిస్తుంది.

అంధం తమః ప్రవిశంతి యే ఽసంభూతి ముపాసతే
తతో భూయ ఇవ తే తమో య ఉ సంభూత్యాగ్ం
రతాః॥ ౯

భావార్థం:- సమస్త జడజగత్తునకు ఉపాదానకారణ మగు ననాది నిత్యప్రకృతి ఉపాసింపదగినదిగా భావించి, అందు నిమగ్నులగువారు అవిద్యను బొంది, క్లేశముల ననుభవింతురు. ఆ మూలప్రకృతినుండి యుత్పన్నమైన మహత్తత్వము (బుద్ధి) పృథివి మున్నగు స్థూలపదార్థ

ములయందు చిత్తమును లగ్నముచేయువారు అంతకంటెను మిక్కిలియగు నజ్ఞానమును బొంది ఎక్కువ కష్టముల పాలగుదురు. కావున సచ్చిదానంద స్వరూపుడగు పరమాత్మనే సదా ఉపాసింపవలెను.

తమస్సు అంటే చీకటి లేక అజ్ఞానం. అంధ తమస్సు అంటే కటిక చీకటి లేక ఎక్కువ అజ్ఞానం అని అర్థం. ఎవరు పరమేశ్వరుని విడిచి, 'అసంభూతిని' ఉపాసిస్తారో వారు అజ్ఞానంలో ఉంటారు. అలాగే, 'సంభూతిని' ఉపాసించేవారుకూడ భూయః-అంటే ఇంకా ఎక్కువ అజ్ఞానంలో ఉంటారని మంత్రార్థం. అసంభూతి, సంభూతి యీ రెండు పదముల కర్థం తెలుసుకుంటే యీ మంత్రం అర్ధమవుతుంది.

సంభూతి అంటే పుట్టే వస్తువు. సంభవము అంటే పుట్టడం. 'సమ్యక్ భవతి ఇతి సంభవః'-కార్యపదార్థాన్ని సంభూతి అంటారు. ఇంద్రియములచే తెలిసికొనబడే పదార్థాలు సంభూతి అనగా స్థూల ప్రపంచం. కనుక ఈ స్థూల ప్రపంచాన్ని ఉపాసించేవారు అజ్ఞానులవుతారు. జడపూజలు చేసేవారు కష్టము లనుభవిస్తారు. కష్టసుఖాలు మనకు ప్రాపంచిక పదార్థాల వలననే కలుగుతాయి. కావున వాని ఉపాసన అజ్ఞానానికి దారితీస్తుంది.

వేదాహమేతం పురుషం మహాంతం ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్।
తమేవ విదిత్వా ఽతి మృత్యు మేతి నాన్యః పంథా విద్యతే ఽయనాయ॥
యజుర్వేదం. ౩౧-౧౮

తా॥ అజ్ఞానావరణమునకు ఆవలనున్న విజ్ఞాన మయుని, మహాపురుషుని నేను తెలుసుకున్నాను. ఆతనిని తెలుసుకుంటేనే మృత్యుముఖము నుండి (జనన మరణములనుండి) విడివడి అమృతత్వమును పొందగలం. వేరుమార్గము లేదు.

మనకు కలిగే కష్టములలో పెద్ద కష్టమేది? మృత్యువు. మనం మృత్యువునుండి తప్పించుకోవాలంటే మహాపురుషుని (పరమేశ్వరుని) తెలుసుకోవాలి. ఆదిత్యవర్ణం అంటే ప్రకాశ మని అర్థం. ప్రకాశం, జ్యోతి యిలాంటి పదాలు జ్ఞానానికి బోధకాలు. తమసః పరస్తాత్-ఆయనలో అజ్ఞానానికి తావులేదు. 'తమేవ విదిత్వైవ'-ఆతనిని తెలుసుకుంటేనే మృత్యువు నుండి – అజ్ఞానమునుండి తరించగలం. 'న అన్యః పంథా విద్యతేఽయనాయ'- వేరుమార్గంలేదు, అని మనకు వేదం చెబుతుంది.

కాని జడోపాసకులు పరమేశ్వరుని పొందడానికి అనేక మార్గాలున్నాయంటారు. సీమిత వస్తువుకు అవధులుంటాయి. కనుక దాన్ని చేరడానికి అనేకమార్గా లుంటాయి. కాని పరమేశ్వర పదార్థానికి అవధులు (హద్దులు) లేవు. కావున కేవలం దాన్ని తెలుసుకోవడమే ముఖ్యం. 'న జ్ఞానా దృతే ముక్తిః'- అంటే పరమేశ్వర సాక్షాత్కారం కలుగనంత వరకు ముక్తి లేదని అర్థం.

మొదట జీవేశ్వర ప్రకృతులను హేతుబద్ధంగా తెలుసుకోవాలి. దీన్నే సైద్ధాంతిక జ్ఞానమంటాము (the critical knowledge). అలా తెలుసుకున్న తరువాత పరమేశ్వర తత్వాన్ని అనుభవంలోకి తెచ్చుకోవాలి. ఆవిధంగా అనుభవించిన వ్యక్తికి ప్రాకృతిక పదార్థ బంధనాలు తొలగుతాయి. అప్పుడు ముక్తి సిద్ధిస్తుంది. యోగమార్గము వలననే యిది సాధ్యమవుతుంది. అంతేగాని, విగ్రహాది జడమూర్తులకు, ధూప దీప నైవేద్యాదులను సమర్పించినందువలన సిద్ధించదు. సైంటిస్టులుకూడ స్థూల పదార్థాలను ఉపాసించుతున్నారు. అంటే ప్రయోగాలుచేసి వాటి తత్త్వములను తెలుసుకుంటున్నారు. జీవితం సుఖదాయకంగా ఉండేందుకు అనేక క్రొత్త

క్రొత్త పదార్థాలను కనిపెడుతున్నారు. అలా మనం పదార్థాలను ఉపయోగించుకోవచ్చు. కాని వాటికి మ్రొక్కినందువలన ఉపయోగం లేదు.

తరువాత అసంభూతి: అసంభూతి అంటే పుట్టనిది. మూలరూపంలో ఉండేది. కారణము లేక సూక్ష్మరూపమున ఉన్న ప్రకృతి అనవచ్చు. ప్రకృతి యింద్రియములకు గమ్యంకాదు. కాని యోగులు అంతర్ముఖులై సూక్ష్మతత్త్వములను తెలిసికోడానికి ప్రయత్నాలు చేస్తారు.

ఆత్మపదార్థజ్ఞానం తెలియనివాళ్ళు తన్మాత్రలు, అహంకారము, మూల ప్రకృతి అనేటి సూక్ష్మతత్వములలో మనస్సును ప్రవేశింపజేసి అదియే పరమార్థమని ఎంచుతారు. అట్టి వారిని ప్రకృతిలయులు అంటారు. ఏ యోగికి ఆత్మపదార్థం తెలియదో అతడు ప్రకృతిని అధిగమించలేడు. ప్రకృతిలయులకు బాహ్యసంబంధమైన సుఖదుఃఖాలు ఉండవు. అయితే వీరికి ఆత్మానందానుభూతి మాత్రం ఉండదు. ప్రకృతిలయులు వేల సంవత్సరాలు బ్రతుకవచ్చు నంటారు. బాహ్యపదార్థాలను పరిశోధించే మన 'సైంటిస్టులు' కూడ యోగులే. వారు యంత్రసహాయంతో అనేక వస్తువులను కనుగొంటున్నారు. మనసును ఏకాగ్రం చేస్తారు. కాని మనకు బాహ్యపదార్థ జ్ఞానంవలన ఆత్మానుభూతి మాత్రం కలుగదు. బాహ్య వస్తువులనుంచి విడివడి సమాధిస్థితిని పొందాలి. అపుడే ఆత్మానుభవం కలుగుతుంది. శరీరంలో మనకు మామూలుగా కలిగే అనుభవాలకంటె కొన్ని విలక్షణమైన మార్పులు వస్తే పూర్ణానుభవం కాదు. ప్రాణాయామాదులు చేసి కొంత యోగ మభ్యసించిన వారికి మనస్సు శుద్ధమౌతుంది. అంటే సూక్ష్మపదార్థాలను కనుగొనే శక్తి దానికి వస్తుందన్నమాట. చెవికి శబ్దములు వినబడతాయి. కొంద రీ శబ్దాన్ని (అనాహత నాదము) విని-శబ్దబ్రహ్మను లేక నాదబ్రహ్మను తాము గ్రహించా మనుకుంటారు. అలాగే వింటుంటారు. శబ్ద, స్పర్శ, రూప, రస,

గంధాలు ప్రకృతిసంబంధమైనవి. ఇవి బయట గోచరించినా, లోపల (అంత ర్ముఖంగా) గోచరించినా ప్రకృతికి సంబంధించినవే. కనుక వీటిని ఉపాసించే వారు ప్రకృతిని ఉపాసించు తున్నారన్నమాట. అందుచేత వీళ్ళను ప్రకృతి ఉపాసకు లంటారు. అంటే వీళ్ళు స్థూల, సూక్ష్మ ప్రకృతులను ఉపాసించు తుంటారని అర్థం.

నిత్యోఽనిత్యానాం చేతన శ్చేతనానాం
ఏకో బహూనాం యో విదధాతి కామాన్
త మాత్మస్థం యేఽను పశ్యంతి ధీరా
స్తేషాం శాంతిః శాశ్వతీ నేత రేషామ్ ॥ కఠ. ౫-౧౩

తా॥ పరమాత్మ అనిత్యమైన ప్రాకృతిక పదార్థములందు నిత్యుడై ఉంటాడు. చేతనులైన జీవులలో నిత్యచేతనుడై ఉంటాడు. తా నొక్కడే అయినా అసంఖ్యాకములైన జీవులలో తా నుండి, వాటికి కర్మఫలముల నిస్తుంటాడు. ఏ ధీరులు తమలో ఉన్న ఆ పరమాత్మను (ధ్యానశీలురై) తెలుసుకుంటారో వారికి శాశ్వతశాంతి (ముక్తి) లభిస్తుంది. ఇతరుల కది లభించదు.

కాబట్టి, ఆత్మస్థుని-అనగా తనలో ఉండే ఆ పరమాత్మను తెలుసు కోవాలి. 'తేషాం శాశ్వతీ శాంతిః' - అలా తెలుసుకున్నవారికే శాశ్వత సుఖం లభిస్తుంది. వేరేమార్గం లేదు. కేవలం ప్రకృతి ఉపాసనవల్ల అంధ తమస్సులో ఉంటారు. జడములను ఉపాసించడంవల్ల యింకా అంధ తమస్సులో ఉంటారు. అని మంత్ర తాత్పర్యం. తరువాత మంత్రం చెప్పు కుందాము.

అన్య దేవాహుః సంభవా దన్యదాహు రసంభవాత్
ఇతి శుశ్రుమ ధీరాణామ్ యేన స్తద్ విచచక్షిరే ॥ ౧౦

భావార్థము :- కార్యరూప జడవస్తువుల నుపాసించుటవలన కల్గు ఫలము వేరనియు, కారణరూప పదార్థము నుపాసించుటవలన కలుగు ఫలము వేరనియు విద్వాంసులు, ధీరులునైన వారు చెప్పుదురు. కాబట్టి మానవులారా ! మీరును ఆ యా వస్తుగుణములను, వాని నుపాసించుటవలన కల్గు ఫలములను అట్లే గుర్తింతురుగాక ! (ఫలభేదము ముందు రాబోవు మంత్రమున చెప్పబడును.)

ధీరులు అనగా బుద్ధిశాలురు, ధ్యానశీలురు అని యర్థము.
'వికారహేతౌ సతి విక్రియంతే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః'

'వికారం కలిగించే వస్తువు దగ్గరున్నప్పటికి ఎవరి మనసులో వికారం కలుగకుండా ఉంటుందో వారు ధీరులు' అని కాళిదాసు అంటాడు. ఆకలి కలిగితే పదార్థాలను తింటాం. కాని ఆకలి లేనపుడుకూడ పదార్థాలను చూస్తే తినాలనిపిస్తుంది. మంచి ఎండాకాలం రోజుల్లో బంగినపల్లి మామిడిపండ్లు వస్తాయి. అవి చూడగానే తినాలని బుద్ధి పుడుతుంది. నోరూరుతుంది. అలా నోట్లో నీరూరుట వికార మగును. కాబట్టి పదార్థములను చూస్తూకూడ ఏవిధమైన వికృతి కలుగని వారిని ధీరు లనాలి. ఇపుడు నా వెనుక ఒక సినిమాతార వచ్చి నిలువబడిం దనుకోండి. అప్పుడు మీరు నన్ను 'శాస్త్రిగారూ ! కాస్సేపు మీ ఉపన్యాస మాపండి' అంటారు, ఆమెను చూడాలనే ఉద్దేశ్యంతో (సభలో నవ్వులు విననయ్యేను). అంటే వికృతి చెందుతున్నారని అర్థం. ధ్యానశీలుడైన యోగికి ఈ వికృతి కలుగదు. ఎందువలన ? అతని ఇంద్రియములు, మనోవృత్తులు అతని అధీనంలో ఉంటాయి. సామాన్యమైన వ్యక్తుల కీ ఇంద్రియ నిగ్రహం కలుగదు.

యమ నియమాదుల ద్వారా ఇంద్రియనిగ్రహం సంపాదించిన తరువాత ధ్యానం వస్తుంది. సాధకుడు ధ్యానం చేసేటప్పుడు మనసులో

ఏవేవో చింతించరాదు. లక్ష్యపదార్థమే అవిచ్ఛిన్నంగా భాసించాలి. ఇది ధ్యాన మనబడుతుంది. ధ్యానస్థితి చాలాకాలం అభ్యాసం చేసిన తరువాత మాత్రమే వస్తుంది.

'అన్యదేవాహుః సంభవాత్ అన్యదాహు రసంభవాత్' – సంభవము అంటే స్థూల పదార్థము. అసంభవము అంటే సూక్ష్మపదార్థం. ఈ రెండు విధములైన ప్రకృతులను ఉపాసించితే కలిగే ఫలితం వేరువేరుగా ఉంటుంది.

సంభూతించ వినాశంచ య స్తద్ వేదో భయగ్ం సహ
వినా శేన మృత్యుం తీర్త్వా సంభూ త్యామృత మశ్నుతే॥ ౧౧

భావార్థము :– ప్రపంచమునందలి పదార్థములలోగల కార్యకారణ భావము వ్యర్థమైనదికాదు. కావున ఆ కార్యకారణముల గుణ కర్మ స్వభావ ముల నెరిగి, వానిని ధర్మాది మోక్షసాధనములతో సంయుక్తము చేసికొన వలెను. ఇట్లే మానవ శరీరము అనిత్యము – కార్యరూపము. దానికి కారణరూపములు గలవు. అవి నిత్యములే. కావున మరణ భయమును విడిచి మోక్షసిద్ధికై యత్నింపవలెను. ఇట్లు ఈ కార్యకారణ రూప జగత్తు వలన పొందవలసిన ఫలము అన్యము. కార్యకారణ రూపజగత్తునందు రతులుగాక, వానిని త్యజించి పరమాత్మ నుపాసింపవలెనని భావము.

సంభూతి అంటే కార్యజగత్తని, అసంభూతి అంటే యీ కార్య జగత్తుకు మూలకారణమైన ప్రకృతి అని యింతకు పూర్వమే తెలుసు కున్నాం. పరమేశ్వరుని విడిచి యీ రెంటిని ఉపాసించడం యోగ్యంకాదు. ఈ రెంటినిగూర్చి బాగా తెలుసుకోవాలనడం ఉచితమే. మన మహర్షులు కూడ ప్రాకృతిక పదార్థాలనుగురించి తెలుసుకొనేవాళ్ళు. కాని ఎంతవరకు ? వారికి అవసరమైనవరకే. కేవల ప్రకృతి ఉపాసన అజ్ఞానాన్ని కలిగి

స్తుంది. ఈ మంత్రంలో 'వినాశంద్వారా మృత్యువును పోగొట్టుకోవాలి. సంభూతివల్ల ఆనందం పొందుతాం' – అని చెప్పబడింది. ఇచట వినాశము అంటే మూలప్రకృతి అని అర్థం. అంటే దేనిలో కార్యరూప పదార్థాలు నశించి విలీనమౌతాయో ఆ కారణరూప జగత్తును మూలప్రకృతి అంటారు. అది నశించదు. ఇక సంభూతి అంటే కార్యపదార్థమైన 'శరీర'మని యిచట అర్థం. ఈ శరీరానికి కారణమేమిటి? ప్రకృతి. శరీరం కార్యం. ఇలా, శరీరానికి ప్రకృతికిగల కార్యకారణ సంబంధాన్ని బాగా తెలుసుకోవాలి. వినాశంద్వారా మృత్యువును పోగొట్టుకోవడమంటే – యీ శరీరం ఎప్పుడైనా నశించేదే. దీనికి కారణభూతమయిన ప్రకృతిమాత్రం నశించదు. అనే నిశ్చితజ్ఞానం కలగడంవల్ల మనకు శరీరవియోగం (మృత్యువు) సంభవించినా దుఃఖించబోమని అర్థం.

తరువాత సంభూతి (శరీరం) వలన ఆనందం పొందడమంటే ఏమిటో తెలుసుకుందాం. జీవుడు ఈ మనుష్య శరీరంలోనే మోక్షానందాన్ని సంపాదిస్తాడు. మనుష్య శరీరం లేకపోతే అది సిద్ధించదు. జీవుడు సుఖదుఃఖాలను అనుభవించడానికి శరీరం అవసరం. శరీరం ఉండటంవల్లనే అతడు సుఖదుఃఖముల ననుభవిస్తున్నాడు. కనుక జీవుడు తన కీ శరీరం రావడానికి కారణమేమిటో తెలుసుకొని, ఆ కారణములనుండి విడివడితే అతనికి శరీరం రాదు. అప్పుడు శరీరసంబంధమైన సుఖదుఃఖములు తొలగి అతడు మోక్షానందాన్ని పొందుతాడు.

జీవుడు ఈ శరీరంలో ఉండే, సాధన చెయ్యాలి. ఆ సాధన మెలా? అత డీ శరీరంలో క్రొత్తకర్మలు చేయకుండా ఉండటానికి ప్రయత్నం చెయ్యాలి. కర్మలు మూడువిధములుగా ఉన్నాయి. సంచితములు, ప్రారబ్ధములు, క్రియామాణములు నని. సంచితకర్మలు అంటే పూర్వజన్మములలో చేసి కూడబెట్టిన కర్మలు. ప్రారబ్ధములు అంటే సంచిత కర్మలలో

నుండి కొన్ని ఈ జన్మలో ఫలముల ననుభవింపజేయుటకు ప్రారంభించిన కర్మలు. క్రియమాణములు అంటే ఈ జన్మలోచేసే క్రొత్త కర్మలు. వీటికి ఫలం ఈ జన్మలో అనుభవిస్తాము. కాని కొన్ని కర్మలు అనుభవించకుండా మిగిలిపోతాయి. వీటిని వచ్చేజన్మలలో అనుభవించవలసి ఉంటుంది.

జీవులు కర్మయోనులని, భోగయోనులని రెండురకములు. యోని అంటే శరీరమని అర్థం. కొన్నిశరీరములలో శుభాశుభ కర్మలు చేయ డానికి వీలుంటుంది. వీటిని కర్మయోనులు అంటారు. కొన్ని శరీరాలలో కర్మఫల మనుభవించడమే జరుగుతుంది. వాటిలో క్రొత్తకర్మ లేవీ చేయ బడవు. అందుచేత వానిని భోగయోనులు అంటారు. మనుష్య శరీరము కాక, మిగిలిన పశుపక్ష్యాది శరీరములన్నీ భోగయోనులు. మనుష్య శరీ రంలో జీవుడు శుభాశుభ కర్మల నాచరించడానికి వీలున్నది. కొన్ని కర్మల ఫలమునుగూడ అనుభవించుటకు వీలున్నది. కనుక మానవుడు ఉభయ యోని. తప్పుచేసి జైల్లోపడినవాడు తాను స్వతంత్రించి ఏ పని చేయడానికీ వీలులేదు. అలాగే జంతుశరీరాల్లోకూడ. పశువులు మాతృగమనం చేస్తాయి. అది తప్పుకాదు. మనుష్యులు చేస్తే తప్పు. పశువు త్రోవనుబోతూ చేలో మేస్తుంది. అది తప్పుకాదు. దానికది ఆహారం. కాని కావలివాడు చూస్తూ ఊరుకుంటే ఆసామి కోపపడతారు. గనుక దాన్ని అదలించుతాడు. పశువు [illegible]తనంచేస్తే తప్పులేదు. మనిషి దొంగతనం చేస్తే మాత్రం తప్పు. కనుక జంతుశరీరాల్లో జీవులు కర్మల ఫలాల ననుభవిస్తాయి. అంతే.

జన్మకు కారణమైన క్రొత్తకర్మలు చేయకుండా ఉండాలి. అలా వుంటే జన్మరాదు. మరియు కర్మలు చేసికూడ బంధనంలో పడకుండ ఉండవచ్చు. అదెలా? మన మిపుడుచేసే కర్మలు ఫలాపేక్ష లేకుండా చేస్తే

బంధనంలో పడం. కొందరిలా అంటారు. పూర్వజన్మలలో చేసినకర్మల ప్రభావంవలననే కదా, మళ్ళీ యీ జన్మలో మనం కర్మలు చేస్తున్నాము; మరి ఈ శరీరంలో క్రొత్తకర్మలు చేయడమంటే యేమిటి? ప్రారబ్ధ కర్మల ఫలితం అనుభవించడమంటే అర్థమేమిటి? అంటారు. ఈ కర్మ రహస్యము చాలమందికి తెలియదు. దీని అర్థమును మన ఋషిపుంగవులు యిలా చెప్పారు. పూర్వవాసనలు ఈ జన్మలో మనచేత క్రొత్తకర్మలు చేయించవు. మనము చేసేపనులన్నీ యిప్పుడే చేస్తాం. ఇది మనం బాగా గుర్తించాలి. ప్రారబ్ధకర్మల ఫలితం ఎలా అనుభవిస్తామో ఒక ఉదాహరణ చెబుతాను. అజాగ్రత్తగా దారిని నడుస్తాను. ఎదురుదెబ్బ తగిలి కాలికి చెక్కుకుడింది. అజాగ్రత్తగా ఉండి తప్పుచేశాను. నిజమే! ఈ చేసిన స్వల్పతప్పిదానికి రెండురోజుల్లో ఆ దెబ్బ మానడం న్యాయం. కాని ఒకప్పుడు చీము ఏర్పడి, కాలు తీసివేయవలసి వస్తుందని డాక్టరంటాడు. కొద్ది తప్పుకు యింత శిక్షవేయడం న్యాయంగా తోచదు. మరి యీ స్థితి ఎందుకు కలిగింది? అంటే యిప్పుడు చేసినదానికి, పూర్వజన్మ కర్మఫలం జోడించి అనుభవింపజేస్తున్నాడన్నమాట. ఒక్కొక్క వ్యాపారి కొద్ది పెట్టుబడితో ఎక్కువలాభం పొందుతుంటాడు. నిజాని కతని పెట్టుబడికి తగినట్టే లాభం రావలసింది. కాని, అనుకొన్నదానికంటె ఎక్కువ లాభం పొందుతాడు. కారణం, అతడు పూర్వంచేసిన సత్కర్మల ఫలితమది. ప్రాతకర్మలు మనచేత దొంగతనం చేయించవు. దొంగతనం మనం యిప్పుడు కావాలనే చేస్తాము. పూర్వకర్మలు మనచేత కేవలం ఫలమాత్రమే అనుభవింపజేస్తాయి. మన మీ శరీరంలో క్రొత్త కర్మలు చేయకపోతే బంధనంలో పడం. ఈ మానవశరీరంలోనే కర్మలనుండి తప్పుకొనే ఉపాయం ఉంది. అందుకుగాను క్రొత్తకర్మలు చేయకుండా ఉండాలి. ఒకవేళ చేస్తే ఫలాపేక్ష లేకుండ కర్మలు చేయాలి. అప్పుడవి మనలను బంధించవు. ఇలా చేయుటకు తగిన యోగ్యత ఒక్క మానవ

శరీరంలోనే ఉంది. తతిమ్మా శరీరాల్లో లేదు. మనకు శరీర విజ్ఞానం-భౌతిక విజ్ఞానం (Science) ముక్తినియ్యలేవు. కేవలం ఆత్మవిజ్ఞాన మొక్కటే మోక్షము నిస్తుంది. ఆ ఆత్మవిజ్ఞానం సంపాదించడంకూడ యీ మానవ శరీరంలోనే సాధ్యమవుతుంది. తతిమ్మా పశు, పక్ష్యాది జంతు శరీరా లిందు లకు తగినవి కావు.

'ఇహ చే దవేదీ దథ సత్యమస్తి న చే దవేదీన్ మహతీ వినష్టిః'
కేన. ౨-౫.

మనుష్యజన్మలో తెలుసుకున్నవాళ్ళకే మోక్షముంది. లేకపోతే నష్టము. అంటే మానవేతర జన్మ మోక్షమునకు తగినది కాదు అని అర్థం.

---

గుంటూరు, 3-1-1969,
శుక్రవారం, సా. 6-00 గం.

మహాజనులారా!

ఇంతవరకు పదునొకండు మంత్రాలను గూర్చి తెలుసుకున్నాం. వచ్చే మూడు మంత్రాలల్లో విద్యా అవిద్యలను గూర్చి చదువుతాము.

అంధం తమః ప్రవిశన్తి యే உవిద్యా ముపాసతే
భూయ ఇవ తే తమో య உ విద్యాయాగ్ం
రతాః ॥ ౧౨

భావార్థము ;- జ్ఞానాది గుణములతో గూడిన చేతనము జ్ఞాత యన బడును. అవిద్యా రూపమగు జడవస్తువు జ్ఞేయము. విద్వాంసుల కాత్మరూప మగు చేతనబ్రహ్మము ఉపాసింపదగినది - ఉపాస్యము - సేవింపదగినది

అనిభావము. ఆబ్రహ్మమునకు భిన్నమైనది ఉపాసింపదగినదికాదు. బ్రహ్మ భిన్నపదార్థములవలన ఉపకారము పొందవలెను. అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము అను క్లేశములలో చిక్కుకొని పరమేశ్వరుని వీడి తద్భిన్నమగు జడవస్తువుల నుపాసించు మానవులు దుఃఖ సాగరమున మునుగుదురు. మరియు శబ్దార్థములు, వాని సంబంధము, అన్వయాదులనెడి సంస్కృతాది భాషల నభ్యసించి, సత్యభాషణము చేయక, పక్షపాత శూన్యన్యాయాచరణరూప ధర్మము నాచరింపక, అభిమానారూఢులై, విద్యను తిరస్కరించి, అవిద్యయందే మగ్నులైయుండి, మిక్కిలి దుఃఖములపాలయి పీడితు లగుదురు.

అవిద్యను ఉపాసించేవారు అంధకారంలో ఉంటారు. కేవలవిద్యయందు రతులైనవారు ఎక్కువ అజ్ఞాను లవుతారు. విద్యకు వ్యతిరేక పదము అవిద్య. అవిద్య అంటే విపరీత జ్ఞానమని అర్థం. వస్తువును ఉన్నదున్నట్లు తెలుసుకోకుండ విపరీతంగా తెలుసుకోవడం. విద్య-విత్= జ్ఞానం. యా=ఇచ్చేది. విద్య అంటే జ్ఞానము నిచ్చునదని యర్థము. అవిద్య అంటే విపరీతజ్ఞానము. లోకంలో ఉండే జడపదార్థాలను ఈశ్వరుడని ఉపాసించడం అవిద్య అవుతుంది.

"అనిత్యాశుచిదుఃఖా నాత్మసు నిత్యశుచి సుఖాత్మఖ్యాతి రవిద్యా"
యో. ద. 2-5

నాలుగు విధములైన భ్రమాత్మకజ్ఞానం అవిద్యఅనబడుతుంది, అని పతంజలి. నిత్యము కాని ఈ జగత్తును నిత్యమనుకోవడం, అ[illegible] దానిని శుచిఅనుకోవడం, సుఖము కానిదాన్ని సుఖమనుకోవడం, ఆత్మ కానిదానిని ఆత్మయని యెంచడం 'అవిద్య' అనబడుతుంది.

'అంధం తమః ప్రవిశన్తి యే అవిద్యా ముపాసతే'-ప్రాకృతికము లగు జడపదార్థముల నుపాసించడం అవిద్య. కనుక జడపదార్థముల నుపా

సించేవారు అంధకారంలో ఉంటారు. అంటే అజ్ఞానంలో ఉంటారు. 'తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాగ్ం రతాః' - కేవల శబ్దార్థ సంబంధ రూప విద్య నెరిగినవారు కూడ యింకా అజ్ఞానంలో ఉంటారు. విద్య అంటే జ్ఞానం కలిగించే చదువు. శబ్దార్థములను తెలిసికొన కలిగే జ్ఞానం విద్య అవుతుంది. పండితులు చాల చదువుతుంటారు. భాషావిదులను పండితులనరాదని శాస్త్రకారు లంటారు. శబ్దార్థములను తెలిసినవారిని భాషా విదులు అంటే సరిపోతుంది. పండా అంటే ఆత్మజ్ఞానము. అది కలవాడు పండితు డౌతాడు.

విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకే చ పణ్డితా స్సమదర్శినః॥ గీ. 5-18.

'సమం పశ్యంతి ఇతి సమదర్శినః' - అందరియందు సమముగా వ్యాపించియున్న పరమేశ్వరుని చూచేవాడు సమదర్శి అవుతాడు. బ్రాహ్మణునిలో, ఆవులో, ఏనుగులో, కుక్కలో, కుక్కను వండుకొని తినే చండాలునిలో సైతం పరమేశ్వరుడు సమానంగా ఉంటాడు. రామకృష్ణాదులలో భగవంతుని అంశము ఎక్కువగా ఉంటుంది అంటారు. అది పొరపాటు. జీవులు అందరిలోనూ భగవంతుడు సమంగా ఉంటాడు. కొందరిలో లావుగా ఉండడు.

కేవలం శబ్దార్థ జ్ఞానమును తెలుసుకొని బ్రహ్మోపాసకుల మనుకొనువారు జ్ఞాను లనుటకు వీలులేదు

'నాయ మాత్మా ప్రవచనేన లభ్యః'-(కఠ. 2-23) పరమేశ్వరుడు యిట్టివాడు, అట్టివాడు అని శాస్త్రదృష్టితో ప్రవచించినంతమాత్రమున పరమేశ్వరుడు పొందబడడు. 'య మేవ ఏష వృణుతే'-అన్నిటిని మరచి పోయి, అనన్యచిత్తముతో ఆయననే ఎవరు వరించుతారో, ఉపాసించుతారో వారే పరమాత్మను పొందుతారు.

అన్యదేవాహుర్ విద్యాయా అన్యదాహు రవిద్యాయాః
ఇతి శుశ్రుమ ధీరాణాం యేన స్తద్ విచచక్షిరే॥ ౧౩

భావార్థము :- జ్ఞానాది గుణయుక్తమగు చేతనము నుపాసించుట వలన లభించు ఫలము, అజ్ఞానాది యుక్తమగు జడము నుపాసించుటవలన కలుగదు. ఇట్లే జడోపాసనవలన కలుగు ఫలము చేతనోపాసన వలన కలుగదు. కావున మానవులు విద్వాంసుల సాంగత్యము, యోగము, విజ్ఞానము, ధర్మాచరణము అనువాని మూలమున జడచేతనములను వివేకించి వానివలన లాభమును పొందవలెను.

ఇచట జ్ఞాత అంటే జీవుడు (తెలిసికొనేవాడు). తెలిసికోదగిన తత్త్వం జ్ఞేయము అనబడుతుంది. పదార్థముయొక్క కార్యకారణ సంబంధముకూడ తెలుసుకోవాలి. జీవునకు తెలుసుకోదగిన ప్రకృతియేకాక యింకొక చేతనపదార్థం-దేవుడుకూడ ఉన్నాడు. జీవించిఉండగానే పరమేశ్వరుని తత్వం తెలుసుకోవాలి. అపుడే ముక్తి. ఎప్పుడో మరణించిన తరువాత ముక్తి సిద్ధిస్తుంది అనుకోవడం పొరపాటు. కనుక పరమేశ్వరుని విడిచి జడవస్తువులను ఉపాసించేవారు 'మహతి దుఃఖసాగరే మజ్జంతి'- దుఃఖసాగరములో మునుగుతారు.

సత్యభాషణ చెయ్యక శబ్దపాండిత్యం మాత్రం సంపాదించి, పరమేశ్వరుని అనుభవపూర్వకముగ గ్రహించనట్లయితే ప్రయోజనమేమిటి? శాస్త్రాలు తెలుసుకొని, జీవితంలో న్యాయమార్గమున వర్తించుతూ, పాత రహితంగా ఎందరుంటారు? కనుక ఆచరణ ముఖ్యం.

విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయగ్ం సహ ।
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయామృత
మశ్నుతే॥ ౧౪

భావార్థము :- విద్య, అవిద్యల స్వరూపము నెరిగి, వానికి చేతనము, జడము సాధకములని నిశ్చయించినవారు జడమగు శరీరమును, చేతనమగు ఆత్మను ధర్మార్థ కామమోక్షములను సాధించుటకు ఎల్లప్పుడు ఉపయోగింతురు. అట్టివారు లౌకిక దుఃఖములపాలుకాక పారమార్థిక సుఖమును పొందుదురు. జడమగు ప్రకృత్యాది కారణ పదార్థము, శరీరాది కార్యపదార్థములు లేనినాడు పరమేశ్వరుడు జగదుత్పత్తిని, జీవులు కర్మోపాసనా జ్ఞానములను ఎట్లు సాధించగలరు? కావున కేవల జడముతోగాని, కేవల చేతనముతోగాని, కేవల కర్మలతోగాని, కేవల జ్ఞానముతోగాని యెవరును మోక్షము సాధింప సమర్థులు కాజాలరు.

మనుష్యుడు ప్రాకృతిక విజ్ఞానం పొందాలి. విద్యద్వారా ధర్మము లేవో నేర్చుకున్నా మనుకోండి. ఆ నేర్చుకున్నదాన్ని ఆచరణలో పెట్టాలి. సత్యశాస్త్రములను తెలుసుకొని, పతంజలి మొదలగు మహర్షులు చెప్పిన (యోగ) మార్గంద్వారా ఆత్మసాక్షాత్కారం పొందడానికి ప్రయత్నం చెయ్యాలి.

'అవిద్యయా మృత్యుం తీర్త్వా' - శరీరాది జడముల మూలమున చేసిన పురుషార్థమువలన మరణ భయమును దాటి, 'విద్యయామృతమశ్నుతే'-ఆత్మ, అంతఃకరణముల సంయోగమున కలిగిన యథార్థజ్ఞాన రూప విద్యవలన నాశరహితమైన స్వస్వరూపాన్ని లేక పరమాత్మను పొందు అని. ఇలా సాక్షాత్కారం పొందాలి అంటే ధర్మాచరణం చెయ్యాలి. సాధనం శరీరం. 'శరీరమాద్యం ఖలు ధర్మసాధనం' శరీరము ధర్మసాధనములలో మొదటిది. ఏదైనా తాను జీవించి సాధించాలి. మన ప్రాచీన ఋషులు నిత్యము ధర్మాచరణ చేస్తుండేవారు. వైదిక ధర్మాలు ఆచరించేవారు. ఒకవిధమైన జీవన పద్ధతికి ధర్మానుష్ఠానమునకు మతమని పేరు.

యజ్ఞము చేయునప్పుడు అగ్నిలో నెయ్యి ఎందుకు వృధాచేస్తారని సైన్సు చదువుకున్న పిల్లవాడుకూడ అడుగుతాడు. కాని అగ్నిలో వేసే నెయ్యి వ్యర్థంకాదు. నెయ్యే కాదు, ఏ వస్తువు వేసినా వ్యర్థంకాదు. ఉదాహరణకు నిప్పులోవేసిన మిరపకాయ మనకు తుమ్ములు తెప్పిస్తుంది. ఎందుకని ? అది కాలి భస్మమై సూక్ష్మరూపం ధరించి వాయువులో కలుస్తుంది. మన మా గాలిని పీల్చితే మనకు తుమ్ములు వస్తాయి. అలాగే అగ్నిలో పాషాణం వేసేట్లయితే ఆ గాలిని పీల్చుకున్నవారంతా చస్తారు. అగ్నిలో మనం అనేక ఓషధులు వేసి యజ్ఞం చేస్తాం. అగ్ని మనంవేసిన ఓషధుల్ని సూక్ష్మద్రవ్యంగా మార్చి వాయువున కందిస్తుంది, ఆ వాయువు నాఘ్రాణించిన ప్రాణులకు వ్యాధులు సోకవు. అలాగే నెయ్యికూడ. నెయ్యి పుష్టి కారక పదార్థం. దానిని అగ్నిలో వేస్తాం. అది వృధాకాదు. అది అగ్నిలో దగ్ధమై వాయువులో కలుస్తుంది. ఆ వాయువును పీల్చిన జీవరాశులకు పుష్టి నిస్తుంది. అగ్నిహోత్రంవలన యింకొక మేలుంది. ఇంట్లో అగ్నిహోత్రం పెట్టామనుకోండి. అక్కడున్నగాలి వేడెక్కి బయటికిపోతుంది. క్రొత్తగాలి యింట్లో ప్రవేశిస్తుంది. ఇలా వాయువు పరివర్తనం చెంది గృహంలోని వాయువు పరిశుద్ధమవుతుంది.

'యజ్ఞాద్ భవతి పర్జన్యః' (గీత ౩-౧౪)

నిత్యము మనం యజ్ఞం చేయుటవలన మేఘములు సకాలమున నేర్పడి వర్షములు కురుస్తాయి. పూర్వం యజ్ఞయాగాదులు అధికంగా చేసేవారు. కనుక సకాలంలో వర్షములుపడి, పాడి పంటలతో దేశం సుఖిగా ఉండేది. అందుచేత యజ్ఞంవలన మనకెంతో మేలు కలుగుతుంది.

ఈ అగ్నిహోత్రంమీద Research (ప్రయోగాలు) చేసినవారు డాక్టర్ సత్యప్రకాశ్ అనేవారు. అలహాబాద్ యూనివర్శిటీలో ఆయన Professor (అధ్యాపకుడు) గా పనిచేశాడు. ఆయన 'అగ్నిహోత్రం'

అనే పుస్తకం ఇంగ్లీషులో వ్రాశారు. దానిలో యజ్ఞంవలన కలిగే లాభా లన్నింటిని సశాస్త్రీయంగా నిరూపించారు. నిత్యజీవనంలో అది మన కెంతగా ఉపయోగపడుతుందో అందులో వివరించారు.

యజ్ఞ శిష్టాశినః సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః
భుంజతే తేత్వఘం పాపా యే పచం త్యాత్మ కారణాత్ ॥
గీత. ౩-౧౩.

తా॥ భూమి మొదలగు దేవతలనుండి తమకు లభించిన పదార్థము లలో మేలైన ఘృతము (నెయ్యి), ఓషధులు, ధాన్యములు మున్నగువానిని అగ్నిముఖమున ఆ దేవతల కర్పించి తదుపరి మిగిలిన పదార్థమును (యజ్ఞశేషమును) భుజించువారు పాపములనుండి ముక్తులగుదురు. అట్లు చేయక తమ ఉదరపోషణకే వంటకముల నొనర్చువారు పాపమును భుజించువా రగుదురు. అని గీత చెబుతుంది. అగ్నిహోత్రం ఒకటే యజ్ఞం కాదు. ఇంకా చాల యజ్ఞాలున్నాయి.

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాపరే
ప్రాణాపాన గతీరుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః ॥ గీత. ౪-౨౯

కొందరు ఉచ్ఛ్వాస నిశ్శ్వాసముల గతిని ఆపి ప్రాణాయామము చేస్తూ, అపానవాయువునందు ప్రాణవాయువును, ప్రాణమున అపానమును ఆహుతి చేస్తారు. ఇది యోగులు చేస్తారు. ప్రాణాయామం ఒక యజ్ఞం,

'ప్రచ్ఛర్దన విధారణాభ్యాం వా ప్రాణస్య' యో. ద. ౧-౩౪

కొందరు ప్రాణాయామం చేస్తున్నామని చెప్పి ముక్కు చెవులు ...రు. ప్రాణాయామము మాత్రం చెయ్యరు. ఎందుకలా ముక్కు చెవులు పట్టుకుంటున్నారని ఎవరైనా అడిగితే, చెవి ఆకాశతత్వం, శబ్ద స్వరూపం. ముక్కు పట్టుకుంటే వచ్చే మలినం చెవితాకితే పోతుందంటారు! (సభలో నవ్వులు). ఇది తప్పు. ప్రాణాయామం చెయ్యాలి.

ప్రాణాయామాదులను చిన్నప్పుడే ప్రాచీనకాలపు గురుకులాల్లో విద్యార్థులకు నేర్పేవారు. ఈనాటి పరిస్థితి వేరు. ప్రతిఒక్కరూ నిత్యం యోగాభ్యాసం చెయ్యాలి. మహర్షులు కొండల్లో ఉండి యోగాభ్యాసం, తపస్సు చేశారు. వారికి గడ్డాలు పెరిగేవి. కొండల్లో వాళ్ళకు గడ్డాలుచేసే మంగళ్ళులేక పెంచుకున్నారు. ఇక్కడ గడ్డాలు పెంచుకున్నవాళ్ళు యోగులుకారు. మనకు మంగళ్ళుండగా గడ్డాలు పెంచుకోవడ మెందుకు? (సభలో నవ్వులు).

ప్రచ్ఛర్దనం-అంటే శ్వాసకోశములలోని గాలిని వేగంగా బయటికి వెళ్ళగ్రక్కడం. ఇది రెండు నాసికాపుటములద్వారా జరగాలి. కొందరు నవీనులు ఒక్కొక్క నాసికాపుటముద్వారా మార్చి మార్చి యిలా చేయాలని అంటున్నారు. కాని పాతంజలి యోగదర్శనానికి వ్యాఖ్యానము వ్రాసిన వ్యాసమహర్షి 'నాసికాపుటాభ్యాం' - రెండు నాసికలద్వారా యిది చేయాలన్నాడు. హఠయోగులు ఏవేవో feets (సాధనలు) చేస్తారు. (నేతి, ధౌతి, బస్తి, నౌళి యిత్యాది). అవన్నీ మన కవసరంలేదు. ప్రాణాయామం చేయుటవలన ఏదో అవుతుందని కొంద రంటుంటారు. ఏమీ ప్రమాదం లేదు. మీకు నేను గ్యారంటీ యిస్తున్నాను. ప్రాణాయామంచేస్తే పిచ్చి ఎక్కుతుందనడం పొరపాటు. పిచ్చేమైనా ఉంటే పోతుందికూడ (సభలో నవ్వులు). మీకు గురువులు, బరువులు ఏమీ అవసరంలేదు. గురువు ఎంతవరకు? విషయం తెలిసికొనేవరకే.

యోగశాస్త్రంలో మూడురకాల ప్రాణాయామం చెప్పబడి (ప్రాణాయామమును చేసి చూపుతూ) మొదట సాధకుడు ఆసన యిలా కూర్చోవాలి. (సిద్ధాసనము వేసి చూపించారు). తరువాత కోశములలోని వాయువును వమనము చేసికున్నట్లు వేగంగా ప్రయత్న పూర్వకముగ, రెండు నాసికాపుటములద్వారా వెళ్ళగ్రక్కాలి. (అలా చేసి చూపించారు). తరువాత బయటి వాయువును లోపలకు పోకుండ బయ

టనే శక్తికొలది కొంతసేపు ఆపాలి. (ఇది ఒకరకం ప్రాణాయామం). ఇక ఆగలేమనుకున్నప్పుడు నెమ్మది నెమ్మదిగా శ్వాసకోశములలోనికి రెండు నాసికలద్వారా వాయువును పూరించాలి. అలా పూరించిన గాలిని ఊపిరితిత్తులలోనే శక్తికొలది కొంతసేపు ఆపి ఉంచాలి. (ఇది రెండవ రకం). ఇక అలా ఉంచలేమనుకొన్నప్పుడు మళ్ళీ మొదట చేసినట్లుగా వాయువును వెలుపలికి నడపాలి. ఇక మూడవరకం ప్రాణాయామ ముంది. శ్వాసకోశములలోని వాయువును బయటికి పంపించడంకాని, బయటి గాలిని లోపలికి పీల్చడంగాని చేయకుండ ఎక్కడిగాలి నక్కడ బంధించాలి. దీన్ని 'కేవల కుంభకం' అంటారు. ఇదొకరకం ప్రాణాయామం. కాలిన యినుప ముక్కపై నీటిబొట్టు వేస్తే సంకుచించి, సంకుచించి చివరకు ఏమీలేకుండా పోతుంది. అలాగే, యీవిధంగా ప్రాణాయామం చెయ్యడం వల్ల మొదట్లో మనకు కొంచెం ఉక్కిరిబిక్కిరి అయినట్లుంటుంది. అంతే. మరేం ఫరవాలేదు. ప్రాణంమాత్రం పోదు. (సభలో నవ్వులు). 'ప్రాణ బంధనం హి మనః' - ప్రాణము బంధనముగా కలిగినది మనస్సు. లేక ఉచ్ఛ్వాస నిశ్వాసములు బంధనముగా కలిగినది మనస్సు. అంటే ఉచ్ఛ్వాస నిశ్వాసములను నిరోధించినపుడు మనస్సునకు వేగము తగ్గి ప్రసన్నత కలిగి ఉంటుందని అర్థం.

సామాన్యంగా ఆరోగ్యవంతుడైన మనిషి నిమిషానికి 6 సార్లు గాలి పీల్చుతాడు. కాని అభ్యాసి అయినవాడు 3 లేక 4 సార్లు మాత్రమే గాలి [illegible]. అసలు ప్రాణాయామము అంటే ఏమిటి ? ఉచ్ఛ్వాస నిశ్వాసము [illegible]ముచేయుట లేక విస్తరింపచేయుట అని అర్థం. మనం చేసే [illegible]శ్వాసములు దీర్ఘముగాను, గాలిని బాగా లోపలికి పూరిస్తున్నట్లు [illegible] (Deep గాను) ఉండాలి. ఈవిధంగా చేయడంవలన, శరీరారోగ్యము, చిత్తప్రసన్నత రెండూ కలుగుతాయి. బస్। యివ్వాళకు చాలు.

---

గుంటూరు, 4-1-1969
శనివారం, సా॥ 6-00 గం.

మహాజనులారా!

ఇవ్వాళ చివరి రోజు. ఈ రోజుతో ఉపనిషత్తు పూర్తిఅవుతుంది. ఇంకొక్క మూడు మంత్రాలున్నాయి. సంక్షేపంగా చెప్పుకుందాము. గత రాత్రి విద్యా, అవిద్య లంటే ఏమిటో తెలుసుకున్నాము. కేవలం విద్యను గూర్చిగాని, కేవలం అవిద్యనుగురించిగాని తెలుసుకుంటే సరిపోదని, రెంటిని తెలిసికొని, అవిద్య (ప్రాకృతిక పదార్థవిజ్ఞానము) ద్వారా మరణ భయమును దాటి, విద్య (ధర్మాచరణము, యమనియమాది సాధనసంపత్తి) ద్వారా ముక్తిని పొందాలని నిన్న ముచ్చటించుకున్నాము.

ఏదో ఒకరోజు శరీరము వదలిపెట్టి జీవుడు వెళ్లతాడనేది ఖాయం. ఈ స్థితి మన మందరం చూస్తాం. పుట్టిన ప్రతి ప్రాణి గిట్టడం అనేది పరమ సత్యం. కనుక చనిపోయేముందు శరీరాన్ని ఎలా వదిలిపెట్టాలి అనేది యీ మంత్రంలో చూస్తాం. శరీరాన్ని విడిచే సమయంలో, అతని స్థితి ఎలా ఉంటుందో యిందులో తెలుసుకుంటాం. మీరు సాధారణంగా వినే ఉంటారు. మనుష్యునికి మరణావస్థలో ఎట్టి భావ ముంటే అలాంటి గతి కలుగుతుందని. అందుకని మరణావస్థలో నున్నవాని చుట్టూ చేరి, బంధుబాంధవులు భగవన్నామం చెయ్యమంటారు. మరణ సమయంలో భగవన్నామం స్మరిస్తూ ప్రాణమువిడిస్తే సద్గతి కలుగుతుందని అలా తారు. తక్కిన సమయాల్లో యిలా చెయ్యమని చెప్పరు. చని టప్పుడు మాత్రం అందరూ చుట్టూచేరి భజన చేస్తుంటారు. కాని లను వదలుటకు సిద్ధముగా ఉన్న జీవుని కివన్నీ పట్టవు. అతడు స్పృహాలో ఉండడు. శరీరం వదలడానికి సిద్ధంగా ప్రాణములు వాటిపనిలో అవి ఉంటాయి. జీవునికి బాహ్యస్మృతిగాని, బంధుమిత్రులు చేసే యీ కోలా

హాలముగురించి ఎఱుకకాని ఉండదు. అతనిచుట్టూ ఉన్న బంధువులు అతని చేత నారాయణ అనిపించితే మంచిదనిచెప్పి, 'నారాయణ,' 'నారాయణ' అని చెవిలో చెబుతుంటారు. పెద్దగాకూడ అంటుంటారు. కాని ససేమిరా, అతను నారాయణ అనడు. మరణోన్ముఖుడైన అతడు పైగా 'న', 'న' అంటాడు. అంటే 'నే నను' 'నే నను' అని....(సభలో నవ్వులు). ఇలా మరణావస్థలో భగవంతుణ్ణి స్మరించుతూ చనిపోవాలి అని మనవాళ్ళు చెప్పడం ఎందువల్ల అని నేను చాలా ఆలోచించేవాణ్ణి. తరువాత దీనికి మూలం వేదమంత్రములలో ఉన్నట్లు గ్రహించాను.

వాయు రనిల మమృత మథేదం భస్మాంతగ్ం శరీరమ్
ఓమ్ క్రతో స్మర, క్లిబే స్మర, కృతగ్ం స్మర॥ ౧౫

భావార్థము :- మృత్యుసమయమున ఎట్టి చిత్తవృత్తి ఉండునో తెలిసికొనవలెను. అప్పుడు ఆత్మ శరీరమునుండి వేరగుననియు నెరుంగ వలెను. అట్లే జీవన సమయమునను గుర్తింపవలెను. జీవుడు వెడలిపోయిన తరువాత శరీరమును దహించి భస్మముచేయవలెను. దాహకర్మ మొనర్చిన పిదప శరీరమునకు చేయవలసిన సంస్కారము లుండవు. జీవించినంత కాలము పరమేశ్వరుని ఆజ్ఞను పాలించుచు అతని నుపాసించి, స్వసామర్థ్య మును పెంచుకొనవలెను. చేసిన కర్మము నిష్ఫలముకాదని యెఱిగి, ధర్మము ...ప్రీతి, అధర్మమునందు అప్రీతియు కలిగి వర్తింపవలెను.

'...స్మాంతగ్ం శరీరం'—శరీరానికి అంతిమస్థితి భస్మంకావడం. ...లను తగులబెట్టడం వైదిక సంప్రదాయం. వైదికులంతా యిలా ...... మనం హిందువులం కాము; వైదికులం. అలా అనడమే సబ బుగా ఉంటుంది. వైదికులమని కాక, యింకేదైన పేరున పిలవాలంటే

మనమంతా 'ఆర్యులం' అనడం న్యాయం. 'హిందు' పదం మన ప్రాచీన గ్రంథాలలో ఎక్కడా లేదు. భగవద్గీతలో 'హిందు' పదం లేదు. ఉపనిషత్తులలో, వేదములలో, చివరకు మన తత్త్వశాస్త్రములైన షడ్దర్శనములలో కూడ యీ పదంలేదు. దీనికి వ్యతిరేకంగా మనం ఆర్యుల మనడానికి తగిన ఆధారాలు మన ప్రాచీన గ్రంథాలలో ఉన్నాయి. ఉదాహరణకు రాముణ్ణిగూర్చి రామాయణంలో 'ఆర్యః' అని అనేక తావులలో చెప్పినట్లు మనం చూడగలం. అలాగే భగవద్గీతలో కృష్ణుడు యుద్ధంచేయడానికి విముఖుడైన అర్జునుని మందలిస్తూ పిరికితనం 'అనార్యజుష్టం' అంటాడు. అంటే అనార్యులైనవారిలో ఉండదగినది అని అంటాడు.

రాముడు, కృష్ణుడు వీరంతా ఆర్యులు. మనమంతా ఆర్యులం. సంస్కృతములోని 'ఆర్య' పదమే తెలుగులో 'అయ్య' అయింది. తిక్కనార్యుడు అనే పేరు తెలుగులో 'తిక్కయ్య' లేక 'తిక్కన్న' అయింది. అలాగే నన్నయార్యుడు అన్నపేరు నన్నయ్య అయింది. ఇంకా యిలాగే ఎన్నో ఉన్నాయి.

పరదేశస్థుల పాలనలో మనం చాలాకాలం బానిసలంగా ఉన్నాము. మనపేరు మనం మరచిపోయాము. మనము హిందువులము కాము. 'ఆర్యులం' అని మొదట చెప్పినవాడు దయానందు డొక్కడే. మనకు హిందుపదం మహమ్మదీయుల కాలంలో వచ్చింది. పూర్వం చైనా రాయబారులైన హ్యూయన్‌సాంగ్, పాహియాన్ మనదేశం వచ్చారు. మన భారతదేశ పరిస్థితులనుగూర్చి వారు కొంత వ్రాశారు. భారత ఆర్యులను హిందువులంటే ఒప్పుకోరని - ఆర్యశబ్దంతో పిలిస్తే ... కుంటారని వారువ్రాశారు. 'హిందు' పదం మహమ్మదీయ రాజులు మనపైన బలవంతంగా రుద్దారు. హిందువులంటే=కాఫిర్ (పాపి), గులామ్ (బానిస),

చోర్ (దొంగ), డాకూ (బందిపోటుదొంగ) అని వ్రాసివుంది. (ఈ పదములు విన్న సభ యావత్తూ ఆశ్చర్య మగ్నమైంది). చూడండి. హిందువు అనే పదానికున్న అర్థం ఎంతటి నికృష్టంగా ఉందో. ఈ పదం పారసీభాషకు చెందినది. ఆ భాషలో ఈ యర్థములే ఉన్నవి. మనకు కాఫిర్ అనేఅర్థంలో ఈ హిందుపదం మహమ్మదీయులు వాడినారు.

కొందరు యిచట సింధునది ఉండటంచేత యీ దేశాన్ని సింధూ దేశమనేవారని, పారశీకులు సింధుదేశం అనలేక హిందూదేశ మనేవారని, అప్పటినుండి యీ దేశానికి హిందూదేశం అనే పేరు వచ్చిందని, హిందూ దేశంలో ఉండేవాళ్ళు హిందువు లనబడతారని అంటారు. అట్లయితే— క్రైస్తవులు, మహమ్మదీయులుకూడ హిందూదేశములో ఉన్నారు కనుక వారుకూడ హిందువులని చెప్పబడాలి. కాని మహమ్మదీయులు, క్రైస్త వులు తమ్ముతాము హిందువు లనుటకు ఒప్పుకోరు. కారణ మేమిటి? అసలు యీ దేశమునకు సింధూదేశమని పేరెక్కడ ఉంది? ఒకవేళ పార సీకులు, 'స' కు 'హ' పలికినప్పటికి భారతీయులు సింధు దేశమును హిందూ దేశమని ఏల అందురు. కాబట్టి మనలను హిందువు లనుటకు అది కార ణము కాదు.

మహమ్మదీయుల తరువాత మనలను ఆంగ్లేయులు పరిపాలించారు. ఆంగ్లేయులు మనపై పెత్తనం సాగించి మనలను (Indians) ఇండియన్స్ అన్నారు. దీని కర్థమేమిటి? కూలీలు అనే అర్థంలో ఈ పదం మనకంట [illegible]ి.

[illegible] ఆర్యావర్తం. ఇప్పటికీ మనవాళ్ళు ప్రతిదినం సంధ్యవార్చే [illegible]ందట సంకల్పం చెబుతారు. 'అద్య బ్రహ్మణః ద్వితీయ ప్రహ రార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే, అష్టావింశతితమే, కలి యుగే, ప్రథమచరణే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, 'ఆర్యావర్తే'

పుణ్యభూమౌ మేరో ర్దక్షిణ దిగ్భాగే........' అని సంకల్పం చెబుతూ, యీ దేశాన్ని ఆర్యావర్తమని కీర్తించుతారు. కాని, హిందూదేశమని చెప్పరు. ఇలా సంకల్పం చెప్పడం కోట్లకొలది సంవత్సరాలైనా మార లేదు. మనం సభల్లో మాట్లాడేటప్పుడుకూడ 'ఆర్యులారా!' అంటాము. ఓ హిందువులారా! అనం. (సభలో నవ్వులు). కనుక మనం ఆర్యులం. అందులో సందేహం లేదు.

పాపం కొందరికి అర్యులమంటే ఆర్యసమాజకుల మౌతామేమో ననే భయం (సభలో నవ్వులు). ఏదోవిధంగా సరిపెట్టుకొని మనం హిందువులమని చెప్పడానికి కొందరు ప్రయత్నం చేస్తారు. హిందూ పదానికి నిర్వచనంకూడ వారు చేస్తారు. 'హీనం దునోతీతి హిందుః'-అంటే హీనుణ్ని హింసించేవాడు హిందువు అని. అంటే హీనుల్నేగాని, మనం గట్టివాళ్ళను ఎదుర్కోలేమన్నమాట (సభలో నవ్వులు). 'హిందు' అనే పదం—'హిం కృణ్వంతి' అనే పదంనుండి 'హిం' తీసుకొని, 'దునోతి' అనే పదంనుండి 'దు' తీసికొని, రెండూ కలిపి 'హిందు' శబ్దం వచ్చిందని కొందరు అంటున్నారు. నిజాని కలా హిందుపదం ఉత్పత్తి అయిన ట్లయితే, 'M. A.' (యమ్, ఏ.) కున్నట్లు, "హిం. దు" పదముల మధ్యలోకూడ విరామచిహ్న లుండాలి. కాని అలా లేదు. అందుచేత హిందు అనే పదానికి వీరిచ్చిన నిర్వచనం సరిగాలేదు.

అయినా, ఇంత గందరగోళ పడటం, యిన్ని దొంక[illegible] సమాధానాలు చెప్పుకోడం దేనికి? హిందూపదానికి మారుగా '[illegible] మును ఒప్పుకుంటే సరిపోతుందిగదా! (సభలో నవ్వులు). ఆర్య[illegible] కుంటే ఆర్యసమాజీయుల మౌతామని భయమా? మీరు ఆర్యుల[illegible] మాత్రంచేత కాకుండపోరు. మీరుచేసే కర్మలనుబట్టి మీరు ఆర్యులో అనార్యులో నిశ్చయంగా తేలుతుంది. ఆర్యులు అంటే సత్కర్మలు చేసేవారు

లేక మంచివారని అర్థం. అనార్యులు అంటే దుష్కర్మలు చేసేవారు లేక దుష్టులు అని. మీరు సత్కర్మలు చేయరా ? మరి, మీరు ఆర్య (మంచి వారని) లనిపించుకో దలచలేదా ? (సభలో నవ్వులు).

'ఓం క్రతో స్మర' క్రతో- అంటే కర్మములు చేసే జీవా ! అని అర్థం. ఓం ఇతి స్మర- అంత్య సమయంలో 'ఓం' అని స్మరించుమని వేదం మనకు చెబుతుంది.

గర్భంలో ఉండినదగ్గరనుండి మనుష్యుడు పుట్టిపెరిగి మరణించే వరకు శరీరానికి పదహారు కర్మలు చేయవలయునని మనవాళ్ళు విధించారు. గర్భాదానమని, పుంసవనమని, సీమంతమని. నామకరణమని, ఉపనయన మని యిలా 16 కర్మలు విధించారు. చివరికర్మ అంత్యేష్టి. అంత్యేష్టిలో చనిపోయిన శరీరాన్ని తగులబెట్టాలి. శరీరాలను పూడ్చడంకంటె తగుల బెట్టడం శ్రేయస్కరం. ఎందువల్లనంటే, ఒక మనిషిని పూడ్చడానికి పట్టే చోటులో చాలా శవాలను భస్మం చేయవచ్చు. స్మశానం కొద్దిదైనప్పటికి ఎన్నివందల శవాలనైనా అందులో తగులబెట్టవచ్చు. చనిపోయిన శవాలను పూడ్చటం వాటికి గోరీలు కట్టడంకారణంగా, క్రైస్తవమహమ్మదీయుల స్మశానాలు పెరుగుతాయి. పెద్దపెద్ద పట్టణాలలో సైతము ఈ స్మశానాలు ఎంతో చోటును ఆక్రమించుతాయి. చాల భూమి నిరుపయోగంగా ఈ స్మశానాలక్రింద ఉంటుంది. అందుచేత శవాలను పూడ్చడంకంటె ...లబెట్టడమే శ్రేయస్కరం, ఆరోగ్యదాయకంకూడ. శవాలను ...డంవలన ఇంకొక దోషముంది. అవి అనేకరోజులకుగాని క్రుళ్ళి ...కలియవు. అంతవరకు శవాలను పూడ్చిన యీ సమాధులనుండి ...పూరితమైన వాయువు బయలుదేరుతుంది. ఆ వాయువును పీల్చిన ప్రాణికోటికి అనారోగ్యము, హాని కలుగుతుంది. పార్శీలు శవాలను తగులబెట్టరు. వారు ఎత్తైన ప్రదేశాలలో శవాలను పక్షులకు వదలివేస్తారు.

కాకులు, గ్రద్దలు పీక్కుతుంటాయి. ఇలా వ్రేలాడగట్టడంలో వారిఉద్దేశ్యం శరీరం వృధాకాకుండా కొన్ని ప్రాణులకు ఆహారంగా ఉపయోగపడటమే. కాని యిందులోకూడ దోషముంది. రోగగ్రస్తుడైన మనిషి చస్తే ఆ శరీరాన్ని తిన్న పక్షులుకూడ వ్యాధికి గురికావడమో లేక చావడమో జరుగుతుంది. కొందరు శవాలను ప్రవాహములో పడవేస్తారు. అలా వేయరాదు. నీటిలోని జంతువులు శవాన్ని తినడంచేత అవికూడ రోగగ్రస్తమౌతాయి. కనుక శరీరాన్ని ఎప్పుడైనా భస్మం చెయ్యడమే ఉచితం; ఉత్తమంకూడ. శవాన్ని దహనంచేసే కర్మను అంత్యేష్టి అంటారు. దీన్నే 'నరమేధము' లేక 'నరయాగము' అని కూడ అంటారు. మనిషి శవాన్ని కూడ యజ్ఞము చేసినట్లు చేసి దహనం చెయ్యాలి. ఇది వైదిక సంప్రదాయం.

'ఓం స్మర'- 'ఓం' అని స్మరించుమంటుంది వేదం. పరమేశ్వరునికి అనేక నామాలున్నాయి. విష్ణువు, శివుడు, బ్రహ్మ యిలా భగవంతునికి చాలా నామాలున్నాయి. కాని యీ నామాలన్నింటికంటె 'ఓం' పరమేశ్వరునికి ముఖ్యమైన నామం. 'ఓం' అనేది అవ్యయం. అంటే నశించనిది. ఎప్పుడూ ఒకటిగానే ఉంటుంది. దీనిలో మార్పుండదు. కాని మిగిలిన నామములు అలా కాదు. ఆ నామములకు విభక్తులను జోడించడం జరుగుతుంది. వాటికి మార్పులను తేగలం. 'ఓం' అంటే రక్షకుడని అర్థం. 'ఓం' అను వర్ణము 'అ'కార, 'ఉ'కార, 'మ'కార సమన్వితం. ధ్వనిశాస్త్రమంతా యీ మూడింటిలో ఉంది. మీరు నోరుతెఱచి శబ్దించారనుకోండి అప్పుడు 'అ' అనే శబ్దం వస్తుంది. నోరు సగంమూసి శబ్దంచేశారనుకో అప్పుడు 'ఉ' వస్తుంది. అలాగే నోరు సాంతమూ మూసి ధ్వనిచే అనే శబ్దం వస్తుంది. ఇది 'మ'కారం. ఇలా ఓం అనే పదం ఉకార, మకారములతో ఏర్పడింది. అందుకనే పరమేశ్వరుని నామములన్నిటిలో ఇది ఉత్తమమని ఎంచబడింది.

ఇలాంటి పరమోత్కృష్టమైన పరమేశ్వరుని నామమును జపించడానికి అందరికీ అధికారం ఉంది. కాని కొంతమంది ఈ నామము (ఓం)ను గుత్తకు తీసుకున్నట్లుగా వ్యవహరించుతున్నారు. 'ఓం'ను సంన్యాసులే స్మరించాలనేవారు కొందరు. కొందరు బ్రాహ్మణులే దీనిని స్మరించాలనేవారున్నారు. కొందరికి ప్రణవాన్ని ఉచ్చరించే అర్హత లేదని, వారు 'ఓం'ను స్మరించితే నాశనమయిపోతారని చెప్పే ప్రబుద్ధులుకూడ యీనాడున్నారు. ఇదంతా కొందరు స్వార్థపరులు కల్పించుచున్న కట్టుకథలేకాని వేరు కాదు. పరమేశ్వరుడు అందరికీ తండ్రి. అలాంటి పరమేశ్వరుని నామాన్ని అందరూ జపించవచ్చు. ఇందులో స్త్రీ, పురుష విభేదంకాని,- సంన్యాసులని, గృహస్థులని, బ్రహ్మచారులనే భేదంకాని,- వీడు శూద్రుడు, వీడు అంత్యజుడు, వీడు బ్రాహ్మణుడనే హెచ్చుతక్కువలుగాని ఏమీ లేవు. అందరూ జపించవచ్చు.

రామాయణము రచించిన వాల్మీకికి నారదుడు రామమంత్రం ఉపదేశించాడని, వాల్మీకి 'రామ' పదాన్ని యథాతథంగా ఉచ్చరించలేక 'మరా' అన్నాడని అంటారు. మరా అన్నవాడు రామ అని ఎందుకనలేడు. (సభలో నవ్వులు). ఇదంతా రామపదానికి మహత్తు కల్పించటానికి చెప్పే మాటలు తప్పితే వేరేమీ లేదు. రామ, కృష్ణ పదాలను మూగవారు మాట్లాడలేరు. కాని 'ఓం'ను మూగవారుసైతము అనవచ్చు. దానిని ఉపాసించవచ్చు. అన్యమతస్థులుకాని, మన భాష రానివారుకాని ఎవరైనా ప్రణవమును ను) స్మరించుటకు వీలున్నది.

ఓం ను స్మరించడంచేత శరీరములోని ప్రాణములకు ఊర్ధ్వగతి ది. జీవుడు దేహమును విడిచేటప్పుడు ఊర్ధ్వద్వారాలనుండిగాని రాలనుండిగాని వెళ్ళుతాడు. అధోద్వారాలైన గుదము, ఉపస్థల చనిపోతే క్షుద్రయోనులలో జన్మిస్తాడని, ఊర్ధ్వద్వారాలైన, నోరు, ముక్కు, చెవులు వీటిద్వారా చనిపోతే జీవునికి ఉత్కృష్టజన్మ

సిద్ధించుతుందని శాస్త్రం చెబుతుంది. కనుక జీవుడు దేహం విడిచేటప్పుడు శరీరంలో ఊర్ధ్వంగా పోవాలి. 'ఓం'ను స్మరించడంవలన జీవునికి అలాంటి ఊర్ధ్వగతి కలుగుతుంది. అపుడు ప్రాణాలతో జీవుడు ఊర్ధ్వ గతుడై శరీరాన్ని వదలిపెడతాడు. ఓంను నిత్యం స్మరణచేస్తేగాని యిలా ఊర్ధ్వగతి కలుగదు. ఎప్పుడో మరణసమయంలో అనుకుంటే సరిపో తుందిలే అంటే కుదరదు. తరువాత బ్రహ్మరంధ్రముద్వారా జీవుడు శరీ రాన్ని వదలిపెడితే ముక్తి సిద్ధించుతుందని మీరు వినే ఉంటారు. ఈరంధ్రం నడినెత్తిని ఉంటుంది. పసిపిల్లల మాడుచూస్తే మన కది తెలుస్తుంది. అచట మెత్తగా ఉంటుంది. పిల్లలు పెద్దయ్యేకొద్దీ అది గట్టిపడుతుంది. సామాన్యజనులలో ఈ బ్రహ్మరంధ్రం మూసుకొని ఉంటుంది. పూర్ణ సిద్ధుడు మాత్రమే యీ ద్వారం భేదించగలుగుతాడు. అప్పుడతనికి ముక్తి సిద్ధిస్తుంది.

ఓం కాక ఇతర నామములతో పరమేశ్వరుని స్మరించరాదని నే ననడం లేదు. కాని ఆ నామము లన్నింటికంటె ఓం ఉత్తమనామమని అంటున్నాను. 'తస్య వాచకః ప్రణవః'- (యో. ద. 1-27) అతని నామ ధేయము ఓం అని. 'తజ్జపః తదర్థ భావనం'- (యో. ద. 1-28) ఓంను స్మరించుట-దాని అర్థమును భావించుటవలన చిత్తైకాగ్రత కలుగుతుంది అని పతంజలి మహర్షి తమ యోగదర్శనంలో చెప్పాడు. ఓం అంటే రక్షకుడు అని చెప్పాను. ఓంను స్మరించుతున్నంత సేపూ పరమేశ్వరుడు రక్షకుడు అనే భావం గుర్తుంచుకుంటూ ఉండాలి. ఓంను అంతిమస్థితిలో స్మరించా లంటే ప్రతినిత్యం జపం చెయ్యాలి. ఒక్కసారి జపించితే చాలదు. పోయే సమయంలో ఓంను స్మరించడం తేలికపనికాదు. నిత్యా అభ్యాసం చేస్తేగాని అంతిమసమయంలో ప్రణవమును ఉచ్చరించ

గాంధీజీని పిస్తులుతో కాలిస్తే, మొదటిగుండు తగలడంతోనే అప్రయత్నంగా 'రాం' అన్నాడు. మళ్ళీ కాలిస్తే 'రాం' అన్నాడు.

రామనామ స్మరణతోనే గాంధీజీ దేహత్యాగం చేశాడు. అంటే రామనామమును ఆయన అంత గాఢంగా స్మరించాడన్నమాట. అలాగైతే : ప్రణవ నామమును స్మరించుమని మీరు చెబుతూ, గాంధి రామనామం స్మరించాడని చెబుతున్నారు గదా ! మరి రామనామమునే ఏల స్మరించరాదు ? అని మీరడుగవచ్చు. ఆయనను మేము ఢిల్లీలో ఒకమారు మీరు స్మరించే రాము డెవరని ప్రశ్నించాము. ఆయన రామాయణం సత్యచరితమని ఒప్పుకోడు. రామునివలె వర్తించాలి, రావణునివలె వర్తించరాదు; అనే నీతిని బోధించడానికి రామాయణం రచించబడింది. రామాయణం కల్పిత గాథ అని గాంధీజీ అంటాడు. ఆయన, నేను స్మరించేది దశరథరాముణ్ణి కాదు. అంతరాత్మను 'రామ' పదంతో స్మరించుతాను అన్నాడు. మరి మీరు పరమేశ్వరుణ్ణి రామ పదంతో స్మరించితే లోకులు మీరు దశరథ రాముణ్ణే స్మరించుతున్నారనే భ్రమలో పడరా అని అడిగాము. అందు కాయన, నాకు రామ పదం చిన్నప్పుడు *దాది ఉపదేశించింది. నా కది అలవాటైంది. యిప్పుడు మానాలంటే మానలేను. నేను దశరథరాముణ్ణి స్మరించేటట్లయితే 'ఈశ్వర, అల్లా తేరేనాం' అని నేను ఎందుకంటాను ? నేను స్మరించేది ఆత్మారాముణ్ణే అనికూడ వారు జవాబిచ్చారు.

ఓం ను వదలి రామకృష్ణాది నామాలను స్మరించడంలో ఒక చిక్కుంది. మనం రామ కృష్ణుల కథలను చిన్నప్పటినుండి విని ఉండటం చేత రామ అనగానే సీతాపతి, లక్ష్మణాగ్రజుడు దశరథరాముడు గుర్తుకు ... మరి యీ రాముడు పరమేశ్వరుడు కాదు. సృష్టిస్థితి లయకార... అలాగే కృష్ణుని కథలు వినిఉండటంచేత ఓంకు మారుగా ... స్మరించడంచేత జారచోర శిఖామణి, కంస సంహారకుడు, ...ల్లభుడు, దుకూల వస్త్రాపహారి మనకు గుర్తుకు వస్తాడు. ఎవ

---

*...' అను పేరుగల దాది గాంధీజీ కుటుంబంలో ఉంటుండేది.

రన్నా సృష్టిస్థితి లయకర్తను గుర్తుచేసుకొని రామకృష్ణాది పదములను స్మరించితే మాకేమీ అభ్యంతరం లేదు.

ఇంకొక విశేషమేమిటంటే- ఓం పదం భగవద్వాచకం. కాని, మరొకరిని తెలుపదు. అందుచేత దీనిని స్మరించడంచేత మనకు వ్యక్తులు గుర్తుకు రారు. ఇలాంటి విశిష్టగుణా లనేకం ఓంను స్మరించడంలో ఉన్నాయి. కనుక మరణ సమయంలో ఓంను స్మరించుతూ మరణించాలని వేదం చెబుతుంది.

'క్లిబే స్మర'- స్వసామర్థ్యంకొఱకు పరమేశ్వరుని స్మరించు అంటుంది వేదం. పరమేశ్వరుడు మనకు శరీరాన్ని, బలమును ఇస్తాడు. కనుక మనం ఈ శరీరంతో సత్కర్మలు చేయాలి. సత్కర్మలు బలవంతుడే చేయగలుగుతాడు. బలహీనుడు దుష్కర్మలు చేస్తాడు. మనం పరమేశ్వరుని బలము నిమ్మని కోరటంలో ఉద్దేశం అదే. 'కృతగ్ం స్మర'- చనిపోయేటప్పుడు పూర్వం నీవు ఏమిచేసినది స్మరించు.

'వాయు రనిల మమృత మథేదగ్ం భస్మాంతగ్ం శరీరమ్' వాయువనకు అనిలమునకు సూక్ష్మభేదం ఉంది. వాయువు అంటే శరీరమునందుండే ధనుంజయాది ప్రాణవాయువు. అనిలం అంటే సూక్ష్మవాయువు. స్పర్శతన్మాత్ర సూక్ష్మవాయు వనబడుతుంది. ఇది అమృతం - అంటే నాశనములేని ప్రకృతిలో లీనమౌతుంది. శరీరం భస్మం అంతముగా కలది. అంటే శరీరాన్ని దహించినపుడు దానిలోని పృథివి మొదలైన భూతములు వాటివాటి మూలతత్త్వములలోనికి చేరుతాయి. శరీరాన్ని దహించేట నెయ్యి మొదలగు పుష్టికారక పదార్థములను, మూలికాద్రవ్యములతో దహించాలి. అలా చెయ్యటంవల్ల యీ వాయువును పీల్చుకున్న కోటికి చాల తక్కువ అపకారం జరగటానికి వీలుంది. శవాన్ని విధంగా దహించడం మన వైదిక విధి. యిలా యీ మంత్ర పంగా అర్థం చెప్పుకున్నాం.

అగ్నే ! నయ సుపథా రాయే అస్మాన్
విశ్వాని దేవ వయునాని విద్వాన్
యుయోధ్యస్మజ్జుహురాణ మేనో
భూయిష్ఠాంతే నమ ఉక్తిం విధేమ ॥ ౧౬

భావార్థము :- ఎవరు సత్యభావముతో పరమేశ్వరు నుపాసింతురో, శక్తికొలది అతని ఆజ్ఞలను పాలింతురో, అతనినే (సర్వోపరి) అందరి కంటె ఎక్కుడుగ సత్కరింప దగినవాడని యెంచెదరో [illegible] దయాళు వగు పరమేశ్వరుడు పాపాచరణమునుండి వేరుచేసి [illegible] పును. వారికి విజ్ఞానము కలుగజేయును. [illegible] సాధింప సమర్థులను జేయును. కావున [illegible]డగు ఆ పరమేశ్వరుని దక్క యితరుల నెన్నడు ఉపాసింపరాదు.

ఈ మంత్రంలో మనం పరమేశ్వరుని ప్రార్థిస్తాం. ఏమని ? ప్రకాశ స్వరూప ప్రభూ ! మమ్ములను సుపథా-మంచిమార్గాన, నయ-నడుపుము అంటా[illegible]. నడుపు అంటే ఆయన నడుపడు. మనమే మంచి మా[illegible] మన మాయనను ప్రార్థిస్తున్నామంటే అర్థము, మంచి [illegible] సంకల్పించుకుంటున్నామని. సంకల్పించుకొని ఊరు[illegible]ం నెరవేరడానికి తగిన ప్రయత్నంకూడ చెయ్యాలి. [illegible]మానుండి జుహురాణం-కుటిలమైన, ఏనం-పాపాచరణమును [illegible]ము [illegible]డ ఇందులో ప్రార్థిస్తాము. పాపము అంటే ఏమిటి ? [illegible]నను అస్వస్థత కలిగించే పనులు చెయ్యడం. [illegible]ం సాధారణ పాపం. నిన్నటిదినం ఒక డాక్టరు ద[illegible] ఉండి [illegible]ు. ఆయన పెద్ద డాక్టర్ (Heart Specialist) గుం[illegible] వైద్యుడు. కాని నేనక్కడున్న కాసేపటిలోనే

రెండు మూడు సిగరెట్లు కాల్చాడు. ఆయన వాలకము చూస్తే చాల బక్క పల్చగా ఉన్నాడు. పైగా (Chain Smoker) ఎడతెఱపిలేక పొగత్రాగు వాడుగా కనుపించాడు. ఆయన ఆరోగ్యము యిక ఎలా ఉంటుందో ఊహించుకోండి. నేనుండలేక ఆయనతో అన్నాను. మీరు 'హార్ట్ స్పెష లిష్టు' కదా! పొగత్రాగడం శ్వాసకోశములకు, గుండెకు మంచిదికాదని మీరు రోగులకు సలహాకూడ ఇస్తారుకదా! అలాంటి మీరే యిలా నిరం తరం సిగరెట్లు కాల్చితే ఇక రోగి కేమి నమ్మకం కుదురుతుంది? వ్యాధి ఏం నయమవుతుంది అని అడిగాను (సభలో చిరునవ్వులు). నా మాటలకు ఆయన కొలదిగా నొచ్చుకున్నాడు. మీరు చెప్పింది వాస్తవమె. కాని నేను యిదొక్కటి మానలేకుండా ఉన్నానండి అని తన అశక్తతను వ్యక్తం చేశారు.

అలాగే కల్లు, సారాయి సేవించడం, వ్యభిచరించడం యిలాంటివి పెద్ద పాపాలు. వీటినుండి సాధకుడు వైదొలగాలి. అందుకొరకై నిత్యం పరమేశ్వర ప్రార్థన చెయ్యాలి. ఈ పాపాలకు దూరంగా ఉండాలనే సంక ల్పాన్ని తన ప్రార్థనద్వారా దృఢం చెయ్యాలి. ఊరికే అనుకుంటే లాభం లేదు. 'ధియో యోనః ప్రచోదయాత్'- పరమేశ్వరా, మాకు సద్బుద్ధి నివ్వవలసినది అని నిత్యం ప్రార్థించాలి. భగవంతుణ్ణి ఎలా ప్రార్థన చేస్తామో అలా మనం ఆచరించాలి. మనం పాపాలుచేస్తే ఆయన తప్పిస్తా డనుకోరాదు. చేసిన పాపములకు తగిన ఫలితం తప్పకుండ మనం అనుభ వింపవలసి ఉంటుంది. చింతాకంత కూడ తీసివెయ్యడు.

హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపి హితం ముఖమ్
యోఽసా వాదిత్యే పురుషః సోఽసావహం ఓమ్
ఖం బ్రహ్మ ॥ ౧౭

భావార్థము :- పరమేశ్వరుడు మనుజుల నుద్దేశించి యిట్లుపదేశించు చున్నాడు. ఇక్కడ నెల్లయెడల నున్న నేనే సూర్యాది లోకములందు నున్నాను. సూర్యాది లోకములం దంతట నున్న నేనే యిక్కడను ఉన్నాను. ఆకాశమువలె అంతటను వ్యాపకుడనై యున్న నన్ను మించిన వస్తు వొండు లేదు. నేనన్నిటికంటె గొప్పవాడను. సులక్షణయుక్త పుత్రునివలె ఎవడు ప్రాణప్రియమగు నా నామము 'ఓమ్' ను భక్తితోను సత్యాచరణముతోను శరణుజొచ్చునో, అంతర్యామి రూపమున నేనతని యవిద్యను నశింపజేయుదును. ఆతని యాత్మను ప్రకాశింపజేయుదును. శుభగుణ కర్మ స్వభావయుక్తు నొనరింతును. సత్యస్వరూపమగు నాచరణ మును స్థిరమొనర్చి, శుద్ధమగు యోగజ ధర్మమును ప్రసాదించి, సర్వ దుఃఖములనుండి అతనిని వేరుచేయుదును. మోక్షానందమును కలుగ జేయుదును.

హిరణ్మయుడు అంటే పరమేశ్వరుడు. ఆయన 'సత్యస్యాపి హితం ముఖం' - ఈ ప్రపంచాన్ని ఆవరించి కప్పిఉంటాడు. అంటే ప్రపంచమంతటా లోపల వెలుపల వ్యాపకుడై ఉన్నాడని అర్థం. ఇచట మనమొకటి గుర్తించాలి. పురుషుడు (పరమేశ్వరుడు) ఎలా నిత్యుడో (ప్రపంచం కూడ) కారణరూపంలో నిత్యమే. సూర్యాది గోళములలోను సమస్త జీవులలోను పరమేశ్వరుడే వ్యాపించి ఉన్నాడు. అక్కడ వ్యాపింని [illegible]రమేశ్వరుడే యిక్కడకూడ వ్యాపించి ఉన్నాడు.

[illegible]నాడు ధార్మిక క్షేత్రానికి అధినేతలమని చెప్పుకునే చాలమంది [illegible]బోధ గురువులు కారు; కేవలం బాధ గురువులుగా ఉంటున్నారు. ధనాదులను హరించి ప్రజలను పీల్చి పిప్పిజేయడమే పనిగా పెట్టుకుంటున్నారు. జిజ్ఞాసువు అయిన శిష్యుడు గురువు దగ్గరకువెళ్ళి తత్వ

బోధ చేయమంటే మొదట తాను దేవుణ్ణని సిద్ధాంతీకరించు కుంటాడు. అందుకని ఒక శ్లోకం కూడ యిలా చదువుతాడు.

గురు ర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుః సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥

గురువు త్రిమూర్తుల స్వరూపమేకాకుండా సాక్షాత్ పరబ్రహ్మమే నట। ఇలా శిష్యునకు మొదటే అజ్ఞానం కలిగిస్తాడు.

'గురుపాదోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే' – గురువుగారి పాదములు కడిగి ఆ నీటిని త్రాగితే ఇక జన్మ ఉండదట। గురువుగారి పాదములకు పేడ, మట్టి, యిలాంటిమలినాలు కూడ అంటుకుంటాయి అవి కూడ కడిగి త్రాగవలసిందే మరి। (సభలో నవ్వులు)

'గురోరుచ్ఛిష్ట భోజనం అమృతం' – గురువుగారి ఎంగిలి అమృతమట। అది తిన్న శిష్యుడు చావడట। (సభలో నవ్వులు)

అలాగే గురువులో లోభాది గుణాలు ఉంటే, అవి శిష్యుణ్ణి పరీక్షించడానికేగాని, నిజానికవి గురువుగారికి లేవని సమాధానం.

సరే. శిష్యునికి గురువు ఏదైనా బోధ చేశాడంటే తెలిసీ తెలియకుండ బోధ చేస్తాడు. పూర్తిగా తెలిసేట్లు చెబితే మళ్ళీ శిష్యుడు వద్దకు రాడని, ముడుపులు చెల్లించడని భయం. అసలు చాలమంది లకు తాము చెప్పేదేమిటో తమకే తెలియదనుకోండి। విప్ర సినిమాలో రేలంగి అంటాడు. వేదాంతమంటే, తనకు తెలి ఇతరులకు తెలియకుండ చెప్పడమే వేదాంతం అని (సభలో నవ్వులు). చదువుకున్నవారు కూడ ఇలా మభ్యపరచి జనులను మోసంచేస్తున్నారు.

అందుచేత బాగా పరీక్షించిన తరువాతనే శిష్యుడు ఎవరినైనా గురువుగా అంగీకరించవలసి ఉంటుంది.

'ఓం–ఖం–బ్రహ్మ' – పరమేశ్వరుడు రక్షకుడు – ఆకాశమువలె సర్వత్ర వ్యాపించినవాడు – గొప్పవాడు అని అర్థం. ఇలా పరమేశ్వర స్వరూపమును గుర్తించి, ఆయన నామమైన 'ఓం' ను స్మరించి అందరూ ముక్తులు కావడానికి ప్రయత్నించడం ఉచితం.

గురు శుశ్రూష చేసి నానేర్చిన విధంగా, తోచినవరకు చెప్పాను. పరమేశ్వరుని కృపవల్ల యివ్వాళ్ళతో ఈశావాస్యోపనిషత్తు చెప్పడం పూర్తయింది. ఋషులు కానివాళ్ళు వ్రాసిన భస్మోపనిషత్తు, రుద్రాక్షోపనిషత్తు ఇలాంటి వనేకం నేడు లభ్యమవుతున్నాయి. కాని అవి మనకు ప్రమాణములు కావు. మొత్తం పది పదునొకండు ఉపనిషత్తులనే శంకర, రామానుజాది ఆచార్యులు అంగీకరించి వానికి తమ తమ మతానుకూలముగా భాష్యములను వ్రాసియున్నారు. మిగిలినవి శంకరునికి పూర్వం లేకనైనా ఉండాలి. లేక ఆయన వాటిని ప్రమాణములు కావని నిరాకరించి అయినా ఉండాలి.

భాష్యకారులలో మధ్వాచార్యులు మాత్రం ఋగ్వేదములో 10 సూక్తముల వరకు భాష్యము వ్రాశారు, కాని శంకర రామానుజులు వేదము నంటలేదు. [illegible]లు వేదమంత్రాలు 17 మాత్రమే ఉండగా ప్రచలిత ఈశా[illegible]షత్తులలో, ఒకమంత్రం ఎక్కువ వుంది. శంకరుడు కూడ ఈ భాష్యము వ్రాసినాడు. కాని అది ఉపనిషత్ భాష్యమేకాని కాదు.

[illegible]దములు మళ్ళీ సంఘంలో ప్రచారం కావాలి. అప్పుడే దేశం [illegible]ంది. మూఢ విశ్వాసాలు పోతాయి. స్త్రీ పురుష విభేదం

లేకుండా అందరూ వేదములను ప్రచారంచేసిన రోజులున్నాయి. ఇతర దేశస్థులు కూడ మనదేశం వచ్చి విద్యాబుద్ధులు నేర్చుకున్నారు.

నేను చెప్పిన మాటలు మీమీ బుద్ధితో యోచించి హేతుబద్ధంగా అంగీకారయోగ్యంగా ఉన్నవి గ్రహించండి. ఏవైనా దొసగులుంటే విడిచి పెట్టండి.

ఓం ద్యౌః శాంతి రంత రిక్షగ్ం శాంతిః పృథివీ శాంతి,
రాపః శాంతిః ఓషధయః శాంతిః వనస్పతయః శాంతిః
విశ్వే దేవాః శాంతిః బ్రహ్మశాంతిః సర్వగ్ం శాంతిః
శాంతిరేవ శాంతిః సామాశాంతి రేధి ॥







మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA104B166 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 213 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI,10,BCI |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Navya |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |